

కరుణాంతరంగ "మధుర" మీనాక్షి కొలువు దీరిన కోవెల ఇది!
తమిళనాడు శిల్ప ప్రాభవానికి అంబరమంటిన సాక్ష్యం ఇది!!

వైవిధ్య నవలావేదిక

# చతుర

సంపుటి : 28 సంచిక : 4

మే : 2005 328వ సంచిక

## ఈ సంచికలో...



బొమ్మలు: కె. శివాజీ

కవర్ పేజీ ఫొటోగ్రాఫర్: రంగనాథ్ ఎస్. భరద్వాజ్

మోడల్: రాధికారాణి

# ఫ్రీ...ఫ్రీ...ఫ్రీ...

ఇం దుగలదందులేదని సందేహంబు వలదు..

ఎందెందు వెతికినా ఈ 'ఫ్రీ' అనేది.. అందందే కలదు...

ఒక బిందె కొంటే.. ఇత్తడి చెంబు ఫ్రీ

టార్చిలైటు కొంటే.. బ్యాటరీలు ఫ్రీ

జైలుకి వెళితే.. సెల్‌ఫోన్లు ఫ్రీ

రాజకీయనాయకులుగా మారితే... ఢిల్లీ ప్రయాణం ఫ్రీ

అసలు విషయం ఏమిటంటే...

డాక్టర్లకు ప్రైవేటు ప్రాక్టీసు ఫ్రీ

కాంట్రాక్టర్లకి.. టెండర్లు ఫ్రీ

ఉద్యోగులకు... లంచం ఫ్రీ

ఉపాధ్యాయులకు... ప్రైవేట్లు ఫ్రీ

ప్రజాప్రతినిధులకు... పర్సంటేజీలు ఫ్రీ

చివరికి ప్రజలకీ ఐదేళ్లకు ఓసారి వచ్చే. 'ఓటు' ఫ్రీ

అసలు ఈ ఫ్రీ పదం ఎక్కడ నుంచి వచ్చిందని ఆరా తీస్తే..

రాజులకాలంలో వజ్రవైఢూర్యాలు మణిమాణిక్యాలు, అగ్రహారాలు, అడిగిన వారికి కాదనకుండా ఉచితంగా ఇచ్చేసేవారంట..

అదే కృతయుగంలో అయితే బలిచక్రవర్తి మూడు అడుగుల నేలే ఫ్రీగా ఇచ్చాడు..తర్వాత ఫలితం అందరికీ తెలిసిందే!

త్రేతాయుగంలో దశరథుడు..కైకేయికి మూడు వరాలు ఫ్రీగా ఇచ్చాడు..అదే రామాయణం కథకు టర్నింగ్ పాయింట్..

ద్వాపరయుగంలో పాండవులు...ఐదు ఊర్లు ఫ్రీగా అడిగారు..కుదరలేదు..కురుక్షేత్రం జరిగిపోయింది..

అదే కలియుగంలోకి వస్తే.. దేవుడిగుడికి వెళ్లామనుకోండి..

ఫ్రీ దర్శనం..దాని పక్కనే స్పెషల్ దర్శనం తప్పదు.

ఏమిటీ ఫ్రీ వాగుడూ అనుకుంటున్నారా!

నాది ఇలాగే ఉంటుంది.. అదే రాజకీయ నాయకులు వాగ్దానాలు, హామీలు ఫ్రీగా ఇచ్చేస్తున్నా పట్టించుకోరు..

ఇంతకీ విషయం ఏమిటంటే...

ఇంట్లో, వీధిలో, ఊరిలో, పొలంలో ఒకేసారి కరెంటు పోయింది.. ఏంచేయాలో తోచక.. ఆచీకట్లోకి చూస్తూ ఆలోచిస్తున్నాను..

**వ్యంగ్య రచన**

ఇన్ని ఫ్రీలు గుర్తొచ్చాయి.. అసలైనదీ గుర్తురాలేదు..అదేలెండి! మన ప్రభుత్వం ఇచ్చిన ఫ్రీ..కరెంటు

సింపుల్‌గా ఇచ్చేశారు.. సింపతీ క[illegible] లేకుండా షాక్ కొట్టింది.

ఏదో ఒక రోజు గ్రిడ్ కుప్పకూలడ[illegible] ఖాయమన్న ట్రాన్స్‌కో అధికారుల మాట[illegible] గుర్తొచ్చాయి.

కొంపదీసి అలా జరగలేదు కదా! అను[illegible]న్నాను.

అసలే మట్టికుండ.. దానికి ఫ్రీ అనే కన్నం కొడితే ఏమవుతుంది. చిల్లు కుండలా మారుతుంది. గ్రిడ్‌ల పరిస్థితి అలా ఉంది.

అసలు కరెంట్‌లోనే రెంటు ఉంది.

అద్దెకట్టాలన్నట్టు ఆ పదమే అలా ఉంటే..ఇంకా ఫ్రీ, ఫ్రీ అనడంలో అర్థమే లేదు కదా!

కనీసం మహారాష్ట్రవారిని ఆదర్శంగా తీసుకోకపోతే ఎట్లా!

వారు కూడా ఎన్నికల్లో ఉచితంగా కరెంటు ఇచ్చేస్తామని హామీల మీద హామీలు గుప్పించారు..

గెలిచిన తర్వాత.. ఏమన్నారో తెలుసా!

4 మే 2005

'ఎన్నికల్లో ఎన్నో చెబుతాం.. అవన్నీ సాధ్యమా!' అని తిరిగి ప్రజల్నే ఎదురు ప్రశ్నించారు.

ఖచ్చితంగా మాటమీద నిలవలేకపో యారు.. అదీ అంతే ధైర్యంగా చెప్పారు.

నేను ఇంకా మాటమీద నిలబడ తాను.. అంటాడీయన

లేదు.. నీవు మాటతప్పావంటాడు.. ఎదు రింటాయన

'తానోడి నన్నోడెనా.. లేక నన్నోడి తానో డెనా!' ఇది ఎన్టీఆర్ పౌరాణిక సినిమాలో ద్రౌపది డైలాగ్.

కాని ఇక్కడ ప్రజలు తమకు తామే ఓడి పోయారు.

ఆఖరికి నిండుకొలువులో ద్రౌపది వస్త్రాప హరణం సీన్‌లా మారింది.

ఫ్రీ పవర్ పరిస్థితి కూడా.

ఆనాడు 'అన్నా!' అని ద్రౌపది పిలవగానే కృష్ణుడు రయ్‌మని వచ్చాడు..

కాని, ఇప్పుడు ఎవరొస్తారు!

నిజానికి పవర్ పేరు చెప్పి ఒకపార్టీ పవ ర్‌లోకి వస్తే.. ఇవ్వలేమని తేల్చి చెప్పిన ఓపార్టీ.. పవర్ పోగొట్టుకుంది..

అది పవర్‌కి ఉన్న శక్తి.. రాజ్యాలు కూల్చగలదు.. లేదా నిలబెట్టనూగలదు

వరండాలో స్విచ్ వేస్తే.. గదిలో లైటు వెలగడమంటే ఇదే!

ఒకనాటి ప్రతిపక్షనేతగా ఉన్నప్పుడు వ్యాఖ్యలను తీసుకుంటే...

'కరెంటు తీగలు ఎలా పాకాయో... అవి నీతి అలా వ్యాపించింది..

ఇటు అక్రమ కనెక్షన్లు, అటు అధికారుల అండదండలు, మరోవైపు లైన్‌లాసెస్, మెయింటినెన్స్ లోపం, గ్రిడ్‌ల వైఫల్యం, ఇంకోవైపు నాసిరకమైన పరికరాలు.. ఇలా శాఖోపశాఖలుగా వృధాని మిగల్చగలి గితే.. ఫ్రీ కరెంట్ అంత కష్టం కాదు..'

సీన్ కట్‌చేస్తే.. నేడు అధికారంలోకి వచ్చాక మాటలు వింటే..

'ఫ్రీ పవరు దుర్వినియోగమవుతోంది.. ప్రాజెక్టుల్లో నీళ్లు లేవు, ఉన్న గ్రిడ్‌లపైన అధికభారం, పక్కరాష్ట్రాల నుంచి ఎక్కువ రేట్లు పెట్టి కొంటున్నాం, ప్రభుత్వవాటాతో నిర్మించిన ప్రైవేటు ప్రాజెక్టుల వైఫల్యం, సబ్సిడీల భారం ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో ఉన్నాయి.

అందుకే రెండున్నర ఎకరాలు, మూడు మోటార్లు ఉన్న రైతులకే.. ఇక ఫ్రీ పవరు వర్తిస్తుంది.. అలాగే కొన్ని ప్యాకేజీలు ప్రక టిస్తున్నాం.. ఈ నిర్ణయంలో ఎటువంటి మార్పులేదు..'

అధికారంలోకి వచ్చినప్పటి నుంచి చూస్తూనే ఉన్నాం.. మార్పులు చేస్తూనే ఉన్నారు..

కాని ఏం లాభం? అంతా చివరికి శూన్యం..

ఎవరివల్లా కాక, అందరూ చేతులెత్తేశారు. ఇలాంటి పరిస్థితుల్లో సాధ్యాసాధ్యాలను పరి శీలించక అడగ్గానే వరమిచ్చే పరమశివుడిలా ఫ్రీ అనేసరికి..

అది.. పాలకడలిలో ఉద్భవించిన గర ళంలా తయారైంది.

చివరికి తనే మళ్లీ గరళకంఠుడిలా మారాల్సి వచ్చింది..

ఇప్పుడు మింగితే మఠాషు... ఊసేస్తే ప టాసు.

ఇదండీ ఫ్రీ కరెంటు గొడవ...

ఎందుకు ఫెయిలైందని.. ఒకే ఒక్క ముక్కలో చెప్పమంటారా?

ఫ్రీగా ఇచ్చారు.. ఫ్రీగా పోయింది..

అదీ విషయం..

చివరాఖరికి విషయమేమిటంటే.. ఇంతసే పైనా మాఊరికి కరెంటు రాలేదు..

ఇంకా చీకట్లో ఈ చిడతలు ఎంతవరకో.. ఉంటానండి!

– శ్రీనివాస్ మిర్తిపాటి

★

జ్ఞానతరంగిణి

# మహర్షి దాతాదయాల్ శివవ్రత్‌లాల్ వర్మన్‌గారి సందేశం

# పవిత్రత

పసిపిల్లలవంటి పవిత్రమైన మనసున్న మనిషే ఆత్మోన్నతిని పొందగలుగుతాడు.

అందుకే ఈర్ష్య, అసూయ, రాగద్వేషాలకు నీ మనసులో చోటివ్వకు. పసిపిల్లల మనసులాగా నీ మనసును నిష్కల్మషంగా, నిర్మలినంగా ఉంచుకో. అప్పుడే నీవు ఉన్నతుడవవుతావు.

పవిత్రత మనసులో ఉంటే సుఖశాంతులుంటాయి. పవిత్రత లేనివారు జీవన పర్యంతం దుఃఖితులుగానే ఉంటారు.

పవిత్రత మనిషిని దేవతగా మారిస్తే అపవిత్రత రాక్షసుడిగా తయారుచేస్తుంది.

మనసు పవిత్రంగా లేని మనిషి నిందింపబడతాడు. జీవన పరిణామం బాగుండదు. భయపడుతుంటాడు. శుద్ధమైన హృదయం కల మనిషికి ఈ దశ రాదు.

పవిత్రమైన మనసు నీకుంటే ప్రగల్భాలు పలుకకు. గొప్పలు చెప్పుకోవటం, నిన్ను నీవు పొగడుకోవటం కూడా మనసులోని మాలిన్యం వల్లనే జరుగుతుంది. నా హృదయం పవిత్రంగా ఉందని పిల్లలు ప్రత్యేకంగా చెబుతారా? వాళ్ళ హృదయం పవిత్రంగా ఉంటుందంతే! అది గ్రహించగలగాలి.

మనసులో పవిత్రత లేకుంటే నీవు నేర్చిన చదువులూ, రాతలూ, సైన్సు, ఫిలాసఫీ, జ్ఞానం, ధ్యానం, కర్మ, ఉపాసన అన్నీ నిరర్థకమే!



మహర్షి దాతాదయాల్ శివవ్రత్‌లాల్ వర్మన్

మనిషి తన ప్రవర్తనా పద్ధతులు మార్చుకోకుంటే అవి పెరిగి భూత ప్రేత పిశాచాల్లా అతన్ని బాధిస్తుంటాయి. భూతప్రేతాలు తమ పాపకర్మల కారణంగా ఆ వికృత జన్మలను ఎత్తవలసి వచ్చింది. సత్‌ప్రవర్తన అలవర్చుకోకుంటే ముక్తి లభించటం గగనకుసుమమే అవుతుంది.

వ్యక్తి భయరహితుడై ఉండటమే పవిత్రాత్మకు గుర్తు. మృత్యువెదురైనా అతను చలించడు. భయపడడు.

**అర్ధరాత్రి ఎవరైనా వచ్చి నీ ఇంటి తలుపులు తట్టినా నీవు నిర్భయంగా ఉండగలిగితే నీ మనసు పవిత్రంగా ఉందని అర్థం చేసుకో.**

మనసులో ద్వైదీభావన, చంచలత్వం, చెడుభావనలు లేకుండా ఉండాలి. ధనాన్నీ, స్త్రీనీ చూసినా చలించకుండా ఉండాలి. అలాంటి మనిషి మనసే పవిత్రమైందని చెప్పవచ్చు.

అపవిత్రమైన మనసుకు ధ్యానం కుదరదు. ధ్యానం సమయంలో అనేకమైన విచారాలు, ఆలోచనలు స్ఫురణకొస్తుంటాయి. నిద్రిస్తే దుస్వప్నాలు పీడిస్తాయి. జాగ్రదవస్థలో ధర్మ సిద్ధాంతాలకు విరుద్ధమైన పని చేయటంలో మనసు నిమగ్నమవుతుంది.

అపవిత్రుల మాటల్ని విశ్వసించడం కష్టం. పవిత్ర హృదయుడెప్పుడూ అసత్యాలు పలుకడు.

పవిత్రతలో సుఖం, అపవిత్రతలో దుఃఖం ఉన్నాయి. అపవిత్రత చెడుపరిణామాలకు కారణమైతే పవిత్రత సత్పరిణామాలకు మూలం.

మాసిన దుస్తులు విడిచి శరీరాన్ని శుభ్రంగా రుద్దుకుని స్నానంచేసి పరిశుభ్రమైన దుస్తులు వేసుకున్న తర్వాత నీ వెలాంటి శాంతినీ ప్రసన్నతనీ పొందుతావో మనసులోని మాలిన్యం తొలగిపోతే మనసుకు అంతకంటే ఎక్కువ ప్రశాంతత లభిస్తుంది.

మనోవాక్కాయ కర్మలతో పవిత్రుడవు కావాలి.

శరీరమూ, పరిసరాలు పరిశుభ్రంగా ఉండటం కూడా ఆనందానికి హేతువులే.

శరీరం పవిత్రంగా లేకుంటే మనసు కూడా పరిశుద్ధంగా ఉండదు. మనస్సు నిర్మలం కాకుంటే నీలోని చైతన్యశక్తి కూడా జాగృతం కాదు.

స్నానంచేసి పరిశుభ్రమైన దుస్తులు ధరించడం శరీరం యొక్క పవిత్రత. ఎవరినీ నిందించకుండా అందరికీ నచ్చే మాటలు మాట్లాడటం వాక్కు పవిత్రత అవుతుంది. దురాలోచనల్ని రానీయక మంచి ఆలోచనలనే పెంచుకోవడం మానసిక పవిత్రత అవుతుంది. ఈ మనోవాక్కాయములకు సంబంధించిన త్రివిధ పరిశుభ్రతే మనిషిని పరిపూర్ణుడిని చేస్తుంది.

చిన్న పిల్లల కదలికల్ని గమనించి వారిలాగా ప్రవర్తించాలని ప్రయత్నించు. పవిత్రత వారినుండే నేర్చుకో. వారు గురువుల్లా పనిచేస్తారు.



### ధర్మోరక్షతి రక్షితః

ప్రపంచంలో ధార్మిక జీవనం అమూల్యమైనది. ఇది లేకుంటే మనిషికి సుఖశాంతులుండవు. ధర్మమొక్కటే జీవనాన్ని సుఖసంపన్నం చేస్తుంది. లోకులు ధర్మాన్ని ఆచరించక దుష్ఫలితాలెదురయ్యాయని తల్లడిల్లిపోవటం చూస్తుంటాం. ఇక ధర్మాన్నీ, దైవాన్నీ, నిందిస్తుంటారు. ధర్మంలోని సూక్ష్మం, యధార్థ ప్రభావం వారికి అర్థంకాలేదు. ధర్మాన్ని నీవు రక్షిస్తే అది నిన్ను రక్షిస్తుంది.

ధర్మసూత్రాలు వల్లిస్తే ధర్మం పాటించినట్లు కాదు. ఆచరణ ముఖ్యం. ప్రతివారూ ధర్మసంపన్నులుగా ఉండాలని ధర్మశాస్త్రం ఉద్బోధిస్తుంది. ఆత్మ జ్ఞానమునకు ధర్మాత్ములే అర్హులనవచ్చు. కల్లబొల్లి కబుర్లు చెప్పి కాలక్షేపం చేసేవారికి ధర్మసంపద ప్రాప్తించదు.

సేకరణ, అనువాదం: **జ్యోతిరాణి**

★

# రచయితలకు ప్రత్యేకం

## కథలు-కబుర్లు (6)

సృజనాత్మక రచనలు చెయ్యటానికీ, దొంగతనం నేర్చుకోవటానికీ ఓ సారూప్య ముంది. (చౌర్యం కూడా ఒక కళే కదా), ఓ కథ.

గజదొంగకు వయసుమీద పడింది. కొడుక్కు బెంగ పట్టుకుంది. "నాన్నకు ఓపిక తగ్గిపోతున్నది. ఈ విద్య నేను నేర్చుకోక పోతే ఇంక ముష్టెత్తుకోవాల్సిందే".

కొడుకు కోరికను తెలుసుకున్న తండ్రి, 'అదెంత, క్షణంలో నేర్పిస్తాను' అంటూ ఒక నాడు వెంట తీసుకెళ్లాడు.

అర్ధరాత్రి ప్రహరీగోడలు దాటి, తలుపులు తెరిచి, ఓ సంపన్నుడి ఇంటిలోకి ప్రవేశించారు. భోషాణం చూపి, అందులో ఉన్నది తీసుకోమ్మన్నాడు తండ్రి. కొడుకు లోపలకి దిగగానే బయటినుంచి గొళ్లెంపెట్టి, 'దొంగ దొంగ' అని అరుస్తూ పారిపోయాడు. ఇంటి జనమంతా లేచారు గాని దొంగ కనిపించ లేదు. కొవ్వొత్తులు తీసుకుని ఇల్లంతా కలయవెతికారు. లోపల నక్కిన కొడుకు ఎలుక కొరుకుతున్నట్టుగా చప్పుడు చేశాడు. జనం భోషాణం తలుపు తెరిచారు. ఒక్కసారిగా బైటికి దూకి, కొవ్వొత్తులు ఆర్పి కాలికి బుద్ధి చెప్పాడు కుర్రదొంగ. కర్రలూ, రాళ్లూ తీసుకొని వెంబడించారు జనం. దార్లో ఓ బావి కనిపించింది. దొంగ బండరాయి తీసుకొని అందులోవేసి పొదల్లో దాక్కున్నాడు. జనం వచ్చారు. చూశారు. అందులో పడ్డాడనుకుని వెళ్లిపోయారు.

ఆ తర్వాత ఇంటికి చేరి తండ్రిని అనరాని మాటన్నాడు కొడుకు.

ఓపిగ్గా విని, చిరునవ్వు నవ్వి

"నాన్నా, నువ్వు భోషాణంలో నుండి ఎలా బైటపడ్డావో చెప్పు మొదట" అంటూ అడిగాడు తండి.

ఎలా, ప్రాణాలరచేత పట్టుకుని పరుగులంకించుకున్నాడో చెప్పాడు కొడుకు.

"నువ్వు చోర కళ నేర్చుకున్నట్టే" అన్నాడు తండ్రి తృప్తిగా.

చెబితే నేర్చుకునేది కాదు- తన అనుభవం నుండి, సమస్యల్నుండి, స్వంత తెలివితేటలతో, చాతుర్యంతో గ్రహించేది కళ.

★ ★ ★

ఆధునిక కథను మలుపు తిప్పిన ఇద్దరు యురోపియన్ రచయితలు మపాసా, చెహోవ్ (1860-1904). చెహోవ్‌కు స్వదేశం రష్యాలో ప్రాచుర్యం ఉండటంలో ప్రత్యేకత లేదుగానీ, ముఖ్యంగా ఇంగ్లండు, అమెరికాల లోని తరువాతి తరం రచయితలు అతణ్ణి తమవాడనుకున్నారు. పాశ్చాత్య కథలమీద ప్రగాఢ ముద్రవేసిన రచయిత చెహోవ్. కాథరైన్ మేన్స్‌ఫీల్డ్ నుంచి ఇప్పటిదాకా అందరూ చెహోవ్‌ను చదివే కథలు రాయటం నేర్చుకున్నామంటారు. చెహోవ్ కథలు సంక్షిప్తతలో, సగటు జీవుల కష్ట సుఖాలను వ్యంగ్యంగా, కరుణ రసాత్మకంగా చిత్రించిన కళాఖండాలే అయినప్పటికీ, అతడి డైరీలు, నోట్‌బుక్స్, లేఖలు చదివి కథా రచనలోని మెళకువలను గ్రహించారెందరో. "అందరికీ అన్నీ తెలిసిన" రోజుల్లో పాత విషయాలు నెమరేసుకుంటే ఎంతో కొంత ప్రయోజనం ఉండకపోదు.

***(తన అన్నయ్య అలెగ్జాండర్‌కు రాసిన లేఖలోనుంచి - 1886)***

... "నా అభిప్రాయంలో ప్రకృతి వర్ణన వీలైనంత తక్కువగా ఉండాలి. ప్రకృతి,

కథలో ఒక పాత్ర కావాలి. "సూర్యోదయ సూర్యాస్తమయ వర్ణనలు, బాలభానుని బంగారు కిరణాలు, నీలాకాశంలో బారులు తీరిన పక్షుల గుంపుల కిలకిలా రావాలు" నిషిద్ధం. ప్రకృతిలోని ఏ అంశాన్ని ప్రత్యేకంగా చిత్రిస్తే కథ మీద అది ఏ ప్రభావాన్ని కలిగించబోతున్నదో తెలుసుకోగల గాలి కథకుడు. మన వర్ణనను బట్టి పాఠకుడు ఆ దృశ్యాన్ని ఊహించుకోగలడా?

"వెన్నెల కిరణం ఒకటి పెంకుటింటి చూరులోంచి గదిలో ఉన్న గాజుసీసామీద పడి మెరిసింది" అంటే కథా, వర్ణనా కలిసిపోవూ! ప్రకృతి వర్ణన పాత్రలుచేసే పనులతో కలిసిపోవాలి. పాఠకుడు ముందే ఊహించగలిగింది మళ్లీ చెప్పటం రచయిత ప్రతిభకు నిదర్శనం కానేరదు. పాత్రల మనస్తత్వం వాళ్ల ప్రవర్తన ద్వారా తెలియాలి. సంబంధాలలో ఓ టెన్షన్. గురుత్వాకర్షణ శక్తితో గ్రహాలు తమ తమ స్థానాలలో ఉన్నట్టుగా పరస్పర సంబంధం, ఓ 'బిగువు' ఏ క్షణాన ఏ మార్పు వస్తుందోనన్న ఉత్కంఠ, ఉద్విగ్నత కథ పండటానికి సహాయం చేస్తాయి..."

అనేక లేఖల్లో చెహోవ్ తన రచనా పద్ధతుల గురించి మిత్రులకు రాశాడు. ఇతర రచయితలకు సలహాలిచ్చాడు. క్లుప్తత, సూటిగా చెప్పటమంటే చెహోవ్ కిష్టం. భేషజం లేదు. ఎంత సిన్సియర్‌గా రాశాడో అంత సిన్సియర్‌గా సలహాలిచ్చాడు. అభిప్రాయాలు వ్యక్తం చేశాడు. "మనిషికి అద్దం పట్టటమే కళ చెయ్యాల్సిన పని. సత్యాన్ని గ్రహించిన మనిషి తనే మారతాడు" అన్నది చెహోవ్ విశ్వాసం.

**(సంపాదకుడు, ప్రచురణకర్త సువోరిన్‌కు రాసిన లేఖ - 1890)**

"... మంచీ, చెడుల పక్షం తీసుకోకుండా రాస్తున్నానంటారు మీరు. అంటే స్వంత అభిప్రాయాలు, విచక్షణగా లేవనుకుంటారా? ఒక దొంగ గురించి రాస్తూ నేను చేస్తున్నది తప్పు" అని దొంగ స్వగతంగా రాయమంటారా? దొంగతనం చెడ్డదని నేను ప్రత్యేకంగా గొంతు చించుకుని అరవనక్కర్లేదు. అది అందరికీ తెలిసిన విషయమే. ఆయా పాత్రలు ఎలాంటివో, వాటి నైజం చూపించటం మాత్రమే నా కర్తవ్యం లేదా "దొంగగారు సత్పురుషుడు" చతుష్షష్టి కళల్లోకీ ఇదే అన్నింటికన్నా శ్రేష్ఠం. కళాకారులు అనిపించుకోగలిగిన అర్హత ఈ ప్రపంచంలో వీళ్లకు మాత్రమే ఉంది." అంటూ రాయనా? అఫ్‌కోర్స్, కథ చివర్న నీతులు చెప్పటం కొందరికిష్టం. ఒక పాత్ర గురించి రాస్తున్నప్పుడు పరకాయ ప్రవేశం చేసి మరీ కథ చెప్పాలి. మరి అదే సమయంలో నేను 'జడ్జి'గా కూడా వ్యవహరిస్తే పాత్ర చిత్రణ లోపభూయిష్టంగా ఉందని మీరే అనరా? అచ్చులో కనిపించే అసలు కథలో సగం రచయితలు మాత్రమే. మిగతా సగం పాఠకుడు (చదివి) పూరించుకుంటాడు...."

**(మాక్సిం గోర్కీకి రాసిన లేఖ- 1899)**

"రాసింది మళ్లీ చదివి, అనవసరంగా కనిపించిన విశేషణాలనూ, ఇతర పదాలనూ నిర్దాక్షిణ్యంగా తీసెయ్యండి. లేకపోతే పాఠకుడి దృష్టి ఈ పదాలమీదే నిలిచి, అసలు కథ మీద ఏకాగ్రత తగ్గే ప్రమాదముంది. "అతడు నేలమీద కూర్చున్నాడు" అని రాస్తే పాఠకుడు సులభంగా గ్రహిస్తాడా లేక "ఓ ఆరడుగుల ఆజానుబాహువు, తెల్లని ముఖవర్చస్సు, పిల్లి గడ్డం, సిల్కు లాల్చీ వేసుకున్న మనిషి, పచ్చటి పట్టులాంటి గడ్డి - కేరింతలు కొడుతూ పరిగెత్తే చిన్న పిల్లల పాదాల కింద నలిగిపోతున్న గడ్డిమీద కూర్చున్నాడు" అంటే బాగుంటుందా- ఏది త్వరగా మనసుకు హత్తుకుంటుంది- ఆలోచించండి....."

– ముక్తవరం పార్థసారథి

**(వచ్చే నెల మరిన్ని విశేషాలు)**

★

# మాడపాటిని కన్నీరు పెట్టించిన 'చిల్లరదేవుళ్లు'

**కథ వెనుక కథ**

సుమారు మూడున్నర దశాబ్దాల క్రితం 'ప్రగతి' వారపత్రికలో ధారావాహికంగా ప్రచురితమై సంచలనం సృష్టించింది 'చిల్లర దేవుళ్లు'. 1938నాటి తెలంగాణా పల్లెపట్టుల్ని.. దేశ్‌ముఖ్‌ల పెత్తందారీ వ్యవస్థను.. బలవంతపు మతమార్పిడుల్ని అందులో



దాశరథి రంగాచార్య

కళ్లకు కట్టారు దాశరథి రంగాచార్య. వాస్తవిత తెలంగాణ మాండలికం నవలకు సహజత్వాన్నీ.. సజీవతత్వాన్నీ తెచ్చిపెట్టింది. రంగాచార్యకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు తెచ్చిన ఈ నవల అనంతర కాలంలో రేడియో నాటకంగా.. సినిమాగా కూడా రూపొందింది. ప్రజల గుండెల్లో సుస్థిర స్థానాన్ని సంపాదించుకుంది. ఈ నవల 'కథ వెనుక కథ' అడిగినపుడు దాశరథి ఎన్నో విషయాలను వెల్లడించారు.. ఆయన అంతరంగ ఆవిష్కరణమిది..

తెలంగాణను ప్రేమించిన వాళ్లలో నేనొకడ్ని. భౌగోళికంగానే కాదు... భాషను, సంస్కృతిని, అజ్ఞానాన్ని, దరిద్రాన్ని.. అన్నింటినీ ప్రేమించినవాణ్ని.. ప్రేమిస్తున్న వాణ్ని. తెలంగాణ కోసం తుపాకీ పట్టాను. నిజాంను ఎదిరించాను. ఆ పోరాటంలో నాలుగు వేల మంది కామ్రేడ్స్ పోయారు. అన్ని త్యాగాలు, పోరాటాలుచేసి నిజాంను గద్దెదించిన ప్రజలకు ఒరిగిందేమీ లేదు. రాజకీయాలు అధికారం చుట్టే తప్ప జనం చుట్టూ తిరగడం లేదు. నాలాంటి వారికి బాధ కలిగించే విషయం.. నిజానికి చరిత్రనే సరిగా రాయలేదు. ఇది బ్రిటిష్ ఇండియా స్వాతంత్ర్యం. భారత్‌కు కాదు. అదీకాక 1947 ఆగస్టు 15నాటికి దేశంలో 550 సంస్థానాలకు స్వాతంత్ర్యం రాలేదు. నిజాం చార్మినార్‌పై జెండాఎగరేసి 'ఆజాద్ హైదరాబాద్' ప్రకటించాడు. భారత్ నడిబొడ్డున 3 కోట్ల మంది బానిసత్వంలో నలుగుతుండగా భారత్‌కు స్వాతంత్ర్యం వచ్చిందనడం ఎంత సత్యం? 1948 సెప్టెంబరు 17న పోలీసుచర్యతో విముక్తి కలిగింది. ఈ వాస్తవాల్ని కూడా మనం జనానికి చెప్పడంలేదు. నైజాం తెలుగువారికి, మిగతా తెలుగువారికి అడ్డుగోడగా నిలిచిన ఉస్మాన్ అలీఖాన్ తొలగిపోయాక.. ఆ నియంతృత్వ ఏలుబడే 'మంచి పాలన' అనేదాక వస్తుందని ముందే ఊహించాను. తెలంగాణ జనజీవనం గురించి నేను నవలలు రాసి ఉండకపోతే భావి తరాలకు తెలంగాణ జీవితం, ప్రజాపోరాటాలు, సంస్కృతి, భాష తెలిసే ఉండేవికావు.

10 మే 2005 ఈనాడు

## ఆవేదనే అసలు కారణం



నేను నవల మొదలు పెట్టడానికి ఆవేదన కారణం. ఆవేదన లేని రచన సజీవం కాదని నా ఉద్దేశం. తెలంగాణ జన జీవితాన్ని చిత్రించటానికి తొలిసారి ప్రయత్నించిన వారు వట్టికోట ఆళ్వారు స్వామి. ఆయన 'ప్రజల మనిషి' నవల రాశారు. 'గంగు' సగంలోనే వదిలి పరమపదించారు. ఆళ్వారుస్వామి వారసత్వంగా నవలారచన నేను ప్రారంభించాను. నిజానికి సమాజం మొత్తాన్నీ ఇముడ్చుకునే శక్తి నవలకుంది. అలాంటి ప్రక్రియ నాకు సాధ్యపడుతుందనుకో లేదు. అయినా సిద్ధమయ్యాను. అనేక ఆంగ్ల, హిందీ, ఉర్దూ, తెలుగు నవలలు చదివాను. పాత్రల్నీ, ఇతివృత్తాల్నీ అధ్యయనం చేశాను. దీనివల్ల నవలా రచనపై ఓ అవగాహన ఏర్ప డింది. నవలను ఏ యాసలో రాయాలి? అన్నది ప్రశ్న. అన్ని కోణాల నుంచి ఆలోచిం చాక పాత్రోచిత యాస వాడాలనుకున్నాను. సంస్కృత నాటకాల్లో ఈ ప్రయోగం ఉంది. తెలుగులో నేను ప్రవేశపెట్టేవరకు పాత్రకో యాస, నివేదనకు ఒక భాష పద్ధతిలేదు. ఈ విషయంలో నేనే ఆద్యుణ్ని! 'నను కనిపెంచి నట్టి కరుణామయి నా తెలంగాణ' గురించి సకలాంధ్రులకు తెలియచేయడం నా ధ్యేయం. అందుకే సాధారణ వాడుక భాషనే నివేదనకు ఉపయోగించాను. తెలంగాణ యాస సొగ సులు సకలాంధ్రులు చవిచూడాలనే పాత్రలకు యాస వాడాను. ఇతివృత్తం గురించి చెప్పా లంటే.. 1938 తెలంగాణ జనజీవిత చరిత్రలో ఓ మైలురాయి. అప్పటివరకు తెలంగాణలో రాజకీయపార్టీ లేదు. అదే సంవత్సరం హైద రాబాద్ స్టేట్ కాంగ్రెస్ ఏర్పాటుచేసే ప్రయత్నం జరిగింది. అది కార్యరూపం దాల్చే లోపే నిజాం దాన్ని నిషేధించాడు. ఆయనకు ప్రజలన్నా, ప్రజా ఉద్యమాలన్నా హడల్! అవే పరిస్థితుల్ని నా రచనలో చిత్రించాను. నేను ఎన్నుకున్న ప్రాత్రలు, సంఘటనలు కేవలం కల్పితాలుకావు. ఆ కాలంలో ఉన్నవే. వాటిని మలచిన తీరు మాత్రం నా సొంతం. నా పాత్రలు, సంఘటనలు సజీవంగా ఉండటానికి కారణం, నేను వాటిని చూశాను, వాటి మధ్య మసలాను.. స్పందించాను. నా రచనలోని పాత్రలు, పరిసరాలు నా జన్మస్థలం చిన్నగూ డూరువి. అక్కడి గడీ, దేశ్‌ముఖ్ రామారెడ్డి, పిచ్చి మంగమ్మ, ఏరు, తామర చెరువు.. అన్నీ నవలలోకి నడిచొచ్చాయి. అలాగని సంఘటన లన్నీ అక్కడివే కావు. ఎక్కడెక్కడివో తెచ్చి గుదిగుచ్చాను.

## వాల్మీకి స్ఫూర్తి

రచయితలంతా ముందు రామాయణాన్ని అధ్యయనంచేస్తే మంచిదని నా అభిప్రాయం. అందులో అద్భుత శిల్పనైపుణ్యం ఉంది. నా పాత్రల్ని మలచిన తీరుపై వాల్మీకి ప్రభావం అపారం. ఆ మహాకవి పాత్రల్ని మలచలేదు. సృష్టించారు. వాటికి వంకర లేదు. శబరిని సృష్టించిన ఆయనే మంథరనూ సృష్టించారు. అదీ గొప్పదనం!

## పోటీకి పంపితే తిరిగొచ్చింది

సకల సామగ్రిని సమకూర్చుకున్నాక, 1964 అక్టోబరు 13న నవలారచన ప్రారంభించి నవంబరు 10 నాటికి ముగించాను. మాడ పాటి హనుమంతరావుగారికి అందులోని

కొంత భాగాన్ని వినిపించాను. ఆయన వెక్కి వెక్కి ఏడ్చారు. ఆయన పరిస్థితిని చూసి భయమేసింది. 'రంగాచార్లూ! మతాంతరీకరణను కళ్లకు కట్టినట్టు చూపావు. ఆ దృశ్యాలన్నీ కళ్లముందు కదలాడాయి.. ఏడుపొచ్చింది' అన్నారు. ఆర్యసమాజ నాయకులు నరేందర్‌జీ అభిప్రాయాల్ని కూడా తెలుసుకున్నాక, కొన్ని మార్పులతో శుద్ధప్రతి సిద్ధమైంది. దానికి 'రాతి మనుషులు' అని పేరు పెట్టాను. సరిగ్గా అపుడే ఓ వారపత్రిక నవలల పోటీ నిర్వహిస్తోంది. నా రచనను పంపాను. బహుమతి వస్తుందని నమ్మకం. కానీ.. తిరిగొచ్చింది. సాధారణ ప్రచురణకూ అనర్హమని తేల్చారు. దాన్ని కట్టకట్టి మూలకు విసిరేశాను. కొన్నాళ్ల తర్వాత నార్ల చిరంజీవి గారితో పరిచయం ఏర్పడింది. ఓసారి సంకోచంగానే ఆ రాతప్రతిని ఆయనకిచ్చాను. రెండురోజుల తర్వాత వెళ్తే 'భాయ్‌జాన్! ఏహ్ తో బహుత్ అచ్ఛీ నవలా హై. నిన్నటి నుంచి నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. ఎపుడు చెబుదామా అని ఎదురుచూస్తున్నాను' అంటూ పొగిడారు. అంతకుమించిన ఆనందం ఏముంటుంది? దానికి 'చిల్లర దేవుళ్లు' నామకరణం చేసిందీ ఆయనే. దాన్ని 'ప్రగతి' వారపత్రిక 1969లో మార్చి 21 నుంచి జూన్ 13 దాకా సీరియల్‌గా ప్రచురించింది. ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఉధృతంగా ఉన్నరోజులవి. అయినా అన్ని ప్రాంతాలవారు ఆదరించారు. 'చిల్లర దేవుళ్లు' నిర్జీవ చరిత్ర కాదు. మనసున్న మనుషుల గుండె చప్పుడు. ఇందులోని పాత్రలన్నీ తెలంగాణాలో ఉన్నవే. వారి జీవితాల్ని సజీవంగా చిత్రించగలిగానంటే, అందుకు తెలంగాణ మీద నాకున్న అభిమానం, ప్రేమే కారణం. 30 ఏళ్ల తర్వాత ఆ పాత్రలు నాకు.. నడచి వచ్చినట్లు అనిపిస్తాయి.

**నాది ప్రతిభ కాదు.. ప్రేమ**

ఓ యువతి జీవితాన్ని చిత్రించగలగటం ప్రతిభగా కాదు.. ప్రేమగా భావిస్తాను. 'వనజ' పాత్రతీరు రచయితనైన నాకే ఆశ్చర్యం కలిగిస్తోంది. ఆమె ఉందో, లేదో నాకు ఇప్పటికీ తెలియదు. కానీ ఆ పాత్ర అంటే నాకు ప్రేమ. ఆ త్యాగం, సంస్కృతి, నిజంగా.. ఎంత గొప్ప పాత్రకైనా గుణపాఠంలా కనిపిస్తాయి. లంబాడీ లక్ష్మి పోలీస్ మీద తుపాకీ ఎక్కుపెడుతుంది. ఇంత సాహసం చేసిన లక్ష్మిలాంటి మహిళలే నేటి సమాజానికి అవసరం. నేను 'చిల్లర దేవుళ్లు' రాస్తున్న రోజుల్లో కొందరు మిత్రులు నన్ను తెలంగాణ భాష ప్రవేశపెట్టవద్దని ఒత్తిడి తెచ్చారు. అలారాసి ఆంధ్రులు వెక్కిరించేలా చేస్తావా అన్నారు. అయినా సాహసం చేశాను.. దాన్ని సాహసం అనలేం. ప్రేమ అనడం సరైందేమో! 'చిల్లర దేవుళ్లు' విజయవంతం కాకుండా ఉంటే, బహుశా నా మిత్రులతో తిట్లు పడాల్సి వచ్చేది! జీవిత చిత్రణలో ఉన్న శిల్పమేదో తెలియదు. అది గులాబీ పరిమళంలా ఆంధ్రదేశం అంతా వ్యాపించింది. మొదటి నవలకే, ప్రచురణ జరిగిన మొదటి సంవత్సరంలోనే 'ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు' వచ్చింది. నేనెంత అదృష్టవంతుడ్ని అంటే కుందుర్తి ఆంజనేయులు, తిరుమల రామచంద్ర వంటి గొప్ప వారి చేతులమీదుగా అవార్డు అందుకున్నాను. ఆనాటి సభలో 'ఈ అవార్డు తెలంగాణ జనజీవితానికి అందాల్సింది' అన్నాన్నేను. ఇది వాస్తవం. ఆ తర్వాత ఆకాశవాణిలో తెలంగాణ మాండలికంలో 'చిల్లర దేవుళ్లు' నాటకం ప్రసారమైంది. అశేష ప్రజానీకాన్ని కదిలించింది. నాకు ఆంధ్రదేశం నలుమూలలా సన్మానాలు జరిగాయి. తర్వాత సినిమాగా వచ్చింది. అది చలనచిత్ర రంగంలో ఓ మైలురాయి. ఆ తర్వాత మళ్లీ మాండలిక చిత్రం రానేలేదు. ఇంగ్లిష్, హిందీ భాషల్లోకి నవలను అనువదించారు. కాకతీయ, ఉస్మానియా, కృష్ణదేవరాయ, బెంగుళూరు విశ్వవిద్యాలయాల్లో పాఠ్యపుస్తకంగా ప్రవేశపెట్టారు. ఇది తెలుగువారి నవల కనుకే వారు దీన్ని ఆదరిస్తున్నారు. ఇది వారి జీవితం.

సేకరణ: – కె. జనార్ధనరావు

# చతుర సమీక్ష



**ఈ** శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్ హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ **మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనా శక్తిని రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తమ ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**నవలను గురించే కాక ఇతర శీర్షికలపై కూడా పాఠకుల అమూల్య అభిప్రాయాలను ఆహ్వానిస్తున్నాం.**

**కూపన్**

మే చతుర నవల **శబ్దం**

సమీక్షకుని పేరు: ______________________

చిరునామా: ______________________

______________________

______________________

# శబ్దం

## సూరేపల్లి విజయ



### రచయిత్రి పరిచయం

నూటయాభై కథలు తొమ్మిది నవలలు రాసిన సూరేపల్లి విజయ ఎనిమిదేళ్ళ క్రితం రచనా వ్యాసంగం ప్రారంభించారు. 'అగమ్య' 'చతుర'లో తొలి నవల కాగా 'శబ్దం' మూడవ నవల. ప్రకృతినీ, నవరసాలనూ ఇష్టపడే ఈ రచయిత్రి తొలి సీరియల్ నవల 'అగ్నివర్షం'. 'అగ్నివర్ష' పేరుతో కన్నడ పత్రిక హంసరాగలో సీరియల్‌గా వచ్చింది.


రచయిత్రి చిరునామా!
సూరేపల్లి విజయ
ఇం.నెం. 1-1-384/ఎ,
గాంధీనగర్,
హైదరాబాద్-500 080.

# నవలా పరిచయం

తన తండ్రి నీతికి నిలబడి అన్యాయాన్ని ప్రతిఘటించినందుకు తమ కుటుంబం అగ్నికి ఆహుతి కావటం చూసి చలించిపోయిందామె. ప్రతీకారం తీర్చుకోవడానికి ఓ పత్రికను వేదికగా మార్చుకుంది. పదాల శంఖారావం పూరిస్తూ అక్షరాలతో సమరం ప్రారంభించింది. ఆ అక్షరాలే పాశుపతాస్త్రాలై ధూర్తులను మట్టుబెట్టిన వైనాన్ని అద్భుతంగా ఆవిష్కరించిన **సూరేపల్లి విజయ** నవల **'శబ్దం'** ఈ నెల 'చతుర' సమర్పణ.



*ఎవరన్నారు అక్షరాలు నిశ్శబ్ద ముద్రదాలుస్తాయని... ఎవరన్నారు అక్షరాలు శబ్దించలేవని... నా అక్షరాలు అగ్ని కణాలు... నా అక్షరాలు అణ్వస్త్రాలు... నా అక్షరాలు వేనవేల అస్త్రశస్త్రాలు. నా అక్షరాలు సంగ్రామ సీమలో గర్జించే సింహాలు. ఈ అక్షరాలే వేనవేల అభ్యుదయ సూర్యోదయ గమనానికి స్వాగతగీతాలు. అక్షరాల నిట్టూర్పులో ఆశ ఉంది. ఆశయం ఉంది. అక్షరాల శ్వాసలో ఆలోచన ఉంది. అంతరార్థం ఉంది... అక్షరాల ఉఛ్వాస, నిశ్వాసాల్లో వడీ... వేగమూ ఉన్నాయి. అక్షరాల అగ్గిరాజుకుంటే... దాన్నాపడం ఎవరి తరం... అక్షరమా... నువ్వు చిరంజీవివి... నీకు పుట్టుకే తప్ప, మరణం లేదు.*

★ ★ ★

న్యూఢిల్లీ
డిసెంబర్ నెల
సాయంకాలం

డైలీ న్యూస్ ఆఫీసు నిశ్శబ్దంగా ఉంది. ఉద్విగ్నతా ముసుగులో దాగిన గాంభీర్యం అది. ప్రపంచంలోని నలుమూలల వార్తలను ఊపిరిగా చేసుకొని... అక్షరాలా అక్షరాలై కాగితమ్మీదికి ఎక్కి... ప్రపంచానికి వార్తలందించేందుకు సిద్ధమవుతోంది.

రిపోర్టర్లు టేబుళ్ళ ముందు తెల్ల కాగితాలు పెట్టుకొని వార్తలు రాసేస్తున్నారు. డెస్క్ ఇన్‌చార్జీలు... వార్తలను పరిశీలిస్తున్నారు. కొందరు స్పెషల్ పేజీలను మేకప్ చేస్తున్నారు. ఎవరి పనుల్లో వారు బిజీగా ఉన్నారు.

దూరంగా ఉన్న ఓ చెక్కబల్ల ముందు కూచొని, తల వెనక్కి వాల్చి కళ్ళు మూసుకొని తపస్విలా ఉండిపోయిన వ్యక్తి భీష్మాచార్య.

ఆయన్ని ఎవ్వరూ కదిలించే సాహసం చేయరు. ఎడిటర్ తర్వాత అంతటి గౌరవ మర్యాదలు ఉన్న వ్యక్తి అతను. గడ్డం మాసి ఉంది. భూతద్దాలలాంటి కళ్ళజోడు... అప్పుడప్పుడు జేబులో నుంచి టిన్ తీసి జిన్ నోట్లోకి ఒంపుకుంటున్నాడు.

"సార్" ఓ సబ్-ఎడిటర్ వచ్చి న్యూస్ ఐటమ్ తాలుకు పేపర్లు తెచ్చి అతని టేబుల్ మీద పెట్టాడు.

కళ్ళు తెరవకుండానే "ఏమిటీ? " అని అడిగాడు. అతని గొంతులో నుంచి మాటలు ముద్దగా వస్తున్నాయి.

"మినిష్టర్‌గారి స్టేట్‌మెంట్... ప్రెస్‌మీట్ పెట్టి ప్రతిపక్షాన్ని దుమ్మెత్తిపోశారు. మొదటి పేజీలో వేద్దామా? " అడిగాడు భయపడుతూనే ఆ సబ్-ఎడిటర్.

"వద్దు. చివరి పేజీలో వేయ్" చెప్పాడు. యాభై ఎనిమిదేళ్ళ భీష్మాచార్య. పత్రికా ప్రపంచంలో అతను భీష్మాచార్యుడే.

"సార్ ఎప్పుడూ వార్తలలో ఉండే హోమ్ మినిష్టర్ స్టేట్‌మెంట్ సార్" కాస్త భయంగానే చెప్పాడు సబ్ ఎడిటర్.

"సో వాట్"

"ఈ వార్తని మన పత్రికలో మొదటి పేజీలో వేయమని మరీ చెప్పారు మినిస్టర్ గారు".

కోటు జేబులో నుంచి జిన్ టిన్ తీసి కొద్దిగా జిన్‌ని నోట్లోకి ఒంపుకొని "అయితే ఓ పన్జేయమను"

"ఏంటిసార్" ఆసక్తిగా అడిగాడు ఆ సబ్ ఎడిటర్.

"ఆ స్టేట్‌మెంట్‌ని అడ్వర్టయిజ్‌మెంట్‌లో ఇవ్వమను"

అవాక్కయ్యాడు సబ్ ఎడిటర్.

"అది కాదు సార్"... నసిగాడు సబ్ ఎడిటర్.

"వెళ్ళు వెళ్ళి లాస్ట్ పేజీలో ఓ మూల వేయ్. అన్నట్టు ఆ స్టేట్‌మెంట్ చివర ఓ వాక్యం యాడ్ చేయ్".

"ఏంటిసార్" పెన్ను, పేపర్ చేతిలోకి తీసుకొని అడిగాడు సబ్ ఎడిటర్.

"పని గట్టుకొని మంత్రివర్యులు ఇచ్చిన

ఈ స్టేట్‌మెంట్‌కు ప్రతిపక్షం వాళ్ళు కౌంటర్ స్టేట్‌మెంట్ వెంటనే చదివే అవకాశం పాఠకులకు ఎటూ ఉంది. పత్రికలు రాజకీయ నాయకులకు ఫుట్‌బాల్ మైదానాల్లా మారాయి"

'సార్... ఈ వాక్యం"

"ఉండనీ... ఆ మాత్రం పత్రికా స్వేచ్ఛా లేకపోతే ఎలా? అయినా కోట్లు పెట్టి, మేధావులకు జీతాలిచ్చి పోషిస్తూ, ప్రకటనలు రాకపోయినా భరిస్తూ కూడా అక్షరం ముక్క రాకపోయినా, అడ్డమైన వాగుడు వాగినా మనం అచ్చేయగా లేందీ, ఇలా రాస్తే తప్పేమిటి?

సరే సార్" ఆ సబ్-ఎడిటర్ వెనక్కి తిరిగాడు

"చూడు"

సబ్-ఎడిటర్ వెనక్కి వచ్చాడు

"ఈ వేళ మంత్రి స్టేట్‌మెంట్ ఫ్రంట్ పేజీలో వేస్తే ప్రతిపక్షనేత రేపు ఫోన్ చేసి "నా స్టేట్‌మెంటు ఫ్రంట్ పేజీలోనే వేయి" అంటారు అదేదో పత్రిక వాళ్ళ ప్రాపర్టీ అయినట్టు. అసలు రాజకీయ నాయకుల స్టేట్‌మెంట్లను, విమర్శల వాగుళ్ళను బ్యాన్ చేయాలి" అన్నాడు భీష్మాచార్య.

సబ్-ఎడిటర్ ఏమీ అన్లేక కామ్‌గా ఉండిపోయాడు.

"స్టేట్‌మెంట్లిచ్చేసి ప్రజలను తప్పుదారి పట్టించే ఇలాంటి వార్తలకు ప్రకటన రేట్లు వసూలు చేస్తేగాని వాళ్ళకు బుద్ధిరాదు". అతని మాటల్లో రాజకీయ నాయకుల మీద కసి వ్యక్తమవుతోంది.

సబ్-ఎడిటర్ కామ్‌గా వెళ్ళిపోయాడు. సరిగ్గా అదే సమయంలో...

★ ★ ★

డైలీ న్యూస్ పత్రికా కార్యాలయం ముందు ఓ ఆటో ఆగింది. అందులో నుంచి ఇరవై రెండేళ్ళ ఓ స్త్రీ ఆటో దిగింది. మెడలో సన్నటి గోల్డ్ చెయిన్, ఎడమ చేతికి రెండు గాజులు, కుడిచేతికి రిస్ట్ వాచీ... చీరకట్టులో సింపుల్‌గా ఉంది. ఓసారి డైలీ న్యూస్ బోర్డు వైపు చూసి, ఆటో మీటర్ చూసి అతనికి డబ్బులు ఇచ్చి లోపలికి నడిచింది.

రిసెప్షన్ కౌంటర్ దగ్గరికి వెళ్ళి అడిగింది.

"ఎక్స్‌క్యూజ్ మీ... నేను భీష్మాచార్యగారిని కలవాలి"

ఒక్క క్షణం రిసెప్షనిస్ట్ విచిత్రంగా చూసి "మీరు" అంటూ ఒక్క క్షణం ఆమె వంక చూస్తుండిపోయింది.

భీష్మాచార్య కోసం ఇప్పటివరకూ ఎవరూ వచ్చిన దాఖలాలు లేవు. అలాంటిది ఈ అమ్మాయి

"నా పేరు అనిమిష. నేను హైదరాబాద్ నుంచి వచ్చాను".

రిసెప్షనిస్ట్ ఇంటర్‌కమ్ నొక్కి "సార్... మిమ్మల్ని కలవడానికి ఓ అమ్మాయి వచ్చింది. పేరు అనిమిషట. హైద్రాబాద్ నుంచి వచ్చారుట".

అటువైపు నుంచి భీష్మాచార్య ఏదో మాట్లాడాడు. రిసెప్షనిస్టు అనిమిష వైపు చూసి కుడివైపు చూపిస్తూ "స్ట్రయిట్‌గా వెళ్ళి లెఫ్ట్‌కు తిరగండి భీష్మాచార్యగారి సీటు అక్కడే వుంది" అంది.

అనిమిష ఆమె చెప్పిన వైపే వెళ్ళింది.

★ ★ ★

"ఎవర్నువ్వు?" భీష్మాచార్యను అనిమిష పలకరించగానే అడిగిన తొలి ప్రశ్న.

"నా పేరు అనిమిష... శర్మగారు పంపించారు"

"ఏ శర్మ" అంటూ ఒక్క క్షణం ఆలోచనలో పడిపోయాడు.

"మీతోపాటు ఎస్.వి.కాలేజిలో డిగ్రీ వరకూ వైజాగ్‌లో చదివిన శర్మగారు"

కళ్ళను బలంగా మూసుకొని, చేతులతో కణతలు నొక్కుకుంటూ గుర్తుచేసుకునే ప్రయత్నం చేసుకొని...

"సూర్యనారాయణ శర్మా" అడిగాడు ఒక్క



క్షణం మొహం మీదకు చిర్నవ్వును రప్పించుకొని...

"అవును ఆ శర్మగారే"

"వాడా? వాడెలా వున్నాడు? వాడు నాకు ఇంటర్‌నుంచి డిగ్రీ వరకూ క్లాస్‌మేట్ బెంచీమేట్... ఇదెప్పటిమాట ముప్ఫయ్యేళ్లు దాటి వుంటుంది. అది సరే శర్మ నీకేమవుతాడు? " అడిగాడు అనిమిష వంక పరిశీలనగా చూస్తూ

ఒక్క క్షణం ఆమె మొహంలో రంగులు మారేయి.

"అంకుల్ అవుతారు. మా అమ్మకు అన్నయ్య వరుస..."

"ఐ...నా... వాడెలా వున్నాడు? బావున్నాడా? బాగానే వుండివుంటాడు. ఎవరి జోలికీ వెళ్ళడు... నాలా... అది సరే ఇంతకీ నువ్వొచ్చిన పని? "



"నేను జర్నలిస్ట్‌గా చేద్దామని"

ఒక్క క్షణం అనిమిష వంక చూసి నవ్వాడు భీష్మాచార్య "ఏంటీ జర్నలిజం అంటే జోక్‌గా ఉందా? " అని కళ్ళుమూసుకొని "టీ తాగుతావా? కాఫీనా? తాగేసి ఇంటికి వెళ్ళిపో. ఢిల్లీ చూడాలంటే చెప్పు. తోడిచ్చి పంపిస్తాను. అన్నట్టు ఎలా వచ్చేవు? ఎక్కడ దిగావు? "

"స్టేషన్ నుంచి డైరెక్ట్‌గా ఇటే వచ్చాను" చెప్పింది అనిమిష. అప్పుడు గమనించాడు ఆమె చేతిలోని ఏర్‌బేగ్.

"మరో గంటలో హైద్రాబాద్‌కు ట్రైన్ ఉంది. టికెట్టు తెప్పిస్తాను వెళ్ళిపో"

"వెళ్ళను. జర్నలిస్ట్‌గా ఇక్కడ పత్రికలో పనిచేస్తాను"

"చూడు చిన్నపిల్ల ఐస్‌క్రీమ్ కోసమో, చాక్లెట్ కోసమో మారాం చేసినట్టు చేయొద్దు. అయినా అసలు శర్మగాడికి బుద్ధి లేదా? ఒంటరిగా ఆడపిల్లను పంపించడమేంటి? "

"దయచేసి ఆయన్ని ఏమీఅనకండి తప్పంతా నాదే! నేనే పట్టుబట్టి వచ్చాను. మీ కిష్టంలేకపోతే చెప్పండి ఢిల్లీలో చాలా పత్రికలున్నాయి. అక్కడ ట్రయ్ చేస్తాను"

భీష్మాచార్య అనిమిష వంకే చూస్తు న్నాడు. ఓసారి టిన్‌లోని జిన్‌ని నోట్లోకి ఒంపుకొని...

"అసలు నీకు జర్నలిజం గురించి ఏం తెలుసు? "

"తెలుసుకుంటాను" స్థిరంగా అంది ఆ అమ్మాయి.

"తెలుసుకొని "

"జర్నలిస్ట్‌గా నేనేమిటో నిరూపిస్తాను".

"జర్నలిజమంటే వంటకాల గురించి పత్రికలో చిట్కాలు రాయడంకాదు. ఊహ ల్లోని ఆలోచనలను కథలుగా పేర్చడం కాదు అదో తపస్సు అదో ప్రమాదం అదో రిస్క్ "

"అయినాసరే అన్నింటినీ తట్టుకోగలను. మీ చేత శభాష్ అనిపించుకోగల్ను..

భీష్మాచార్య ఆమె వంకచూసి అనున యంగా చెప్పాడు.

"చూడు... చిన్నపిల్లవు నా మాటవిని వెళ్ళిపో... నా టైం వేస్ట్‌చేయకు"

"వెళ్తానుసార్... కానీ వెనక్కికాదు... మీ ఆఫీసు బయటే నిలబడి వుంటాను. మీరు రమ్మనేవరకు రాను... అలా అని ఈ ప్రిమిసెస్ విడిచి వెళ్ళను" అంటూ అక్క డినుంచి వెళ్ళిపోయింది అనిమిష.

★ ★ ★

రాత్రి ఎనిమిది దాటింది.

భీష్మాచార్య లేచి సిగరెట్ వెలిగించుకొని కిటికీ దగ్గరకి వచ్చాడు.

అక్కడ అనిమిష కనిపించింది. నిలబడి ఉంది. శిలావిగ్రహంలా నిలబడి ఉంది.

ఒక్క క్షణం అతనికి ఆమెమీద కోపం వచ్చింది. క్షణంలో సర్దుకొని తనసీటు దగ్గ రికి వచ్చాడు.

బాయ్ టీ తెచ్చి టేబుల్ మీద పెట్టి వెళ్ళాడు. ఒకసారి సిప్‌చేసి మళ్ళీ కిటికీ దగ్గ రికి వెళ్ళాడు. చలికి వణకుతున్నట్టుంది. కొంగు భుజం మీదుగా కప్పుకొని వణుకు తోంది.

భీష్మాచార్య బాయ్‌ని పిలిచి చెప్పాడు.

"బయటో అమ్మాయి నిలబడి వుంది. వెళ్ళి టీ ఇచ్చిరా"

"అలానే" అంటూ వెళ్ళిన బాయ్ అయిదు నిమిషాల్లో టీ కప్పుతో వచ్చాడు.

"టీ వద్దటసార్"

"పోనీ కాఫీ ఇవ్వకపోయావా? "

"అడిగాను సార్ ఏదీ వద్దంది. మీరు రమ్మని పిలిస్తే మాత్రం వచ్చి చెప్పమంది"

"షిట్... ఈ పిల్లకసలు బద్దిలేదు" కోపంగా మనసులోనే అనుకున్నాడు.

★ ★ ★

రాత్రి తొమ్మిది దాటింది.

భీష్మాచార్య మరోసారి కిటికీ దగ్గరికి వెళ్ళి చూశాడు. అనిమిష అక్కడే వుంది.

బాయ్‌ని పిలిచి అనిమిషను పిలుచుకుర మ్మని చెప్పాడు.

★ ★ ★

"ఏం రాస్తావు"? అడిగాడు భీష్మాచార్య.

"చెప్పండి ఏం రాయమంటారు".

నవ్వాడు భీష్మాచార్య... "జర్నలిస్ట్ అంటే ఎకాఎకిన పత్రికలో పనిచేయడం కాదు... కాని నీ హుషారు చూస్తోంటే ముచ్చటే స్తోంది. ఏ సాహసం అయినా చేయగ లవా? "

"చేయగలను"

"ఆ ప్రయత్నంలో నీకు అపాయం కలి గినా"

"నాకు అపాయం కలిగినా సరే"

"శివారు ప్రాంతాల్లోకి వెళ్ళి కొందరు రౌడీల ఫొటోలు సంపాదించి తీసుకు రాగ లవా? "

"తీసుకువస్తాను" భయం లేకుండా చెప్పింది.

"సరే వెళ్ళు మా కెమెరామెన్ నీకో కెమెరా ఇస్తాడు. ఏంచేస్తావో నీ యిష్టం సరిగ్గా ఈ సమయంలో అక్కడి ప్రాంతం నిర్మానుష్యంగా ఉంటుంది. కొందరు రౌడీ లకు ఆ ప్రాంతం అడ్డా. అమ్మాయిలను అల్లరిచేస్తూ ఉంటారు. వాళ్ళ ఫొటోలు తీసి, మంచి న్యూస్ తయారుచేసి పట్టుకురా. సరిగ్గా పదకొండులోగా ఇక్కడ ఉండాలి. నువ్వలా చేస్తే ఈ వార్త మొదటిపేజిలోనే వేస్తాను".

అనిమిష మొహంలో సంతోషం తొంగి చూసింది.

"సరేసార్! మీరు చెప్పినట్టే చేస్తాను"

భీష్మాచార్య కెమెరా మెన్‌ని పిలిచి ఓ కెమెరా ఇప్పించాడు. ఓ నోట్ బుక్ పెన్ ఇచ్చాడు.

"బెస్టాఫ్‌లక్"

చెప్పాడు భీష్మాచార్య



★ ★ ★

**బ**స్సుదిగింది అనిమిష

ఆ స్టాప్‌లో ఎవరూ దిగలేదు. "ఈ టైంలో ఎవ్వరూ ఇక్కడ దిగరు జాగ్రత్త" అంటూ హెచ్చరించాడు బస్ కండక్టర్.

స్ట్రీట్‌లైట్ల వెలుతురులో రోడ్డు నిర్మానుష్యంగా కనిపిస్తోంది. దాదాపు షాపులన్నీ తొమ్మిదిన్నర కాకముందే కట్టేస్తారు. అక్కడక్కడ టీ బడ్డీలున్నాయి.

ఓ సారి మెడలో ఉన్న కెమెరా సరిచూసుకొని పరిశీలనగా చుట్టూ చూసింది.

కాస్త దూరంలో కొంతమంది గుంపుగా ఉన్నారు. మెల్లగా అటు వైపు అడుగులు వేసింది.

కొందరు మందు కొడుతున్నారు. ఇంకొందరు గంజాయి దమ్ము పీలుస్తున్నారు. వాళ్లు తన వైపు వస్తూ ఉండడం గమనించి మెల్లగా ఓ పాడుపడిన బస్సు దగ్గర ఆగింది. ఆ గుంపులోని ఒకడు ఆ నిమిషను చూశాడు.

మిగతా వాళ్లకు సైగ చేసి చెప్పాడు. అనిమిష వాళ్ల ఫొటోలు తీయడానికి ప్రయత్నించింది. అప్పటికే వాళ్లు అనిమిష వైపు వస్తున్నారు. ఒక్కక్షణం ఆమెకు భయం అనుభవంలోకి వచ్చింది. చుట్టూ చూసింది. తనను కాపాడేవారు కూడా లేరు. ఏం చేయాలి?

ఆలోచించే టైం కూడా లేదు. ముందు ఇక్కడినుంచి పారిపోవాలి. ఆ నిర్ణయమే ఆమెకు కాస్త ధైర్యాన్నిచ్చింది. కాళ్లకు పని చెప్పింది.

"పారిపోతుందిరా"

ఆ గుంపులోని ఒకడు అరిచాడు.

మిగతా వాళ్లు పరుగెత్తారు. అనిమిష పరుగెత్తుతోంది. పరుగు పందెం? మొదలైంది.

ఆయాసంతో వగరుస్తోంది. సినిమాల్లో చూడ్డం, కథల్లో చదవడం తప్పించి ఆమెకు ఇలాంటి అనుభవం లేదు.

వాళ్లకు తను దొరికిపోతే? ఆ ఆలోచన ఆమెకు భయంకరంగా తోచింది. ఎలాగైనా పారిపోవాలి. వాళ్ల నుంచి పారిపోవాలి పోనీ అరిస్తే? అవును అరిస్తే ఎవరో ఒకరు సాయం చేయకపోతారా?

ఆమె వెంటనే తన గొంతుకు పనిచెప్పింది. "రక్షించండి హెల్ప్ ప్లీజ్ హెల్ప్ మీ బచావో" ఆమె అన్ని భాషల్లోనూ అరుస్తోంది. అరుస్తూనే పరుగెడుతోంది. అక్కడక్కడ ఒక్కటీ అరా జనం ఉన్నారు వాళ్లంతా అదేదో సినిమా షూటింగ్‌లా

చూస్తున్నారే తప్ప ఆమెను రక్షించే ప్రయత్నం చేయడం లేదు.

**నడిరోడ్డు మీద నరుక్కుంటూ ఉన్నా, నర మేథం జరుగుతూ ఉన్నా నాకేమిటి నాకేమీ కాకపోతే చాలు అని భయపడి స్వార్థపడి పోయే వికృత, నిర్లిప్తత అక్కడ చీకటి కన్నా భయంకరంగా ఆక్రమించుకుంది.**

ఆమె అదృష్టాన్ని పరీక్షిస్తున్నట్లు దిక్కులు చూస్తోంది. ఈ క్షణం ఏదో ఓ అద్భుతం జరిగితే తప్ప తను వాళ్ల బారినుంచి తప్పించుకోలేదు. అదృష్టం అద్భుతంగా ఎదురు రావాలి.

చీర కుచ్చెళ్లు ఆమె పాదాలకు అడ్డు తగులుతున్నాయి. అంత చలిలోను ఆమె మొహం మీద స్వేదం ప్రత్యక్షమైంది. ఆమె ఎదురుచూస్తున్న అదృష్టం బస్సు రూపంలో వచ్చింది. ఆమె బస్టాప్‌కు సమీపంలో ఉంది.

బస్సు స్లో అవుతూ వేగం పుంజుకునే లోగా ఆమె బస్సు ఎక్కేసింది.

ప్రయాణికులంతా ఆమెను వింతగా చూస్తుండిపోయారు.

★ ★ ★

భీష్మాచార్య నవ్వుతూనే ఉన్నాడు. అయిదు నిమిషాలుగా అలా నవ్వుతూ ఉన్నాడు.

అనిమిష అతని వంక విచిత్రంగా చూసింది. తను తన అనుభవాన్ని వణుకుతూ భయంతో చెబితే అలా నవ్వుతాడేంటి అయ్యో అలాగా అని అనొచ్చుగా.. ధైర్యంగా పారిపోయి వచ్చావ్. సేఫ్‌గా వచ్చావు. వెల్ డన్ అనొచ్చుగా. ధైర్యం చెప్పొచ్చుగా. ఇదంతా అతని వల్లే జరిగిందిగా.

"ఏంటి అయితే మొత్తం మీద వాళ్ల బారి నుంచి తప్పించుకు వచ్చావు రైట్"

"యస్ సార్"

"ఇప్పుడు దాని మీద న్యూస్ ఎలా రాస్తావు? "

ఆమె ఉత్సాహంగా ముందుకు వంగి చెప్పింది.

'ఆడది అర్ధరాత్రి స్వేచ్ఛగా తిరగలేకపోతోంది."

"హెడ్డింగ్.. వెరీగుడ్. తర్వాత" అతని మాటల్లోని వ్యంగ్యాన్ని గమనించకుండా ఉత్సాహంగా చెప్పుకు పోతోంది అనిమిష.

"ఆడది అర్ధరాత్రి స్వేచ్ఛగా రోడ్డు మీద తిరగ గలిగిన నాడే అది నిజమైన స్వాతంత్ర్యం అన్నాడు పూజ్య బాపూజీ.

ఈ స్వాతంత్ర్యం ఎక్కడ ఉంది? శివారు ప్రాంతంలో రౌడీలు యథేచ్ఛగా తిరుగుతున్నారు. అసలు అక్కడ స్త్రీలకు రక్షణ ఉందా" అని భీష్మాచార్య వైపు చూసింది.

అతను ఆమె వైపు చూస్తున్నాడు.

"సార్"

"చెప్పు. స్త్రీలందరూ రౌడీలను చూసి పారిపోయి రావాలని, స్త్రీలందర్నీ అణగదొక్కుతున్నారని, స్త్రీలకు స్వేచ్ఛ లేదని ఇంకా చెప్పు."

"సార్"

'జర్నలిజం అంటే కూరలు తరగడమో. సాంబారు చేయడమో కాదు అనిమిషా "

ఆ మాటలకు చివ్వున తలెత్తింది అనిమిష. ఆమె మొహం ఎర్రబడింది.

"బాధగా ఉందా? నా మాటలకు కోపం కూడా తన్నుకు వస్తుందా? ఈ మాత్రం రాయడానికి నువ్వు శివారు ప్రాంతానికి వెళ్లి రావాలా? ఈ మాత్రం దానికే నువ్వు భయంతో పారిపోయి రావాలా? నాలుగు గోడల మధ్య కూర్చొని కూడా వార్తలు వండొచ్చు తెలుసా "

ఆమె మొహంలో ఎరుపుదనం తగ్గుతూ వచ్చింది.

"అందుకే చెప్పాను. వెళ్లు. హైదరాబాద్ వెళ్లిపో"

"నేనేమైనా తప్పు చేశానా? " అడిగింది

ఎలాగో జీవించడం కాదు గొప్ప. మన స్వల్ప జీవితంలో మనం ఏమి సాధించామనేదే ముఖ్యం. – జవహర్‌లాల్ నెహ్రూ




## పారిపోబట్టే సొమ్ము.. లేకుంటే మన్ను!

విన్‌స్టన్ చర్చిల్ ఇంగ్లండ్ ప్రధాని కాకముందు కొన్నాళ్లు సైన్యంలో పనిచేశాడు. రెండో ప్రపంచ యుద్ధకాలంలో దక్షిణాఫ్రికా వెళ్లిన ఆయన సైన్యంలో ఉంటూనే మరోపక్క యుద్ధవార్తలను సేకరించి పంపేవాడు. ఓ రోజున బోయర్ సైనికులు బ్రిటిష్ సైనికులతో పాటు ఆయన్ను కూడా పట్టుకుని బంధించారు. తాను సైనికుడిని కానని.. జర్నలిస్ట్‌నని.. తనను విడుదల చేయాలని బోయర్ సైన్యాధికారికి వినతి పత్రం పంపాడు చర్చిల్. దానిపై వారే నిర్ణయమూ తీసుకోక ముందే సందుచిక్కడంతో జైలునుంచి ఉడాయించాడు. కొంతకాలానికి ఆయన బ్రిటిష్ ప్రధాని కావడం అదే బోయర్ సైన్యాధిపతిని ఒకానొక అధికారిక విందులో కలవడం జరిగింది. జైలు నుంచి పరారైన విషయాన్ని సైన్యాధికారి సరదాగా ప్రస్తావించాడు.

వెంటనే చర్చిల్ 'అవును.. జైలునుంచి పారిపోయిన ఉదంతంపై ఓ పత్రికకు సీరియల్‌రాస్తే 9 వేల పౌండ్లు వచ్చాయి. నీ క్షమాభిక్ష కోసం కూర్చుంటే ఒక్కడాల్లరైనా దక్కేదికాదు' అన్నాడు రవీమని.



అనిమిష.

"ఊహు... నేనే తప్పు చేశాను... నువ్వు సమర్థవంతంగా పని పూర్తి చేసుకువస్తావని నమ్మటమే నేను చేసిన తప్పు వెళ్లు."

"ప్లీజ్... నన్ను హైదరాబాద్ వెళ్లిపొమ్మని అనొద్దు. నేనేం చేయాలో చెప్పండి"

"ఒకరు చెబితే వచ్చేది సెన్సేషనల్ జర్నలిజం కాదు... నీలాంటి వాళ్లు ప్రెస్ నోట్స్ రాసుకుంటూ కూచుంటే చాలు."

"ప్లీజ్ నేనేం చేయాలో చెప్పండి."

"చెప్పను... ఏం చేయాలో... ఏం రాయాలో నువ్వే నిర్ణయించుకో... మరో గంటలో పత్రిక ప్రింటింగ్‌కు వెళ్లిపోతుంది. ఈలోగా ఏం చేస్తావో చేయ్. నన్ను డిస్టర్బ్ చేయొద్దు"

జిన్‌టిన్ తీసుకొని జిన్‌ని నోట్లోకి ఒంపుకున్నాడు భీష్మాచార్య.

★ ★ ★

అనిమిష కళ్లు ఎర్రబడ్డాయి.

ఆలోచనలతో ఆమె మెదడు వేడెక్కిపోతోంది. తన మీద తనకే కోపంగా ఉంది. ఏం చేయాలి? ఏదో ఒకటి చేయాలి ఇప్పుడు భీష్మాచార్యను ఒప్పించలేకపోతే తన జీవితానికి అర్థమే ఉండదు.

ఒక లిప్త కాలంలో ఆలోచన ఆమె మెదడును ఆక్రమించుకుంది.

సమస్యల్లో నుంచే పరిష్కారం దొరుకుతుందని ఎక్కడో చదివిన గుర్తు.

ఎక్కడ పోయిందో అక్కడే వెతుక్కోవాలి. వెంటనే లేచింది అనిమిష. బయటకు నడిచింది. ఇదంతా భీష్మాచార్య గమనిస్తూనే ఉన్నాడు. ఆమె అటు వెళ్లగానే భీష్మాచార్య ఎవరికో ఫోన్ చేశాడు.

'జాన్... ఆ అమ్మాయిని ఫాలో అవ్వు ఆపదలో ఉంటే కాపాడు లేదా కామ్‌గా వెనక్కి వచ్చేయ్' అని చెప్పి ఫోన్ పెట్టేశాడు.

★ ★ ★

అనిమిష శివారు ప్రాంతంలో ఆటో దిగింది. అతికష్టమ్మీద ఆటో వాడిని ఒప్పించి అక్కడికి వచ్చింది. బస్టాప్ పక్కనే

ఉన్న కంకర మీద ఆమె దృష్టి పడింది. కంకర దగ్గరికి నడిచింది. హ్యాండ్‌బ్యాగ్‌లో ఉన్న యింపార్టెంట్ పేపర్స్, డబ్బు తీసి సైడ్ ప్యాకెట్‌లో పెట్టింది. కంకర రాళ్ళను తీసి హ్యాండ్‌బ్యాగ్‌లో వేసుకుంది. తర్వాత తాపీగా ముందుకు నడిచింది.

★ ★ ★

ఎలక్ట్రిక్ పోల్ కింద నిలబడి అయిదు గురు రౌడీలు మందు కొడుతున్నారు. ఆ శివారు ప్రాంతంలో వీళ్ల బెడదతోనే చాలా మంది ఇళ్లు ఖాళీ చేసిపోయారు. తొమ్మిది దాటక ముందే షాపులు కట్టేస్తారు.

అనిమిష వాళ్ళ దగ్గరికి వెళ్లింది. కెమెరా తీసి క్లిక్ మనిపించింది. ఫ్లాష్ చూసి రౌడీలు అనిమిషను చూశారు.

"ఒరే ఇందాక పారిపోయిన కేసు రా మళ్ళీ వచ్చింది. రేప్ చేయించుకోవాలనే కోరిక పుట్టింది కాబోలు" ఒకడు వెకిలిగా నవ్వుతూ కామెంట్ చేశాడు.

'మనం అందుకే కదరా ఉంది బావుంది. ముందు ఎవరో టాస్ వేద్దాం' మరొకడు అన్నాడు.

అర్ధరాత్రి అందమైన ఆడది. నిర్మానుష్య ప్రాంతం. వాళ్ళు అయిదుగురు పైగా రౌడీలు. ఆమె ఒక్కర్తి. వాళ్ళు అనిమిష వైపు అడుగులు వేశారు.

అనిమిష హ్యాండ్‌బ్యాగ్‌లో నుంచి కంకర రాళ్ళను బయటకు తీసింది. ఒక్కొక్కటి తీసి వాళ్ళ వైపు గురిపెట్టి బలంగా విసిరింది.

వాళ్ళూహించని ఎటాక్ ఒక్క క్షణం ఏమరుపాటు తెచ్చే ఆపద ఏమిటో వాళ్ళకు అర్ధమైంది. ఒకడి తలకు తాకింది. మరొకడి ముక్కు పగిలింది. ఇంకొకడి పెదవి చిట్లింది.

"దాన్ని పట్టుకోండ్రా దాన్ని" ఓ బూతు మాట ఉపయోగించి కసిగా చెప్పాడొకడు.

అనిమిష రాళ్ళను విసురుతూనే ఉంది. వాళ్ళు ముందుకు వచ్చారు. అనిమిష ఓ కంకర రాయిని తీసి బలంగా స్ట్రీట్ లైట్‌కేసి విసిరింది. భళ్ళున శబ్దం చేస్తూ పగిలింది స్ట్రీట్ లైట్.

ఆ ప్రాంతాన్ని చీకటి ఆవహించింది. అనిమిష ఆ చీకట్లోనే ఇందాక తాను విసిరిన రాళ్ళను ఏరి మళ్ళీ హ్యాండ్‌బ్యాగ్‌లో వేసుకుంది. ఈ హఠాత్ పరిణామానికి రౌడీలు కొద్దిసేపు కలవరపడ్డారు.

వాళ్ళకసలు ఏం జరుగుతుందో అర్థం కాలేదు. అనిమిష హ్యాండ్‌బ్యాగ్ నిండా కంకర నింపి జిప్ పెట్టి సైడ్ ప్యాకెట్‌లో నుంచి కారప్పొడి ప్యాకెట్ తీసింది. ప్యాకెట్ విప్పి కారప్పొడిని గుప్పిట్లోకి తీసుకొంది. రౌడీలు దగ్గరయ్యారు.

గుప్పిట్లో ఉన్న కారాన్ని వాళ్ళ కళ్లలో కొట్టింది. వాళ్ళు మంట మంట అని అరవడం మొదలెట్టేరు. ఆమె వెంటనే హ్యాండ్ బ్యాగ్‌ని కూడా చేతిలోకి తీసుకొని గాలిలోకి విసిరింది. వాళ్ళ మొహాలను తాకింది హ్యాండ్‌బ్యాగ్. అందులో ఉన్న కంకర వాళ్ళ మొహాలను పచ్చడి చేస్తోంది. ఆమె ఒడుపూ వేగం చూసి అంతకన్నా ఊహించని ఆమె ఎటాక్ చూసి వాళ్ళు కంగుతిన్నారు.

పైగా గట్టిగా అరుస్తోంది. ఒకరిద్దరు అక్కడికి వచ్చారు. తర్వాత ముగ్గురు నలుగురు ఆ తర్వాత అయిదారుగురు నిమిషాల్లో పదుల సంఖ్యలో వచ్చి చేరారు.

"చూస్తారేమిటి? మీ ఏరియాకు వచ్చి అమ్మాయిలను ఏడిపిస్తుంటే ఏం చేస్తున్నారు? వాళ్ళు అయిదుగురున్నారు. మీరు వందల మంది... వేల మంది" అంటూ రెచ్చగొట్టింది.

ఆ ఏరియాలో ఉండే మహిళల్లో కొత్త ఉత్సాహం వచ్చింది. వాళ్ళ ఉత్సాహం చూసి మగవాళ్ళు రెచ్చిపోయారు. అయిదంటే అయిదే నిమిషాల్లో రౌడీలు కాళ్ళకు బుద్ధి చెప్పారు.

★ ★ ★

భీష్మాచార్య నవ్వాడు. అతని నవ్వు చూసి అనిమిష మళ్ళీ ఆశ్చర్యపోయింది. ఈ మని

షేమిటి ఇందాక నవ్వాడు. ఇప్పుడూ నవ్వుతున్నాడు.

"వెల్‌డన్ సినిమాకు పనికొచ్చే సాహసమే చేశావు"

అది మెచ్చుకోలో, వ్యంగ్యమో అర్థం కాలేదు అనిమిషకు.

"వండ్రఫుల్. యూ హేవ్ డన్ ఏ గుడ్ జాబ్. ఇప్పుడు ఏం రాయబోతున్నావు? "

ఇదివరకటిలా తొందరపడలేదు. ఏం రాయాలో ముందే నిర్ణయించుకుంది.

'ఆడది అర్ధరాత్రి స్వేచ్ఛగా తిరిగితేనే స్వాతంత్ర్యం వచ్చినట్టు కాదు. ఆత్మరక్షణ కోసం తిరగబడి స్వేచ్ఛను ఆమె కాపాడుకున్నప్పుడు నిజమైన స్వాతంత్ర్యం వచ్చినట్టే! అదే పూజ్య బాపూజీకి మనమిచ్చే నివాళి" అంది అనిమిష.

**'గుడ్. వెరీగుడ్. పత్రికా ప్రపంచంలో కుక్క మనిషిని కరిస్తే వార్త కాదు. మనిషే కుక్కని కరిస్తే వార్త. రోజూ ఏ పేపరు తిరగేసినా అత్యాచారాల వార్తలే. అర్ధరాత్రి అత్యాచారాల పర్వాలు. మన బలహీనతే ఎదుటివాడికి బలం. మన తిరుగుబాటే ఎదుటి వాడికి ఓటమి. శత్రువును దెబ్బతీయడానికి సాహసం కన్నా, ఆలోచన ముఖ్యం. నువ్వు చేసిన సాహసాన్నే వార్తగా రాయి. సమస్యకు భయపడి దూరంగా పారిపోవడం కన్నా, సమస్యను నిలదీసి పరిష్కారం వెతుక్కోవడం ధీరోదాత్తత అనిపించుకుంటుంది.**

జర్నలిస్టుకు ఉండవలసిన లక్షణం అది. సమస్య మూలాలను శోధించి, సమస్యలను ఫోకస్ చేస్తూ అవసరమైతే సమస్యలకు పరిష్కారం సైతం చూపించగలగాలి. చాలా మందికి జర్నలిజం ఒక క్రేజ్. జర్నలిజం తపస్సు కావాలి. అందుకే నిన్ను పరీక్షించాను. వెల్. ఈ రోజు నుంచి నువ్వు డైలీ న్యూస్‌లో జర్నలిస్ట్‌వి."

"థ్యాంక్యూ సార్! థ్యాంక్యూ వెరీమచ్"



రెండు చేతులూ జోడించింది. ఆమె కంఠం గాద్గదికమైంది. వేనవేల సంవత్సరాల తపస్సుకు మెచ్చి భగవంతుడు ప్రత్యక్షమైనప్పుడు కలిగే ఆనందం.

"ఆల్‌రైట్ బేబీ నువ్వెక్కడుండాలని అనుకుంటున్నావు. ఇక్కడ విమన్ ఫ్రెండ్స్ ఎవరైనా"

"ఇక్కడ నాకెవ్వరూ ఫ్రెండ్స్ లేరు సార్ ప్రస్తుతం ఏదైనా హోటల్‌లో స్టే చేస్తాను "

"హోటల్‌లోనా నో నెవ్వర్ "

"పోనీ ఈ రాత్రికి ఈ ఆఫీసులో"

"నా ఫ్రెండ్ కూతురు ఎక్కడో ఎందుకు? నా ఇంట్లోనే వుంటుంది"

"థ్యాంక్యూ సార్ " అంది కృతజ్ఞత నిండిన స్వరంతో.

"పదే పదే సార్ సార్ అంటూ లేనిపోని గౌరవాన్ని నాకు అందించొద్దు. అంకుల్ అని పిలువు"

'అలాగే' అన్నట్టు తలూపింది అనిమిష. ఆ క్షణమే ఆమె ఓ మహాయజ్ఞానికి శ్రీకారం చుట్టింది.

ఆ క్షణమే ఆమె ఓ రక్తాభిషేకానికి నాందీ ప్రస్తావన చేసింది.

వేనవేల అగ్ని పర్వతాలను బద్దలు కొట్టడానికి పిడికిలి బిగించింది ఆ క్షణమే.

అక్షరాలా అక్షరాల యుద్ధం మొదలుపెట్టింది. పదాల శంఖారావం పూరించింది.

★ ★ ★

అక్షరాలు నిశ్శబ్దంగా పత్రికలో ఒదిగిపోతున్నాయి. భీష్మాచార్య తూలుతూ బయటకు వచ్చాడు. అతనికి ఆసరాగా ఆమె నడుస్తోంది.

వాళ్ళిద్దర్నీ దూరం నుంచి గమనిస్తున్నాడు జాన్ జాన్ డేవిడ్.

★ ★ ★

నిశ్శబ్ద నిశీధిలోకి విసరివేయబడ్డట్టుగా ఉందా భవనం. యుద్ధంలో క్షతగాత్రమై ఆర్తనాదాలతో తల్లడిల్లినట్టుందా ఇల్లు శ్మశాన నిశ్శబ్దం ఆ ఇంటిని ఆక్రమించుకొని ఉంది.

భీష్మాచార్య తలుపు తెరిచాడు. చీకట్లోనే అతను నడుచుకుంటూ వెళ్ళి స్విచ్ వేశాడు. వెలుతురు పరుచుకున్న ఆ గది గాయపడ్డట్టుగా ఉంది.

దుమ్ము ధూళి పేరుకుంది. ఆ ఇంటిని కొద్ది రోజులుగా శుభ్రపరచిన దాఖలాలు లేవు.

"కమాన్ మై చైల్డ్! ఈ శ్మశాన గృహంలోకి స్వాగతం" అన్నాడు శుష్కమందహాసంతో భీష్మాచార్య.

'అంకుల్' ఆ తర్వాత ఆమె ఏమీ మాట్లాడకపోయినా అతనికర్థమైంది.

"ఈ ఇల్లు నాకు రాత్రిపూట నిద్రపోవడానికి షెల్టరిస్తుందంతే"

"కొన్నాళ్లపాటు ఆ ఇల్లు నిరుపయోగంగా ఉన్నట్టుంది"

ఆమె మనసులోని భావాన్ని చదివినట్టు చెప్పాడు భీష్మాచార్య.

"ఈ ఇంట్లో మొండి గోడల్లేవ్ కానీ మొండి బారిన మనసుంది. ఈ ఇల్లు దుమ్మూ ధూళితో నిండి ఉంది. నా మనసు విషాదంతో నిండి ఉంది. అంతే తేడా. ఈ ఇంటిని నువ్విప్పుడు బాగు చేయలేవు. జస్ట్ ఈ రాత్రి ఎలాగో అడ్జస్టవ్వు. నీకోసం ఓ మంచి ఫ్లాట్ చూస్తాను. రేపు అందులోకి మారుదువుగానీ" అన్నాడు భీష్మాచార్య.

'ఎంత పని? మీరలా బాల్కనీలో కూచోండి. అరగంటలో కంప్లీట్ చేసేయనూ' అంది కొంగును బిగిస్తూ.

"నువ్వా? నీకెందుకమ్మా శ్రమ! అయినా ఈ ఇల్లు చిక్కి శిథిలమైతేనే బావుంటుంది. శిథిలమైన నా జీవితంలా" స్వగతంగా అన్నాడు భీష్మాచార్య.

"ప్లీజ్ అంకుల్ ముందు మీరు వెళ్ళి బాల్కనీలో కూచోండి" అంది.

భీష్మాచార్య నిశ్శబ్దంగా బాల్కనీవైపు నడిచాడు.

★ ★ ★

ఒక్కసారి ఆ ఇంటి పరిసరాలను కనుచివర్ల నుంచి పరిశీలించింది. అంకుల్ చెప్పినట్టుగానే ఆ ఇల్లు పడుకోవడానికి తప్ప ఉపయోగించినట్టు లేదు. అతని తాలూకు మనుష్యులెవరూ ఉన్నట్టు లేదు. గోడకు వేలాడుతోన్న ఫొటో. వంక చూసింది. అది భీష్మాచార్య ఫ్యామిలీ ఫోటో అతను, అతని భార్య, కొడుకు, కూతురు మరో చిన్న పాప బహుశా మనవరాలై వుంటుందేమో ఆ ఫొటో అంతా దుమ్ము పట్టి ఉంది.

ఒక్కక్షణం ఆ ఫొటో వైపు చూసి, మరో క్షణం షాకైంది. ఆ ఫొటోకు దండ వేసి ఉంది.

వెంటనే వెళ్ళి ఆ ఫొటోకు ఉన్న దండ తీయబోయింది.

"వద్దమ్మా! ఆ ఫొటోకి వేలాడే దండ తీయొద్దు".

"అంకుల్ ఆ ఫొటోలో"

"పోయినోళంతా మంచోళ్లు, ఉన్న వాళ్ల తీపిగుర్తులు".

"ఈ లోకంలో లేరు. ఈ రాతి మనిషి మనసులో ఉన్నారు"

"అంకుల్ మరీ మీరు"

"ఈ లోకంలో ఉన్నాను. మనిషిగా ఉన్నాను. మనసుగా ఎప్పుడో చచ్చిపోయాను అందుకే ఆ దండలో నాకు భాగముంది".

అనిమిష ఒక్కక్షణం స్థబ్దుగా ఉండిపోయింది. ఒక విషాద వీచిక, మరో విషాద వీచికను పరామర్శించినట్టు అతని గతం గురించి తెలుసుకోవలసిన సమయం కాదు అనిమిష మౌనంగా తన పనిలో పడింది.

అరగంటలో ఆ ఇంటి రూపురేఖలు మార్చేసింది. గబగబా ఓ యంత్రంలా పని చేస్తూ పోయింది. ఇల్లు మొత్తం ఊడ్చింది. బెడ్‌షీట్లు మార్చింది. ఇల్లంతా దులిపింది.

భీష్మాచార్య అలానే చూస్తుండిపోయాడు. ఆ క్షణం అతనికి తన కూతురే గుర్తొచ్చింది.

★ ★ ★

"అంకుల్ కిచెన్ రూమ్‌లో అన్నీ

ఉన్నాయా వంట చేయడానికి"

"ఏమో నాకు తెలియదు బేబీ! అయినా ఎందుకు ఏదైనా హోటల్ నుంచి క్యారేజీ తెప్పించుకుందాం".

"వద్దంకుల్. నేనే చూసి క్షణాల్లో వంట చేస్తాను".

"నీకెందుకమ్మా శ్రమ"

"ఇందులో శ్రమేముంది అంకుల్ క్షణాల్లో అయిపోతుంది" అంటూ కిచెన్‌లోకి వెళ్ళింది.

కుక్కర్ వెతికి బయటకు తీసి శుభ్రం చేసింది. అరగంటలో వేడివేడి అన్నం రసం చేసింది. అడుగున ఉన్న వడియాలు తీసి వేయించింది. డైనింగ్ టేబుల్ మీద సర్ది భీష్మాచార్యను పిలిచింది.

★ ★ ★

అన్నం తింటుంటే పొలమారింది భీష్మాచార్యకు. వెంటనే అతని తలమీద చేత్తో తట్టి "ఎవరో గుర్తు చేసుకుంటున్నారంకుల్" అంది. "గుర్తు చేసుకోవడానికి ఆత్మీయులు బ్రతికిలేరు. బహుశ శత్రువులే అయివుంటారు."

అతనివంక పరిశీలనగా చూసింది. ఏ భావమూ అతని నుంచి బయటకు రావడం లేదు. విషాదం మూర్తీభవించినట్లు ఉన్న ఆ మనిషి గాంభీర్యాన్ని ఆశ్రయిస్తున్నట్టు ఉంది.

అతను అన్నమాటలే ఆమె చెవుల్లో గింగురుమంటున్నాయి. గుర్తు చేసుకోవడానికి ఆత్మీయులు బ్రతికిలేరు. బహుశా శత్రువులే అయి ఉంటారు.

★ ★ ★

సిటీ అవుట్‌స్కర్ట్స్‌లో వుందా భవనం. చీకటి సామ్రాజ్యానికి రాజధానిలా ఉందా ప్రాంతం. మాఫియా ప్రపంచానికి రాజభవనంలా వుందా భవనం. చుట్టు ఎలక్ట్రిక్ ఫెన్సింగ్. ఏ ఒక్కరు ఆ ఎలక్ట్రికల్ ఫెన్సింగ్‌ని టచ్ చేసినా క్షణాల్లో మాడి మసైపోవడం ఖాయం. ఆ భవనం లోపల టైట్ సెక్యూర్టీ ఉంది. భవనం ముందు ఓ వ్యక్తి పహరా కాస్తున్నాడు. భవనంమీద ఓ వ్యక్తి హైపవర్ బైనాక్యులర్స్‌తో గమనిస్తున్నాడు. సెర్చిలైట్ చుట్టూ తిరుగుతోంది.

వివిఐపి భవనానికి కూడా అంత సెక్యూర్టీ హంగామా ఉండదేమోననిపించేలా ఉంది. లోపల డబర్‌మెన్‌లు గుర్రుమంటూ స్వేచ్ఛగా తిరుగుతున్నాయి.

సింహాలను మించిన కుక్కలు అక్కడ కాపలా కాస్తున్నాయి. అపరిచిత వ్యక్తి ఆ పరిసరాల్లో తచ్చాడిన మరుక్షణం అతనికి భూమ్మీద నూకలు చెల్లడం తథ్యం.

రోడ్డుకు కొన్ని వందల అడుగుల దూరంలో వున్న రోడ్డు పక్కగా వెహికల్స్ అటు నుంచి పోవడానికి కూడా భయపడతాయి. రాత్రి పది దాటిన తర్వాత టూవీలర్స్ అటు నుండి వెళ్ళవు. వెళ్ళినా సెక్యూర్టీ ప్రాబ్లమ్స్ ఎదుర్కోవాలి.

నల్ల ప్రపంచానికి అది కేరాఫ్. హెరాయిన్, బ్రౌన్ షుగర్ మొదలు మారణాయుధాలు, అణు విధ్వంసక బాంబులు ఏవైనా సరే అక్కడ నిక్షిప్తమై వుంటాయి. తమ శత్రువులను ఆ భవనంలోని చీకటి సెల్‌లో టార్చర్ చేస్తారని చాలామందికి తెలియదు. సమాంతర ప్రభుత్వాన్ని నడిపించే ఓ వ్యక్తి ఆ భవనానికి అధిపతి.

అతనే దాదామియా.

మాఫియా ప్రపంచానికి దాదామియా ఒక హడల్. ఎంత కరుడుగట్టిన డాన్ అయినా దాదామియా పేరు చెబితే ఉలిక్కిపడతాడు. ప్రభుత్వంలో ప్రకంపనలు మొదలవుతాయి.

అతను ఎవర్నికైనా డెత్ వార్నింగ్ ఇష్యూ చేశాడంటే అతనిక బ్రతికి బట్టకట్టడం ఉండదు. డెత్‌వార్నింగ్‌లో ఉన్న వ్యక్తికి ఈ విషయం తెలియగానే సూసయిడ్ చేసుకుం

*అసలే ఆయువు స్వల్పం. అశ్రద్ధతో కాలంగడిపి, ఆయువును మరింత క్షీణింపజేసుకుంటున్నాము.* – విక్టర్‌హ్యూగో

టాడు.

అంతటి పవర్ ఉన్న దాదామియా సామ్రాజ్యంలోకి చొచ్చుకువచ్చే ప్రయత్నం చేసిన వాళ్ళు చాలామంది అడ్రస్ గల్లంత యిపోయారు. ముంబయ్ బాంబు పేలుళ్ళకు అతనికి సంబంధం ఉన్న విషయాన్ని ఎవరూ నిరూపించలేరు. పార్లమెంట్ ఈ దాడిలో అతని ప్రత్యక్ష లేదా పరోక్ష ప్రమేయం ఉందంటే దానికి ఆధారమూ లభించదు.

డబ్బుకోసం ఎలాంటి పనైనా చేయడం దాదామియా ప్రత్యేకత.

అరవై అయిదేళ్ళ దాదామియా ఓ పదేళ్ళు తగ్గినట్టు కనిపిస్తాడు. అతని చేతిలో పైప్ ఎప్పుడూ ఉంటుంది. అది పైప్ మాత్రమే కాదు బుల్లెట్లను రిలీజ్ చేసి ఎదుటి మనిషి ప్రాణాలను తీయగల అత్యాధునిక వెపన్ అని చాలామందికి తెలియదు. అతని తరపున నేరాలు చేయడానికి ఒక్కో రాష్ట్రంలో ఒక్కో ప్రతినిధి ఉంటాడు.

ప్రతినెలలో మొదటివారంలో ఆయా రాష్ట్రాల ప్రతినిధులు వచ్చి తమ వాటాలను దాదామియా పరం చేసి అతనిచ్చింది పుచ్చుకోవాలి.

అతని మైండ్ కంప్యూటర్ కన్నా శక్తిమంతమైందని పోలీసు ఉన్నతాధికారులు సైతం ఒప్పుకుంటారు. ఎక్కడ ఏ నేరం జరిగింది ఆ నేరం వెనుక ఎవరున్నారు? లాంటివన్నీ అతని మెదడులో ప్రింటయి ఉంటాయి.

★ ★ ★

ఓ నలుపురంగు వ్యాన్ రోడ్డు నుంచి పక్కకు తిరిగింది. రోడ్డు పక్కనే డెత్‌జోన్ అన్న బోర్డు వుంది. ఆ పరిసర ప్రాంతాలకు వెళ్ళిన యువకులు చాలామంది మృత్యువాత పడ్డంతో అనధికారంగా పోలీసులే ముందు జాగ్రత్త చర్యగా ఆ బోర్డు పెట్టారు.

నలుపురంగు వ్యాను ఆ భవనంవైపు వెళ్తోంది. కొద్ది అడుగులు ముందుకు వెళ్ళగానే చెక్‌పోస్ట్‌లాంటిది తగిలింది. స్టెన్‌గన్స్ ధరించిన వ్యక్తులు ఇద్దరు వ్యాన్‌ని చూశారు. వ్యాన్‌మీద వున్న ఎరుపురంగు తామరపువ్వు గుర్తుచూసి వ్యాన్‌ని ఆపమన్నారు.

డ్రైవర్ వ్యాన్ ఆపాడు. ఓ సెక్యూర్టీ ఆఫీసర్ వ్యాన్ డోర్ తెరిచాడు.

వ్యాన్ లోపల వున్న వ్యక్తి కోడ్‌వర్డ్ చెప్పాడు. అదివిని సంతృప్తిగా తల పంకించి గేటు తీయమని చెప్పాడు. గేటు తెరుచుకుంది.

వ్యాన్ దాదామియా భవనప్రాంగణంలోకి ప్రవేశించి ఆ భవనానికి వున్న మరో ముద్దుపేరు డెత్‌హౌస్.. ఆ ప్రాంతాన్ని డెత్‌జోన్‌గా పిలుచుకుంటారు.

డెత్‌హౌస్‌లోకి వ్యాన్ ప్రవేశించగానే నలుపురంగు వ్యాన్‌లో వున్న వ్యక్తులు దిగారు. వాళ్ళను సెక్యూర్టీ చుట్టుముట్టి చెక్‌చేసి లోపలికి వెళ్ళమన్నారు. డాబర్‌మెన్‌లను ముందుజాగ్రత్తగా కట్టేశారు.

★ ★ ★

విశాలమైన హాలు.

సినిమా సెట్టింగులా ఉంది. హాలు మధ్య రౌండ్‌షేప్‌లో బెడ్. ఎక్కడా కుర్చీలు లేవు. ఆ హాలులో నాలుగువైపులా కెమెరాలు ఉన్నాయి. వీడియో కెమెరాలు అక్కడ జరిగే ప్రతీ చిన్న సంఘటనను చిత్రీకరిస్తాయి. సెక్యూర్టీ చీఫ్‌కు ఆ వీడియో చిత్రీకరణ స్పష్టంగా కనిపిస్తుంది. ఆ హాలులో ఎవరికీ తెలియకుండా సీక్రెట్ తుపాకులు రంధ్రాలద్వారా లోపలివైపుకు ఎయిమ్ చేయబడి ఉంటాయి.

★ ★ ★

వ్యాన్‌లో నుంచి దిగి సరాసరి ఆ హాలులోకి వచ్చారు అగంతకులు. వాళ్ల హాలులోకి రాగానే హాలు ద్వారాలు మూసుకున్నాయి. మళ్లీ బయటకు వెళ్లాలంటే సెక్యూరిటీ చీఫ్ ఆపరేట్ చేసి తలుపులు తెరవాల్సిందే. అసలా హాలులో ద్వారాలు ఎటువైపు ఉన్నాయో కూడా ఇతరులకు తెలి

యవు.

ఆ అగంతకులు దాదామియా రాష్ట్రాలవారీగా నియమించిన మనుష్యులే ఆయా రాష్ట్రాల్లోని నేరాల గురించి, తమ ఆదాయం గురించి, సమస్యల గురించి చర్చిస్తారు. తమ ద్వారా సమకూరిన ఆదాయం లెక్కలు చూపించి అక్కడ అందజేస్తారు.

★ ★ ★

అక్కడ స్మశాన నిశ్శబ్దం

అప్పటికే అక్కడికి ఎన్నోసార్లు వచ్చినా ప్రతిసారీ భయమే. మృత్యు గృహంలా అనిపిస్తుంది వాళ్లకు. వాళ్లలో చాలామంది కరడుగట్టిన నేరస్థులు. అందరూ సంఘ వ్యతిరేకశక్తులే అయినా వాళ్ల కళ్లలో భయం తొంగి చూస్తుంది.

దాదామియా ఏ చాటునుంచి వస్తాడో ఎవ్వరికీ అర్థం కాదు ఎలా వెళ్తాడో కూడా తెలియదు. ఒక్కసారిగా ఆ హాలులోని లైట్లు ఆరిపోయాయి.

చిక్కటి చీకటి కళ్లు నలుముకొని చూసినా ఏమీ కనిపించడంలేదు. చిన్న శబ్దం.

ఆ హాలులోని ఓ మూల ఉన్న గోడ రెండుగా విడిపోయింది. అందులో నుంచి లోపలికి వచ్చాడు దాదామియా. అతను లోపలికి రాగానే గోడ యథావిధిగా అతుక్కుపోయింది. చీకటికి అలవాటు పడ్డాడు దాదామియా. రౌండ్ బెడ్‌మీద కూర్చున్నాడు.

లైట్లు వెలిగాయి. అందరూ దాదామియాని చూసి సెల్యూట్ చేశారు. దాదామియా విలాసంగా రౌండ్‌బెడ్ మీద కూచున్నాడు. దాదామియా చేతిలోని రిమోట్‌లో ఉన్న ఓ మీట నొక్కాడు. రౌండ్ బెడ్ మెల్లగా తిరుగుతోంది.

"వెల్... మీ అందరికీ డెత్‌హౌస్ స్వాగతం పలుకుతుంది. మీ వ్యాపారాలు ఎలా ఉన్నాయి? "

బీహార్ నుంచి వచ్చిన మిశ్రా నోరు విప్పాడు.

"దాదామియా సాబ్. ఠాకూర్‌ల తాకిడి ఎక్కువైంది. రాజకీయనాయకులే దోచుకుంటున్నారు. మా కార్యకలాపాలు ఇక్కడ సజావుగా సాగడంలేదు."

'అచ్ఛా' అంటూ మరో వ్యక్తివైపు చూశాడు.

"సాబ్. ఠాకూర్ లాంటివాళ్లు అండర్ గ్రౌండ్‌లోకి వెళ్లడంతో మనకు బాగానే ఉంది. కానీ మనమీద నిఘా ఎక్కువైంది. రాజన్ మనుష్యుల నుంచి మనకు తలనొప్పి ఎక్కువైంది సాబ్".

"ఒకరి వ్యవహారాల్లో మరొకరు జోక్యం చేసుకోవద్దని అంతకుముందే అనుకున్నాంగా"

"అనుకున్నాం సాబ్! రాజన్ మాత్రం మన మాటలను కేర్ చేయడం లేదు. మన మనుష్యులను టార్గెట్‌గా పెట్టుకున్నాడు. సలీమ్‌కు యాక్సిడెంట్ అయింది. అది రాజన్ పనే అని మా అనుమానం సాబ్".

దాదామియా ఒక్క క్షణం కళ్లు మూసుకున్నాడు ఆ తర్వాత ఆ కళ్లు తెరిచి "రాజన్ గురించి మరిచిపోండి. మీరు ముంబయ్ వెళ్లేసరికి రాజన్ ఇక ఉండడు" అంటూ షంషేర్‌వైపు చూశాడు. అతను ఆంధ్రప్రదేశ్ వ్యవహారాలు చూస్తాడు.

అతన్నందరూ కిళ్లీ శంకర్ అంటారు. చిన్న కిళ్లీషాపు ఉంది. పాతబస్తీలో కిళ్లీలు చుట్టడంలో అతనికి మంచి పేరుంది. విషపూరితమైన కిళ్లీలతో ప్రత్యర్థులను చంపుతాడని చాలా మందికి తెలియదు. ఓ సాదా సీదా కిళ్లీ కొట్టు నడుపుకునే మనిషిలా కనిపించే కిళ్లీ షంషీర్ కరడుగట్టిన నేరస్థుడు.

"షంషీర్! కైసాహై ఆంధ్రప్రదేశ్" అడిగాడు దాదామియా.

"సాబ్ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మన మీద కన్నేసిందిగనుక సపోర్ట్ చేసేవాళ్లు తక్కువయ్యారు. నకిలీ స్టాంపుల కేసులో మనహ్యాండ్ కూడా ఉందని పోలీసులకు అనుమానం వచ్చింది'.

'సో వాట్' దాదామియా కనుబొమ్మలు ముడిపడ్డాయి.

'శర్మ హత్య అక్కడ గొడవ ఎక్కువ య్యేలా చేసింది సాబ్'.

"వాట్"

'అవును సాబ్! ఆ శర్మను మనం మామూలుగా వార్నింగిచ్చి వదిలేద్దామను కున్నాం. అయినా నీతి నిజాయితీ చట్టం అంటూ మనల్నే సవాల్ చేశాడు. అప్పటికీ అతని భార్యను చంపుతామని బెదిరించినా విన్లేదు. అతడ్ని కొడుకుని, భార్యను లేపేశాం. కూతురు ఒక్కర్తి తప్పించుకుంది."

"షంషేర్! రుణశేషం, శత్రుశేషం వుండ కూడదు ఆ పిల్ల ఇప్పుడెక్కడ వుంది"?

"తెలియదు సాబ్. అయినా ఆడపిల్ల ఏంచేస్తుంది సాబ్".

"ఖాముష్ ఆడపిల్లను అగ్గిపుల్లను తక్కువగా చూడొద్దు. సిగరెట్ అంటించు కొని ఉఫ్ మని ఊదిపారేస్తే ఆరిపోతుందని అనుకోవద్దు. అది ఆరకుండా మనకే అంటు కొని మనల్ని తగలేసి చంపుతుంది కూడా. ఆడపిల్ల కూడా అంతే..."

షంషేర్ తలవంచుకున్నాడు.

"ఇంతకీ ఆ పిల్ల నీకు కనిపించలేదా? "

"ఓసారి వచ్చి పెద్ద గొడవ చేసి వెళ్లింది సాబ్. మన మనుష్యులను పంపించాను. అప్పుడు పారిపోయింది".

'ఆ పిల్ల ఫొటో సంపాదించు' అక్కడి వ్యవ హారాలు మరెవరికైనా అప్పగించి, నువ్వు ఆ పిల్లను పట్టుకునే పనిలో ఉండు. ఎందుకో తెలుసుగా."

"తెలుసు సాబ్. మన గురించి రహ స్యాలు తెలిసిన మనిషిని మనం ఫినిష్ చేయాలి."

"వెరీగుడ్.. మీరంతా ఈవేల్టికి రెస్ట్ తీసు కోండి. వెళ్లండి."

లైట్లు అన్నీ ఆఫ్ అయ్యాయి. రెండు నిమిషాల తర్వాత లైట్లు వెలిగాక చూస్తే దాదామియా లేడు. అందరూ వెనుతిరి గారు.

"డియర్ ఎనిమీ! నిన్ను వదిలిపెట్టను" అనుకున్నాడు షంషేర్. అతని చేతిలో ఆ అమ్మాయి ఫోటో ఉంది.

ఆ ఫోటో అనిమిషది.

★ ★ ★

చీకటి పహరా కాసేవేళ. విషాదం మన తోటే ఉన్న క్షణాన, ఆలోచనలతో అంతర్మ థనానికి చేరువయ్యే సమయాన.. కంటికి కునుకెలా వస్తుంది. మనసుకు ప్రశాంతత ఎలా చేకూరుతుంది?

అనిమిషకు నిద్ర రావడంలేదు. మనసు అల్లకల్లోల కాసారమే అయింది. అంతర్మ థనం గుండెను పట్టి కట్టి కుదిపేసే విషా దానుభవాల పర్వం అయింది.

గోడకు చేరగిలపడి మోకాళ్ళ మధ్య తల పెట్టింది. శూన్యం. అంతా శూన్యం తన చుట్టూ ప్రపంచం ఉంది. ప్రపంచమంతా హడావిడిగానే ఉంది. మనుష్యులున్నారు. ఎవరి బిజీలో వాళ్లున్నారు. తెల్లవారితే రణ గొణ ధ్వనులే.. ఎవరి పనుల్లో వారు బిజీనే.. కానీ తాను ఒంటరి.

ఇప్పుడు కాదు.. ఈ రోజే కాదు.. రేపు.. ఎల్లుండి.. జీవితమంతా తను ఒంటరే కదా.. ఆ ఆలోచనే ఆమెను శూన్యావస్థలోకి నెట్టేస్తుంది.

ఒంటరి తనం శాపం కాక మరేమిటి?

దేవుడా.. ఒంటరిగా ఈ భూమ్మీదికి వదిలి, మమ్మల్ని సృష్టించి నువ్వు మాకు తోడుగా మనుష్యులను, మమతలను, బంధాలను, అనుబంధాలను అందించావు.. మళ్లా అంతలోనే ఏదో గుర్తొచ్చినట్లు.. నీ సృష్టి వైచిత్రాన్ని కొనసాగించి, ఒంటరిని చేశావు. ఇది నీకు న్యాయమా అవున్లే.. ఏ అనుబంధాలు లేని నీకు అనుబంధాల మాధుర్యం ఎలా తెలుస్తుంది?

ఒక్క క్షణం తల విదిల్చింది.. తల్లి కళ్ల ముందు కదలాడింది. తండ్రి కనురెప్పల మధ్య కన్నీటి చుక్కయి తారసపడ్డాడు.

తమ్ముడు గొంతుకడ్డుపడ్డాడు.

ఆ క్షణం ఆమెలో రకరకాల భావోద్వేగాల సమ్మేళనం జరిగింది.

★ ★ ★

భీష్మాచార్య కళ్లు తెరిచి ఒక్క క్షణం విస్మయంగా చూసేడు. పడగ్గది కిటికీ తెరవగానే ఎండిపోయిన పూలమొక్కలు లేవు. రాలిపోయిన ఆకులు లేవు. పచ్చదనం తనే సర్వం అయినట్టు ఉంది. ఇంటిముందు ముగ్గు ఆహ్వానగీతంలా ఆహ్లాద సూచికలా ఉంది. పూలమొక్కలు తడిసి స్నానం చేసినట్టున్నాయి. తన గది వంక చూసేడు, నీట్‌గా వుంది.

రాత్రికి రాత్రే ఏ ఇంద్రజాలికుడో హోంఫట్ అంటూ చెత్తగదిని, మంచిగదిగా మార్చినట్టువుంది. గోడ మీద ఉన్న క్యాలెండర్‌లో డేటు మారి కనిపించింది. పదకొండు నెలల క్రితం తేది ఒకేసారి మారిపోయింది. ఇది తన గదేనా? అన్న అనుమానం కలిగేలా ఉందా గది వాతావరణం.

"గుడ్ మార్నింగ్ అంకుల్".. అంటూ అనిమిష కాఫీ కప్పుతో వచ్చింది.

చీరకట్టులో అందంగా ఉంది. పవిత్రంగా ఉంది. పెరట్లో పూజచేసే తులసి మొక్కలా ఉంది. అతనికాక్షణం తన కూతురే గుర్తొచ్చింది.

"మీకు బెడ్ కాఫీ అలవాటు ఉందా అంకుల్?" అడిగింది అనిమిష.

"ఒకప్పుడు ఉండేది కాదు. ఇప్పుడన్ని అలవాట్లూ కొత్తగా వచ్చి చేరాయి." స్వగతంగా అనుకుంటూ కాఫీ కప్పు అందుకున్నాడు.

ఒక సిప్ చేశాడు. అతని మొహంలో రిలీఫ్ కనిపించింది.

"కాఫీ చాలా బావుంది. నీకో విషయం తెలుసా మై చైల్డ్.. మా అను కూడా కాఫీ ఇలానే కలిపేది. నిన్నెవరు చేసుకుంటాడో కానీ అదృష్టవంతుడమ్మా అనే వాణ్ణి" చిన్న సన్నటి కన్నీటి మెరుపు అతని బుగ్గల మీద మెరిసింది.

"అను అంటే"

"అనూష మై వన్ అండ్ వోన్లీ డాటర్" ఒక్క క్షణం అతని వైపు చూసింది. అతని గతాన్ని తెలుసుకోవలసిన సమయమిది కాదు.

"అంకుల్.. మీరు స్నానం చేస్తే ఈలోగా టిఫిన్ రెడీ చేస్తా. ఇంట్లో సరుకులేవీ లేవు. కొద్దిగా ఉప్మా రవ్వ ఉంది. ఉప్మా చేసేస్తాను."

భీష్మాచార్య లేచి బాత్రూం వైపు కదిలాడు.

★ ★ ★

భీష్మాచార్య టిఫిన్ చేస్తూ ఆవేళ్టి డైలీ న్యూస్ పత్రికను అనిమిషకు ఇచ్చాడు. అప్పుడు గుర్తొచ్చింది అనిమిషకు.. రాత్రి తాను రాసిచ్చిన న్యూస్ స్టోరీ.

స్పెషల్ పేజీలో ఓమూల బాక్స్‌కట్టి వేశారు అనిమిష రాసిన స్టోరీ బైలైన్‌లో తన పేరు చూసుకుంది.

ఆనందం.. అంబరాన్ని తాకిందో.. అర్ణవాన్ని చీల్చుకు వెళ్ళిందో.. ఈ రెంటి మధ్య విహంగమై విహరించిందో!

"వెల్‌డన్ బేబీ కీపిటప్ చాలా బాగా రాశావ్. ఇంతకు ముందు అనుభవం ఉందా? మంచిభాష.. మంచి భావజాలం.. రైటర్‌కు అయినా జర్నలిస్ట్‌కు అయినా ఏ దారిద్రం ఉన్నా పర్లేదు భావ దారిద్రం ఉండకూడదు."

మాస్టారు ముందు స్టూడెంట్‌లా ఉంది అనిమిష.

"చూడు బేబీ.. రాత్రి పూట డిటేల్స్ ఎందుకని అడగలేదు. ఇప్పుడు చెప్పు. మీ నాన్న నిన్నెందుకు ఇక్కడికి పంపించాడు? జర్నలిస్ట్‌గా చేయాలన్న ఆలోచన నీకెందుకు వచ్చింది?" ఆమె వంకే సూటిగా చూస్తూ అడిగాడు భీష్మాచార్య.

"సమయం వచ్చినప్పుడు తప్పకుండా చెబుతానంకుల్. అప్పటి వరకూ నన్నేమీ

అడక్కండి ప్లీజ్."

భీష్మాచార్య మరింకేమీ మాట్లాడలేదు

ఆల్ రైట్ బేబీ నువ్వు నాతోపాటు ఆఫీసుకు వచ్చేయ్. ఇవ్వాళ మెయిన్ సర్కిల్ లో అధికార పార్టీవాళ్ళ బంద్ ఉంది. రాస్తా రోకో ఉంది. ఆ న్యూస్ కవర్ చేయి అది న్యూస్‌లా ఉండకూడదు. న్యూస్ స్టోరీలా ఉండాలి.

"అలాగే అంకుల్"

"నీకు టూ వీలర్ డ్రైవింగ్ వచ్చా? "

రాదన్నట్టు తల అడ్డంగా ఊపింది అనిమిష.

ఓసారి తల పంకించి. ఆమెవైపు చూసి, "అయితే ఎలా వెళ్తావ్ బస్సులోనా? జర్నలిస్ట్ అని వెళ్ళేటప్పుడు ఎలర్ట్‌గా ఉండాలి. బస్సు కోసమో, ఆటో కోసమో ఎదురుచూస్తున్నట్టు ఉండకూడదు."

అనిమిష అతని మాటలు అర్థమైనట్లు తల పంకించింది.

★ ★ ★

"బేబీ... బయల్దేరుదామా" అడిగాడు బయల్దేరడానికి సిద్ధపడుతూ

"అంకుల్... ఆ గ్యారేజ్ పక్కనున్న కైనెటిక్ ఎవరిది? "

ఒక్క క్షణం భీష్మాచార్య దృష్టి గ్యారేజి పక్కనున్న కైనెటిక్ మీద పడింది.

"అది అనూషది" చెబుతున్నప్పుడు గొంతు గాద్గదికమైంది.

"దాని తాళాలు ఎక్కడున్నాయంకుల్"

"ఎందుకు"

"నేనా వెహికల్ నడిపించచ్చా"

చిత్రంగా ఆమెవైపు చూసి అడిగాడు "తప్పకుండా. కానీ నీకు టూ వీలర్ నడపటం రాదన్నావ్"?

"రాదు. కానీ నేర్చుకుంటాను"

"ఇప్పుడా ఇప్పుడెవరు నేర్పిస్తారు? "

"నేనే నేర్చుకుంటాను అధికార పక్షం బంద్, రాస్తారోకో మధ్యాహ్నం అన్నారు కదా"

"అవును. అయితే"

"ఈలోగా ఓసారి ట్రయ్ చేస్తాను. ప్లీజ్ మీకు అభ్యంతరం లేకపోతే ఆ బండి కీస్ ఇవ్వండి"

భీష్మాచార్య చెప్పాడు. "లెఫ్ట్ వైపు గదిలో ఉంటాయి చూడు. ఆ గది అనూషది" చెప్పాడు వణుకుతున్న గొంతుతో.

భీష్మాచార్య ఆఫీసుకు బయల్దేరాడు.

★ ★ ★

భీష్మాచార్య ఆఫీసుకు వెళ్ళేక ఎడమవైపు గదిలోకి అడుగు పెట్టింది.

రాత్రి తనా గదిని చూడ్లేదు. దాని కీస్ భీష్మాచార్య దగ్గర ఉండిపోయాయి.

గదంతా దుమ్ముతో నిండిపోయింది. గోడకు ఓ అందమైన అమ్మాయి ఫోటో వేలాడుతోంది. నవ్వు మొహంతో ఆకర్షణీయంగా ఉంది. టేబుల్ మీద బుక్స్ ఉన్నాయి. బుక్స్ దుమ్ముకొట్టుకుపోయి ఉన్నాయి. వాటి దుమ్ము దులిపి బుక్స్ ఓపెన్ చేసింది. ముత్యాల్లాంటి అక్షరాలు... చక్కని దస్తూరి.

అరగంటలో ఆ గదిని శుభ్రపరిచే పని పూర్తిచేసింది. వార్డ్‌రోబ్ సర్దుతుంటే ఆమె చేయి వణికింది. చీరలు, గాగ్రా చోళీలు, చుడీదార్లు, జీన్స్ అసలు ఈ అమ్మాయికి ఏం జరిగింది? అతని భార్యకేమైంది? ఎన్నో ప్రశ్నలు, ఎన్నో సందేహాలు, సమాధానం లేని ప్రశ్నలు! టైం చూసుకుంది. తొమ్మిది దాటింది. టేబుల్ మీద కైనెటిక్ కీ దొరికింది.

★ ★ ★

భీష్మాచార్య కోటు జేబు తడుముకున్నాడు. జిన్‌టిన్ లేదు. రోజూ తన కోటులోనే ఉంటుంది. ఏమైపోయింది? ఒక్క క్షణం అతని మెదడు మొద్దుబారిపోయింది. టైం పదకొండున్నర అవుతోంది.

అప్పుడే లోపలికి వచ్చింది అనిమిష. ఆమె చేతులు గీరుకుపోయి ఉన్నాయి.

నుదురు మీద చిన్న ప్లాస్టర్ వుంది. ఇంకా చాలాచోట్ల దెబ్బలు తగిలినట్లే అనిపిస్తోంది.

"ఏమైంది బేబీ? " కంగారుగా అడిగాడు భీష్మాచార్య ఆమె వాలకం చూసి.

"నథింగ్ టు వర్రీ అంకుల్ ఏమీ కాలేదు"

"ఏమీ కాలేదంటున్నావ్! మరి చేతికి ఆ దెబ్బలు ఏంటి? యాక్సిడెంట్ అయిందా? "

"లేదంకుల్! అన్నట్టు బంద్, రాస్తారోకో కవరేజికి వెళ్ళమంటారా? "

"ఇప్పుడు ఆటోలు కూడా బంద్. మన రిపోర్టర్‌ని ఎవరినైనా తోడిచ్చి వెహికిల్ మీద పంపిస్తాను"

"పర్లేదంకుల్ నేను వెళ్తాను"

"ఎలా వెళ్తావ్? బస్సులు కూడా అంతంత మాత్రంగానే నడుస్తాయి? "

"కైనెటిక్ మీద వెళ్తానంకుల్"

ఒక్కసారి ఆమె వంక చూశాడు. అతనిలో చిన్న అనుమానం.

"కైనెటిక్ మీద వెళ్తావా? డ్రైవింగ్ రాదన్నావ్? "

"నేర్చుకున్నానంకుల్" ఆమె కాన్ఫిడెంట్‌గా చెప్పింది.

"ఏమిటి నేర్చుకున్నావ్ అప్పుడే నేర్చుకున్నావా? " ఆమె వంక పరిశీలనగా చూస్తూ అన్నాడు.

"అవునంకుల్ మీరు వెళ్ళగానే కైనెటిక్ బయటకు తీశాను. ఇంటి పక్కనే ఉన్న మెకానిక్‌కు మీ పేరు చెప్పగానే చిన్న రిపేర్ చేయించి ఇచ్చాడు. అతనే చెప్పాడు ఎలా నడపాలో. పక్కనే ఉన్న గ్రౌండ్‌లోకి వెళ్ళాను. నేనే నేర్చుకున్నాను. అందుకే చిన్న దెబ్బలు" అంది చిన్న నవ్వు నవ్వుతూ.

విభ్రాంతిగా చూశాడు. విస్మయంగా చూశాడు. విజయగర్వంతో చూశాడు.

అతనిలో చిన్నపాటి ఆనందం క్షణక్షణానికి పెరిగి పెద్దదవ్వసాగింది.

"వెరీ గుడ్. కీపిటప్ "

"ఏకలవ్యుడి కన్నా నేను గొప్పేమీ కాదు. ఆఫ్టాల్ టూ వీలర్ నడపటం "

"యూ ఆర్ కరెక్ట్. ఏకాగ్రత ఉంటే ఏదైనా సాధించొచ్చు. గో ఎహెడ్. నీతోపాటు ఓ ఫొటోగ్రాఫర్ కూడా వస్తాడు" అని చెప్పి ఫొటోగ్రాఫర్‌ని పిలిచి కొన్ని ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చి అనిమిషతో వెళ్ళమన్నాడు.

దాదామియా డెత్ జోన్‌లో సమావేశమయ్యారు.

ఢిల్లీలో కరుడుగట్టిన నేరస్తుడిగా, పోలీసుల మోస్ట్ వాంటెడ్ లిస్ట్‌లో వున్న సలీం.. ఆ సమావేశంలో ముఖ్యవ్యక్తి. అతని పేరు మీద అరెస్ట్ వారెంట్ ఎప్పుడో ఇష్యూ అయ్యింది. అతను తరుచూ పోలీసు అధికారులను కలుస్తూనే ఉంటాడు. మందు పార్టీలో అలా మెరిసి ఇలా మాయమవుతాడు. అయినా అతడిని పోలీసులు అధికారపూర్వకంగా ట్రేస్ చేయలేకపోతారు.

నలభై మూడేళ్ళ సలీం చూడ్డానికీ క్రూరంగా ఉంటాడు. అతని మాటల్లోనూ క్రూరత్వం తొంగిచూస్తోంది. దాదాపు ఎనిమిది రాష్ట్రాల్లో అతని మీద కేసులు నమోదై ఉన్నాయి.

అతనికున్న భయంకరమైన వీక్నెస్ అమ్మాయిలను అతి క్రూరంగా రేప్‌చేసి చంపడం. కొందరతన్ని శాడిస్ట్ అంటారు. డబ్బు కోసం ఏ పనిచేయడానికైనా అతను వెనుకాడడు.

★ ★ ★

"డియర్ జంటిల్మెన్..." సిటీలో బిజినెస్ టైకూన్‌గా పేరున్న కఠారియా గొంతు విప్పాడు. బిజినెస్ టైకూన్‌గా అతనికి మంచి పేరుంది. అతను ప్రతీ పరిస్థితిని తనకు అనుకూలంగా మార్చుకోగలడు. ఉదయం ప్రతిపక్షం వాళ్ళిచ్చే అల్పాహార విందుకు వెళ్ళగలడు. రాత్రి అధికారపక్షంతో కలిసి డిన్నర్ తీసుకోగలడు.

అతను వ్యాపారం కన్నా దౌర్జన్యం చేసే ఆస్తులు కూడగట్టుకున్నాడని అతనికి పేరు.

అక్కడ మాఫియాకు చెందిన వాళ్ళు

చాలామంది ఉన్నారు.

"డియర్ జెంటిల్మెన్... ఈ రోజు అధికార పక్షం వాళ్ళు బంద్‌కు పిలుపు ఇచ్చారు. రాస్తారోకో చేస్తున్నారు. ఇదే మంచి అవకాశం. మనం ఎప్పట్నుంచో ఎదురుచూస్తోన్న అవకాశం ఇప్పుడొచ్చింది. మీ మనుష్యులను రంగంలోకి దించండి. స్లమ్ ఏరియాలో ఉన్న గుడిసెలన్నీ ధ్వంసం చేయండి. మీరున్న ఏరియాలోకి పోలీసులు రాకుండా చూసుకునే పూచీ నాది బంద్ బందోబస్తులో ఉండేవాళ్ళను నేను డైవర్ట్ చేస్తాను. ఏమంటావ్ సలీంభాయ్".

"ఏక్ క్రోర్" అడ్వాన్స్ చెప్పాడు సలీం.

"వన్ క్రోర్! మొత్తం మన మన డీల్ వన్‌క్రోర్ కదా"

"అది క్రితం సారి మనం కలుసుకున్నప్పటి మాట. ఇప్పుడా ల్యాండ్ వేల్యూ పెరిగింది. అప్పుడు నువ్వు అక్కడ హోటల్ కడతానన్నావ్. ఇప్పుడు ఎమ్యూజ్‌మెంట్ పార్కు కడతానంటున్నావ్ ఎమ్యూజ్‌మెంట్ పార్కులో రాబడి ఎలా వుంటుందో నాకు తెలుసు కతారియా సాబ్. డీల్ రెండు కోట్లు."

"సలీం భయ్యా"

"ఆలోచించుకో కతారియా సాబ్. నువ్వు కాదంటే చెప్పు నేనే ఆ స్థలాన్ని ఆక్యుపై చేసుకొని మరో పార్టీకి నాలుగు కోట్లకు అమ్ముతాను".

కతారియా ఒక్క క్షణం ఆలోచించి వెంటనే సలీం వైపు తిరిగి...

"ఠీక్ హై! ఈ రాత్రికి గుడిసెలన్నీ ధ్వంసం అయిపోవాలి... ఆ చుట్టుపక్కల వాళ్ళెవరు తిరిగి రాకూడదు."

సలీం అలానే అని తలూపలేదు... జేబులో నుంచి విస్కీ బాటిల్ తీసి, పళ్ళతో మూతను లాగి అలానే గొంతులోకి ఒంపుకున్నాడు.

అంటే ఆ డీల్ ఫైనల్ అయినట్టే.

కతారియా ఓ బ్రీఫ్‌కేసు సలీం ముందుపెట్టాడు.

"ఇందులో యాభై లక్షలున్నాయి... మిగతా యాభై లక్షలు పని పూర్తవ్వగానే యిస్తాను"

సలీం అలానే అన్నట్టు తలూపాడు.

కతారియా వెళ్ళిపోయాడు.

★ ★ ★

"దాదామియా సాబ్ నేను సలీంని మాట్లాడుతున్నాను. డీల్ రెండు కోట్లకు ఫైనల్ చేశాను. నీకు కోటి, నాకు కోటి" ఫోన్ చేసి చెప్పాడు సలీం.

దాదామియా అటువైపు నుంచి నవ్వి చెప్పాడు.

"దేఖో సలీం! నీకు కరెక్ట్ అనిపించింది చేయ్ నువ్వు దాదామియాకు ఆప్తుడివి".

"థ్యాంక్యు దాదామియా సాబ్... రాత్రి కలుద్దాం..." ఫోన్ కట్ చేశాడు సలీం. అనుచరులకు ఆదేశాలివ్వసాగాడు.

★ ★ ★

అధికార పార్టీకి చెందిన కార్యకర్తలు షాపులను బలవంతంగా మూయిస్తున్నారు. స్కూటర్ల మీద, జీపుల మీద వచ్చి నానా హంగామా చేస్తున్నారు. ఫోటోగ్రాఫర్ క్లిక్ క్లిక్ మనిపిస్తున్నాడు.

అనిమిష ఓ షాపు ముందాగింది. ఆ షాపతను మూయాలా వద్దా అన్న డైలమాలో ఉన్నాడు.

"షాపెందుకు మూస్తున్నారు? " అడిగింది అనిమిష.

ఆ షాపతను ఓసారి ఎగాదిగా చూసి షాపు "మూయాలని మాకేమైన సరదానా? మూయకపోతే షాపు బద్దలు కొడతారు" ఇదేం ప్రశ్నన్నట్టు సమాధానం చెప్పాడు.

"పోలీసులకు ఫోన్ చేయొచ్చుగా"

షాపతను అనిమిషను పిచ్చిదానిని చూసి

పూజించినా, పూజించకపోయినా భగవంతుడు ఉండనే ఉంటాడు.

– సి.జి.జంగ్




నట్టు చూసి పగలబడి నవ్వి "పోలీసులకా? వెళ్ళు వెళ్ళవమ్మా! చూస్తే చదువుకున్నదా నిలా వున్నావు. అయినా నీకీ ఆరాలన్నీ ఎందుకు?" కాస్త అనుమానంగా అడిగాడు.

'నేను డైలీ న్యూస్ రిపోర్టర్‌ని' చెప్పింది కాసింత గర్వంగా.

ఒక్కక్షణం అనిమిష వంక పరిశీలనగా చూశాడు. అతని బిహేవియర్‌లో కాస్త మార్పొచ్చింది.

"సారీ మేడమ్ ఇందాక ఏదేదో వాగాను. మాఫ్‌కీజియే" అన్నాడు షాపతను.

'ఫర్వాలేదు.. మీ షాపు బలవంతంగా ఎందుకు మూయాలి? పోలీసు ప్రొటెక్షన్ తీసుకోవచ్చుగా"

"పోలీసులు ఎన్ని షాపులకు కాపలా ఉంటారు మేడమ్. ఏ అర్ధరాత్రో షాపును లూటీచేస్తే? అయినా బంద్ చేసేది అధికార పక్షం. ఒక్కరోజు షాపు మూసేస్తే పోలా? లేనిపోని గొడవలన్నీ ఎందుకు?"

"కానీ ఎంత మందికి ఇబ్బంది కలుగుతుందో తెలుసా"

"మాకూ ఇబ్బందే మేడమ్! రోజుకు ఎంతలేదన్నా ఎంతో కొంత నష్టమే కదా అయినా ఏంచేస్తాం ఇలా దొంగచాటుగా బిజినెస్ చేస్తాం. వాళ్ళు రాగానే షాపు కట్టేస్తాం".

షాపతను చెప్పేది చకచక రాసేసుకుంటోంది అనిమిష.

ఆమెకిదంతా చికాగ్గా వుంది. ఎవరికివారు ఈ బంద్‌లు జరపడమేమిటి? ఎంతమంది ఎన్ని రకాలుగా అవస్థలు పడతారు?

"మేడమ్ మీరేమీ అనుకోకపోతే ఒక మాట. పరిస్థితులు బాగాలేవు. మీరు త్వరగా వెళ్ళిపోండి" షాపతను వినయంగా చెప్పాడు.

అనిమిష నడుస్తోంది. ఫొటోగ్రాఫర్ ఆమెను అనుసరిస్తున్నాడు.

"ఈ బంద్‌లు మీకు విసుగనిపించవా? " ఫొటోగ్రాఫర్‌ని అడిగింది.

"ఇవి దేశం మొత్తంమీద ఉంటాయి. మీ రాష్ట్రంలో బంద్‌లు ఉండవా? " ఫొటోగ్రాఫర్ అడిగాడు

"ఉంటాయి" చెప్పింది అనిమిష.

"ఇదంతా ఓ షో! ఎవరిబలం వాళ్ళు నిరూపించుకుంటారు. రేపు ప్రతిపక్షం వాళ్ళు వాళ్ళ బలం నిరూపించుకోవడానికి బంద్‌కు పిలుపు ఇస్తారు".

"అంటే మధ్యలో నలిగేది ప్రజలేనన్న మాట"

"ముఖ్యంగా మిడిల్‌క్లాస్ వాళ్లు, ఉద్యోగస్థులు, రోజూ కాయకష్టం చేసుకునేవాళ్ళు"

ఈ బంద్‌లు, సమ్మెలు, రాస్తారోకోలు జరగకుండా మనమేం చేయలేమా? "

"చేయగలం! ఈ వార్తలను అందంగా అచ్చేసి సంచలనంగా ఫొటోలేసి" చెప్పాడు.

"అంటే ఇలాంటి వార్తలను సంచలనంగా అచ్చేసి".

"ఇలాంటి వాటికి భీష్మాచార్య గారు ఒప్పుకోరు"

"అవును! ఎడిటర్ గారు ఎప్పుడూ ఆఫీసుకు రారా"?

"తక్కువగా వస్తారు. మొత్తం భీష్మాచార్య గారే చూసుకుంటారు. ఎందుకంటే ఎడిటర్‌గారు కదల్లేరు. ఆయన రెండు కాళ్ళు నరికేశారు." బరువుగా నిశ్వసించి చెప్పాడు ఫొటోగ్రాఫర్.

'వ్వాట్' అదిరిపడి అడిగింది అనిమిష.

"అవును. ఎడిటర్ గారికి భీష్మాచార్య గారి మీద గురి. ఆయన ప్రమేయం లేకుండా ఒక్క అక్షరం కూడా అచ్చుకు వెళ్ళదు. పత్రిక అమ్మకాలు పెంచుకోవడానికి సెన్సేషన్ క్రియేట్ చేయడం ఆయనకు నచ్చదు".

అనిమిష ఫొటోగ్రాఫర్ చెప్పే విషయాలు వింటోంది. ఆమెకు కొత్త కొత్త విషయాలు తెలుస్తున్నాయి.

"మీరు భీష్మాచార్య గారికి ఏమవుతారు? నాకు తెలిసి భీష్మాచార్య గారికి బంధువులు, స్నేహితులు లేరు. ఆయన భార్య పిల్లలు పోయినప్పట్నుంచీ ఒంటరిగానే ఉంటున్నారు".

"ఆయన భార్యా పిల్లలు ఎలా పోయారు? " ఆసక్తిగా అడిగింది.

"చంపేశారు" చెప్పాడు ఫొటోగ్రాఫర్.

"చంపేశారా? ఎవరు? "

"దాదామియా మనుష్యులు".

ఒక్కో అక్షరం ఆమెను సూటిగా తాకింది.

"దాదామియా మనుష్యులా? ఎలా? "

ఫొటోగ్రాఫర్ అనిమిష వంక చూసి మౌనంగా ఉండిపోయాడు.

"ఎలా చంపారు ఎందుకు చంపారు? "

"ఏమో మేడమ్ ఆ విషయాలు ఏమీ తెలియవు"

అతనికి చెప్పడానికి ఇష్టం లేదని అర్థమవుతూ వుంది. అతడి నుంచి అసలు విషయాన్ని రాబట్టడం కష్టమని అర్థమైంది.

ఆమె దృష్టి ఎదురుగా ఉన్న ట్రాఫిక్ మీద పడింది. కార్లు స్కూటర్లు నిలిచిపోయాయి. ఆఫీసు టైం కావడంవల్ల రద్దీగా వుంది. కొంతమంది రోడ్డుకు అడ్డంగా బైఠాయించారు. స్కూటరిస్టులు ఇబ్బందిపడిపోతున్నారు. ఆఫీసులకు వెళ్ళే తొందర్లో ఉన్నారు.

అనిమిష అక్కడికి వెళ్ళింది. ఓ స్కూటరిస్ట్ రోడ్డుకు అడ్డంగా బైఠాయించిన వాళ్ళతో గొడవకు దిగాడు.

"మాకవతల ఆఫీసుకు టైమైపోతుందండీ" అతను వాదిస్తున్నాడు.

అతని వాదనని వాళ్లెవరూ పట్టించుకోవడంలేదు. అనిమిష రోడ్డుకు అడ్డంగా బైఠాయించిన వాళ్ళ దగ్గరికి వెళ్ళింది.

"వాళ్ళు ఆఫీసుకు లేట్‌గా వెళ్తే నష్టం కదా"

అనిమిష వైపు కోపంగా చూసి, "అయితే మమ్మల్ని ఏం చేయమంటావ్? " అన్నాడో



కడు.

"వాళ్ళకు దారి వదలండి"

"ఏం? రాస్తారోకో చేస్తున్నాం. కనిపించ ట్లేదా? "

"రోడ్డుకు అడ్డంగా బైఠాయించి రాస్తారోకో చేస్తున్నామంటే ఎలా? ప్రజలకు ఇబ్బంది కలిగిస్తారా? "

"ఏంటీ ఊర్కుంటుంటే రెచ్చిపోతున్నావు ఏంటీ కత? " ఒకతను కోపంగా అన్నాడు.

ఆనిమిష అంతకన్నా కోపంగా అతనివైపు చూసి తర్వాత ఫొటోగ్రాఫర్‌వైపు తిరిగి సైగ చేసింది ఫొటో తీయమన్నట్టు.

వాళ్ళలో ఒకడు అది గమనించి "ఒరే ప్రెస్సురా" అని అరిచాడు.

"కెమెరా లాక్కోండిరా" అని ఇంకొకరు అరిచారు. ఫొటోగ్రాఫర్ వైపు కొందరు వెళ్ళారు. ఫొటోగ్రాఫర్ క్లిక్ క్లిక్‌మని అని పిస్తూ ఫొటోలు తీస్తూనే ఉన్నాడు.

కొందరు అగంతకులు ఫొటోగ్రాఫర్‌మీద మూకుమ్మడిగా కలబడి కెమెరా లాక్కోబో యారు. ఫొటోగ్రాఫర్ ప్రతిఘటించాడు. అయినా అంతమంది బలంముందు అతని బలం పనిచేయడంలేదు.

అనిమిష అక్కడ ఆగివున్న ట్రాఫిక్ జనం వైపు చూసింది.

"ఏం చూస్తున్నారు? మిమ్మల్ని ఆఫీసు లకు వెళ్ళనీయకుండా చేస్తున్నారు. రోడ్డుకు అడ్డంగా బైఠాయిస్తున్నారు. మీరంతా కలిసి తిరగబడితే వాళ్ళు తోకముడిచి పారిపో తారు ఎందుకలా మౌనంగా ఉంటారు"? వాళ్ళను మాటలతో రెచ్చగొట్టింది.

కొందరు ఔత్సాహికులు స్కూటర్లు దిగారు. వాళ్ళకు మరికొందరు కలిశారు.

అప్పటివరకు స్థబ్దుగా వున్న వాళ్ళలో ఏదో కదలిక. ఎవరికి వారు విడిగా ధైర్యం చేయరు. అందరూ కలిస్తే అదో ఉత్సాహం.

వాళ్ళలో చైతన్యం. వాళ్ళలో చలనం. వాళ్ళలో తెగింపు.

జనం తిరగబడ్డారు. ఆందోళనకారులు కొందరే పైగా ఒకేసారి తిరగబడ్డంతో ఖంగుతిన్నారు. జనం బలం వాళ్ళకు తెలి యనిది కాదు. కామ్‌గా ఉన్నంతవరకు మన్నుతిన్న పాములా వుంటారు. వాళ్ళలో కదలిక మొదలైందా? ఇక అదో ప్రభం జనం.

'వాళ్ళ సంగతి తరువాత తేలుద్దాం పదండ్రా" అంటూ ఒకడు పరుగందుకు న్నాడు. అతడిని చూసి మిగతావాళ్ళు పరు గుపెట్టారు.

అయిదంటే అయిదే నిమిషాలు. జనం ముందు అగంతకులు కకావికలైపోయారు.

అదిచూసి ధైర్యం తెచ్చుకున్న షాపుల వాళ్ళు మెల్లగా షాపులు తెరిచారు. రద్దీ మెల్లమెల్లగా మొదలైంది. ఈ వార్త కొద్దిసే పట్లోనే దావానలంలా సిటీ అంతటా వ్యాపించింది.

ఆ వార్త విని మొదట సంతోషించిన వ్యక్తి భీష్మాచార్య.

★ ★ ★

సరిగ్గా అదే సమయంలో

నగరంలోని ఓ స్లమ్ ఏరియా.

కోట్లు ఖరీదుచేసే స్థలం అది. అక్కడ గూండాలు సైనికుల్లా మోహరించారు. సలీం పర్యవేక్షణలో అక్కడ మారణ హోమం జరగడానికి వేదిక సిద్ధమవు తోంది.

జీపుల్లో మారణాయుధాలు రెడీగా వున్నాయి. ఆ ప్రాంతం రక్తసిక్తమవ్వడానికి ఆయత్తమవుతోంది.

అప్పుడు సమయం సరిగ్గా మిట్టమధ్యాహ్నాం.

★ ★ ★

అనిమిషకు సంతోషంగా ఉంది. చిత్ర మైన అనుభూతి ఆమెను నిలువెల్లా ఆవరిం చింది. తను తనేనా? గుంపుచూస్తే భయ పడే తను గొడవల్లో తల దూర్చడమంటే వణికిపోయే తను ఇలా మాట్లాడగలి గిందా? ఇదెలా సాధ్యం?

తండ్రి చెప్పిన మాటలు గుర్తొచ్చాయి.

అవసరం, అవకాశం, అభద్రతా భావం మనకు ఎన్నో పాఠాలు నేర్పుతాయి. ఎన్నో అనుభవాలను మనముందు ఆవిష్కరింపజేస్తాయి.

*విషాదం నీ దరికి చేరినప్పుడు వివేచనను మేల్కొలుపు.*

*ఆవేశం నీదరికి వచ్చినప్పుడు ఆలోచనను ఆశ్రయించు.*

*మరణం నీ దగ్గరికి వచ్చినప్పుడు చిర్నవ్వును ఆహ్వానించు.*

ఒక్కక్షణం ఒక కన్నీటిచుక్క ఆమె నుంచి వీడ్కోలు తీసుకుంది.

ఒక్కక్షణం గుండె బరువై, వేదన అశ్రువై శోకం మనసును కట్టి, పట్టి కుదిపేసింది.

★ ★ ★

ఎండ చురుక్కుమంటూ మొహానికి తగిలింది. ఫోటోగ్రాఫర్ ఆఫీసుకు వెళ్లిపోయాడు. ఉదయం నుంచీ ఏమీ తిన్లేదు. కైనెటిక్ నేర్చుకోవాలని పట్టుదలతో ఆ కాలనీలో పాట్లు పడింది. చేతులు గీరుకుపోయాయి. మోచేయి రక్తసిక్తమైంది. నుదురుకు గాయాలు తగిలాయి.

నేర్పేవారెవరూ లేరు. వెనక నుంచి ఆసరాగా పట్టుకునే వాళ్లూ లేరు.

పట్టుదల మాత్రమే ఆమెతో ఉంది. **ఏదైనా సాధించాలంటే పరిశ్రమించి కఠోరమైన కష్టమైన, ఆపనిని ఇష్టంగా భావించు**–తండ్రి మాటలు ఆమె చెవుల్లో గింగురుమంటున్నాయి.

★ ★ ★

కైనెటిక్ స్లమ్ ఏరియాకు వచ్చింది.

అక్కడి వాతావరణంలో ఆమెకు ఏదో అపశ్రుతి కనిపించింది. జీపులు, మోటారు బైకులపై, సినిమాల్లో గుండాల మాదిరిగా ఉన్నారు కొందరు.

దూరంగా గుడిసెల్లో జనం బిక్కుబిక్కుమంటూ ఉన్నారు. వికృతమైన ఏదో ప్రమాదాన్ని ఆమె పసిగట్టింది.

ఆమెలోని జర్నలిస్ట్ ఎలర్ట్ అయింది. కైనెటిక్‌ని ఓ పక్కన ఆపింది. అక్కడి పరిస్థితులను అంచనా వేసే ప్రయత్నం చేస్తోంది. ఆప్రాంతం నిర్మానుష్యంగా ఉంది. గుండాలు స్లమ్ ఏరియా మీద దాడి చేసినా ఆదుకునే జనం ఎవరూ లేరు.

★ ★ ★

"కూల్చేయండీ గుడిసెల్ని" సలీం కంఠం కంగుమని మోగింది. గుడిసెల్ని సమూలంగా పెకలించే వాహనాలు ముందుకు కదిలాయి. ఒక్కసారిగా స్లమ్ ఏరియాలో కలకలం.

వాళ్లు ప్రమాదాన్ని ఊహించారు. కానీ ఎదురుగా ఉన్నది సలీం అని వాళ్లకు తెలుసు. భయం. ప్రాణభయం. అభద్రత. ఇక్కడినుంచి వెళ్లిపోతే ఉండడానికి ఏమీ ఉండదు. అందరూ గోల గోలగా సలీం దగ్గరికి వెళ్లారు.

"రేయ్ ఎవ్వడైనా ఒక్క మాట మాట్లాడినా ఖతం చేస్తాను. మర్యాదగా వెళ్లిపోండి. పది అంకెలు లెక్కబెట్టేలోగా వెళ్లిపోండి. లేదంటే ఈ సలీం సంగతి మీకు బాగా తెలుసు. సోడా కలుపుకోకుండా పచ్చి నెత్తురు తాగుతాడు సంఝే!" హుంకరించాడు సలీం.

జనం హహకారాలు మొదలు పెట్టారు. గుడిసెల్ని గుండాలు నేలమట్టం చేస్తున్నారు. జనం హహాకారాలు చేస్తూనే ఉన్నారు. సలీం చేతిలో కాగడా గాలిలోకి లేచింది. అడ్డు వచ్చిన ప్రతి వాడిని కొరడా ముద్దాడుతూనే ఉంది. అక్కడ దౌర్జన్యం వికటాట్టహాసం చేస్తోంది రౌడీయిజం కాలరెగరేస్తోంది.

★ ★ ★

ఒక్క క్షణం అనిమిషకు ఏం చేయాలో అర్థం కాలేదు. తను ఎదిరించలేదు. స్లమ్ ఏరియా ప్రజలను ఎంత రెచ్చగొట్టినా వాళ్లు తిరగబడలేరు. శత్రువు చేతిలో మారణా



## సగం మంది ఫూల్స్ కారు

ఓసారి చర్చిల్ ఇంగ్లండ్ పార్లమెంట్‌లో ఆవేశంగా ప్రసంగిస్తూ 'నిజం చెప్పాలంటే.. ఈ సభలో సగంమంది ఫూల్సే' అన్నాడు. ఇంకేముంది? సభదద్దరిల్లింది. చర్చిల్ తనమాటలు ఉపసంహరించుకోవాలని, సభకు క్షమాపణ చెప్పాలని పట్టుపట్టారు సభ్యులు.

అలాగేనంటూ లేచిన చర్చిల్ 'ఐ యామ్ వెరీ సారీ. నిజంగా ఈ సభలో సగం మంది ఫూల్స్ కారు' అన్నాడు.

మళ్లీ గొడవ..

'మొదట అన్నమాటను వెనక్కు తీసుకున్నాను. పైగా సారీ చెప్పాను. ఇంకెందుకు గొడవ చేస్తున్నారని' అన్నాడాయన అమాయకత్వం నటిస్తూ.

ఆయన గడుసుదనానికి సభ్యులకు ఏం మాట్లాడాలో తోచలేదు.

యుధాలు ఉన్నాయి.

ఈ విషయాన్ని భీష్మాచార్యకు చెప్పాలి. ఆ ఆలోచన రావడమే తరువాయి. ఆమె కైనెటిక్ హోండా డైలీన్యూస్‌తో పత్రికాఫీసు వైపు బయలుదేరింది.

★ ★ ★

భీష్మాచార్య అనిమిష చెప్పిందంతా విన్నాడు ఓపిగ్గా. ఆమె చెప్పడం పూర్తయ్యాక, జిన్‌టిన్ తీసి జిన్‌ని కొద్దిగా నోట్లోకి ఒంపుకున్నాడు. అనిమిష ఆశ్చర్యంగా అతని చేతిలో ఉన్న జిన్‌టిన్‌ను చూసింది.

జిన్‌టిన్‌ను చూపిస్తూ "ఇదీ నువ్వు ఉదయమే విస్కీ, బ్రాందీ, జిన్ అన్నీ చెట్లకు ఎరువుగా ఉపయోగపడతాయని చెట్లలో ఒంపినట్టు ఉన్నావు. నేనే ఒకటి తెప్పించాను" చెప్పాడు.

అనిమిష ఏం మాట్లాడలేదు.

"వెళ్లు. వెళ్లి క్యాంటిన్‌లో ఏదో ఒకటి తినేసిరా! ఇదిగో కూపన్" అంటూ టేబుల్ మీద ఉన్న ఓ కూపన్ పుస్తకం ఇచ్చాడు.

"అవసరమైనప్పుడు ఈ కూపన్లు వాడుకో".

మౌనంగా ఆ బుక్ తీసుకొని క్యాంటీన్ వైపు నడిచింది.

★ ★ ★

క్యాంటీన్‌కు వెళ్లి మీల్స్ అర్డర్ చేసింది. సెల్ఫ్ సర్వీస్ అని తెలిశాక తనే వెళ్లి కూపన్ ఇచ్చి మీల్స్ ప్లేట్ తెచ్చుకుంది.

ఓ పత్రికకు ఇన్‌చార్జీ. హాయిగా ఏదైనా హోటల్ నుంచి తెప్పించొచ్చుగా! తను హాయిగా ఏ ఫైవ్‌స్టార్ హోటల్ నుంచో తెప్పించుకుంటాడు. ఎంతైనా ఇన్‌ఛార్జీ కదా అతనికేదైనా పట్టుకెళ్ళాలన్న ఆలోచన కూడా విరమించుకుంది. ఆ పెద్దమనిషి గురించి తనెందుకు ఆలోచించాలి? **ఆవేశం ఆలోచనకు తొలి శత్రువు.**

★ ★ ★

అన్నంలో పెరుగు కలుపుకొని తింటుంటే ఒక్కసారిగా క్యాంటీన్‌లో కలకలం. అందరూ లేచి నిలబడుతున్నారు. ఒక్క క్షణం అనిమిషకు ఏమీ అర్థం కాలేదు. ఆమె తలెత్తి చూసింది. ఎదురుగా భీష్మాచార్య.

అందరూ వినయంగా లేచి నిలబడుతున్నారు. అనిమిష అప్రయత్నంగా తనూ లేచింది. క్యాంటీన్‌లో ఉన్నవాళ్ళు కూడ వినయంగా అతని దగ్గరికి వచ్చి నిలబడ్డారు.

భీష్మాచార్య అదేమీ పట్టించుకోలేదు. జేబులో నుంచి ఓ కూపన్ తీసిచ్చి మీల్స్

చెప్పాడు. క్యాంటీన్ అబ్బాయి టేబుల్ దగ్గరికి తీసుకువస్తానన్నా వినకుండా తనే ప్లేటు తెచ్చుకున్నాడు. బెంచీ మీద కూచొని, టేబుల్ మీద పళ్ళెం పెట్టుకున్నాడు.

అందర్లానే తనూ ట్యాప్ దగ్గరికి వెళ్ళి మంచి నీళ్ళు తెచ్చుకొన్నాడు. ఒక్కక్షణం అనిమిష ఒళ్ళు జలదరించింది. పొలమారింది. భీష్మాచార్య ఆమె తలమీది తట్టి తన దగ్గర వున్న మంచినీళ్ళ గ్లాసు అందించాడు.

★ ★ ★

భీష్మాచార్య అన్నం తిని సింక్ దగ్గర చేతులు కడుక్కొని తుండుకు చేతులు తుడుచుకొని వెళ్లిపోయాడు. అనిమిష వెళ్ళబోతుంటే క్యాంటీన్‌లో వున్న ఓ ముసలావిడ అనిమిష దగ్గరికి వచ్చింది.

"మీకేమైనా కావాలంటే కుఱ్ఱాడితో చెప్పి పంపించండి. మీరు భీష్మాచార్యగారి అన్న కూతురట కదా! ఆ అమ్మాయి నా కూతురిలాంటిది కాస్త జాగ్రత్తగా చూసుకోండని చెప్పారు" అంది.

ఆ ముసలావిడ అలా చెబుతుంటే, తన మొహమ్మీద మంచితనమనే కఱ్ఱతో కొట్టినట్టు అనిపించింది.

ఒక్కక్షణంలో తనెంత ఘోరంగా ఆలోచించింది. తన ఆవేశం తొందరపాటు ఓ మంచిమనిషిని చెడ్డమనిషిగా చిత్రీకరించింది. తనమీద తనకే సిగ్గుగా వుంది. కోపంగా వుంది.

ఒక్కక్షణం ఒకే ఒక్కక్షణం తనలోని ఆలోచనా రాహిత్యం ఎంత పనిచేసింది.

ఆమె మొహం ఎఱ్ఱబడింది పశ్చాత్తాపంతో.

★ ★ ★

అనిమిష భీష్మాచార్య టేబుల్ దగ్గరికి వెళ్ళింది. భీష్మాచార్య అనిమిష రాకను గమనించి ఏమిటన్నట్టు తల పైకెత్తాడు.

"స్లమ్ ఏరియాలో సలీం చేసిన దౌర్జన్యం గురించి న్యూస్‌స్టోరీ రాయమంటారాని"

నవ్వాడు భీష్మాచార్య. ఆ నవ్వులో ఎన్నో అర్థాలు "ఏం రాస్తావు? సినిమాల్లో హీరోయిన్ విలన్ మీద గంతులేసి పెన్నుతో న్యూస్ రాసేసినట్టు రాసేస్తారా? "

అనిమిష ఉక్రోషంతో ఉడికిపోయింది. భీష్మాచార్య కొనసాగించాడు.

"సలీం గురించి నీకేం తెలుసు? ఒక విషయం తెలియగానే గబగబ వార్త రాసేయడమేనా? అసలు స్థలం ఎవరిదో నీకు తెలుసా? సలీం ఎవరో అతని వెనక ఉన్న బలం, బలగం ఏమిటో నీకు తెలుసా? సలీం ఎవర్ని బెదిరించాడు. ఎందుకు బెదిరించాడో నీకేం తెలుసని? "

అనిమిష ఏదో చెప్పబోయింది.

**"చూడు అనిమిషా! న్యూస్ రాయడమంటే ఏదో ఓ కథను నీ ఇష్టం వచ్చినట్టు అల్లేయడం కాదు. ఒక సంఘటన చూసినప్పుడు దాని గురించిన నేపథ్యం తెలుసుకోవాలి. కూలంకషంగా ఆ సంఘటన గురించి వివరించాలి. ఒక వార్త రాసేక దాని పరిణామాలు ఎలా ఉంటాయో బేరీజు వేసుకోవాలి అవన్నీ చేయకుండా, ఏదో ఓ సంఘటన నీ కళ్ళబడిందని రాసేయడమేనా?**

"సలీం స్లమ్ ఏరియా వాళ్ళను బలవంతంగా ఖాళీ చేయించేస్తున్నాడు"

"ఆ వార్త మన రిపోర్టర్లు చూసుకుంటారు. **చూసింది చూసినట్టుగా వార్త రాయటం వేరు. ఇతరుల స్టేట్‌మెంట్ల ఆధారంగా వార్త రాయడం వేరు. మనమే పరిశీలించి పరిశోధించి రాయడం వేరు. అంతేకాని పెన్నుందని ఉత్సాహపడిపోవద్దు"**

ఆ చివరి మాటే అనిమిష ఒంటి మీద కారం చల్లినట్టు అనిపించింది. ఆమె కోపం పెరిగింది. "ఆ సలీం గురించి పూర్తిగా ఎంక్వయిరీ చేస్తాను" అంది దృఢంగా.

మనలో ఉత్సాహం కొరవడితే పరులపట్ల మనం ఉదాసీనులుగా ఉంటాము.
**– హాజ్‌విట్**

నవ్వాడు మళ్ళీ భీష్మాచార్య

"సలీం అంటే మన ఇంటి ఎదురుగా ఉండే వ్యక్తీ, మనకు ఎప్పుడు కలిసే వ్యక్తీ కాదు. అతడిని కలుసుకోవడం ఎంత కష్టమో నీకు తెలియదు. ఇలాంటివన్నీ నీకు చేత కాదు. లేడీస్ పేజీ ఒకటిస్తాను. అది చూసుకో"

అనిమిష కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి.

అంటే ఇక డైరెక్టుగా తనకు జర్నలిజం గురించి తెలియదనా? నువ్వు చేయలేవనీ చెప్పడమా.

"నేను సలీంను కలుస్తాను. అతడి గురించి వివరాలు సంపాదిస్తాను. న్యూస్‌స్టోరీ తయారు చేస్తాను." ధృడంగా అంది అనిమిష.

ఒక్క క్షణం తల పంకించి 'సరే. నీఇష్టం బట్ టేక్ కేర్."

అనిమిష బయటకు నడిచింది.

★ ★ ★

అనిమిష తీవ్రంగా ఆలోచిస్తోంది. ఆమె మెదడు వేడెక్కిపోతోంది. తన లక్ష్యం ఏమిటి? తన గమ్యం ఏమిటి? తను ఎటు వెళ్తోంది? భీష్మాచార్య గారు చెప్పినట్టు తను జర్నలిజానికి పనికి రాదా?

అర్థంకాని ప్రశ్నలు. అర్థం లేని ఆలోచనలు. తన ఆలోచనలు ఒకకొలిక్కి రావడం లేదు.

భీష్మాచార్య గదిలో లైటు ఇంకా వెలుగుతూనే ఉంది.

అతని గదివైపు వెళ్ళి చూసింది. ఈజీ చైర్‌లో కూచొని వున్నాడు. అతని చేతిలో జిన్‌టిన్ ఉంది.

అతని చూపులు గోడమీద ఉన్న గ్రూప్ ఫోటోమీద ఉన్నాయి. అతడిని పలకరించే సాహసం చేయలేకపోయింది. అతనికి సంబంధించిన గతం తెలుసుకోవడం తనకు సంబంధించిన విషయం కాదు.

అయినా అతని గురించి తెలుసుకోవాలన్న ఆలోచన ఆమె మెదడును తొలచివేస్తోంది.

ఒకరి విషాదాన్ని తెలుసుకునే ప్రయత్నంలో తన విషాదాన్ని కప్పి పుచ్చుకుంటోంది. ఒక విషాదాన్ని తవ్వి తీసే ప్రయత్నంలో తనలోని విషాదాన్ని పాతిపెడుతోంది.



ఒక్క క్షణం లోపలికి వెళ్ళి అతని గతం ఏమిటో తెలుసుకోవాలన్న బలమైన కోరిక కలిగింది. అంతలోనే అది సంస్కారం కాదని ఆగింది. ఏ చనువుతో తను వెళ్ళి అతని గతం గురించి తెలుసుకుంటుంది?

★ ★ ★

అనిమిష మేడమీద పచార్లు చేస్తోంది. ఆకాశంలో చంద్రుడు తన వెలుగును అందరికీ సమానంగా పంచుతున్నట్టుంది. ప్రపంచమంతటికీ ఒకేసారి వెలుగు పంచుతాడా? ఇప్పుడిక్కడ వెన్నెల కురిపిస్తే మరోచోట తప్పుకుంటాడు. మన భ్రమ కాకపోతే భూభ్రమణమే కదా సృష్టి వైచిత్రి.

ఆమెకు తండ్రి గుర్తుకొచ్చాడు. తల్లి గుర్తుకొచ్చింది. తమ్ముడు గుర్తొచ్చాడు.

గుండెలమీద చిన్నపాదాలతో నడిపించాడు తండ్రి. చిటికెనవేలు పట్టుకొని తనతో బుల్లి బుల్లి అడుగులేసి నడిచాడు తమ్ముడు. "తల్లీ! ఏవీ నిరుడు కురిసిన ఆ

హిమసమూహాలు?" ఒక కన్నీటి చుక్క ఆమె అంతర్మథనాన్ని ఆవిష్కరిస్తుంటే, మరో కన్నీటి చుక్క ఆమె గతాన్ని స్పృశిస్తోంది.

బృందావనం లాంటి అందమైన కాలనీలో, ఎంతందంగా గడిచిపోయాయి ఆ రోజులు.

★ ★ ★

మధురానగర్ కాలనీ

ప్రశాంతమైన వాతావరణంలో వుందా కాలనీ. ఇంకా వాహన కాలుష్యం, వాతావరణ కాలుష్యం ఆ కాలనీ దరిదాపుల్లోకి రాలేదు.

ఆ కాలనీలో చాలా వరకూ ప్రభుత్వోద్యోగులే. సాయంత్రం అయ్యిందంటే పిల్లలంతా చేరి క్రికెట్ ఆడుకుంటారు. కాలనీ మధ్యలో పార్కు ఉంది. సూర్యోదయ దృశ్యం ఆ కాలనీ నుంచి అందంగా కనిపిస్తోంది.

ఆ కాలనీలో రెండవ సందు చివర ఉండేది శర్మగారిల్లు. బ్యాంకులో క్యాషియర్‌గా పనిచేసే శర్మ గారంటే ఆ కాలనీలో చాలా మందికి గౌరవం. వృత్తి నిర్వహణలో చాలా స్ట్రిక్టు. నిజాయితీపరుడు.

ఒకరోజు ఓ కస్టమర్ పొరపాటున వంద రూపాయల బండిల్ మరిచిపోయాడు. చెక్ ద్వారా అతని అడ్రస్ కనుక్కొని స్వంత డబ్బులతో అతనింటికి ఆటోలో వెళ్లి అతనికి వంద రూపాయల బండిల్ ఇచ్చి వచ్చాడు.

శర్మగారికి ఇద్దరు పిల్లలు. అనిమిష పెద్దమ్మాయి. డిగ్రీ పూర్తిచేసి ఓ డిపార్ట్‌మెంటల్ స్టోర్స్‌లో సేల్స్ ఎగ్జిక్యూటివ్‌గా పనిచేస్తోంది. అబ్బాయి సెవెన్త్ స్టాండర్డ్. చిన్న కుటుంబం చింత లేని కుటుంబం అనడానికి వాళ్ల ఫ్యామిలీయే ఒక ఉదాహరణ. శర్మ భార్యకు ఇల్లే ప్రపంచం. భర్త ఆఫీసుకు వెళ్లగానే ఇంటి పని, మార్కెట్‌కు వెళ్లి కూరగాయలు తీసుకురావడం, ఇల్లు శుభ్రపర్చడం ఆమెకు ఇష్టమైన వ్యాపకాలు.

"అనూ బయల్దేరదామా?" తండ్రి కేక విని, ఓసారి అద్దంలో తనను తను చూసుకొని హాలులోకి నడిచింది.

'వస్తున్నాను నాన్నగారూ! మీదే ఆలస్యం' అంది. శర్మగారు బ్యాంకుకు వెళ్లేదారిలోనే డిపార్ట్‌మెంటల్ స్టోర్ ఉంది. అక్కడ కూతుర్ని డ్రాప్ చేసి బ్యాంకుకు వెళ్తాడు. వచ్చేటప్పుడు బస్సులోనో ఆటోలోనో ఇంటికి వస్తుంది.

"నువ్వు టూ వీలర్ డ్రైవింగ్ నేర్చుకోరా ఎంతో సౌఖ్యంగా వుంటుంది. స్టోర్స్‌కు వెహికిల్ మీదే వెళ్లి రావచ్చు" కూతురివంక ఆప్యాయంగా చూస్తూ చెప్పాడు.

"అమ్మో! నాకు డ్రైవింగ్ అంటే భయం నాన్నగారూ" అంది అనిమిష.

"భయం అంటే భయమే వేస్తుంది అయినా చూడు రోజూ ఎంత మంది అమ్మాయిలు బైక్‌ల మీద వెళ్లడంలేదు? కార్లు నడిపిస్తున్నారు విమానాలు కూడా నడిపిస్తున్నారు. కల్పనాచావ్లా అంతరిక్షంలోకే వెళ్లొచ్చింది".

"కానీ బ్యాడ్‌లక్ చనిపోయింది కదా నాన్నా"

"మరణం ఎవరికైనా అనివార్యం. వృత్తి నిర్వహణలో ఓ గొప్ప అఛీవ్‌మెంట్‌తో చనిపోవడం యుద్ధంలో మరణించడంకన్నా గొప్ప విషయం."

"మీరు చెప్పేది ఒప్పుకుంటాను. నాన్నగారూ! డ్రైవింగ్ మాత్రం నేర్చుకోమని చెప్పొద్దు ప్లీజ్"

'అలాగేరా కానీ ఒకటి గుర్తుంచుకోరా డ్రైవింగ్ ఎప్పటికైనా పనికొస్తుంది."

"సరే! సరే! వెళ్దామా నాన్నగారూ" అడిగింది అనిమిష.

కూతుర్ని ఎక్కించుకొని బయల్దేరాడు శర్మ.

★ ★ ★

డిపార్ట్‌మెంటల్ స్టోర్స్ దగ్గర దిగి తండ్రికి టాటా చెప్పింది. తండ్రి వెహికిల్ కనుమరుగయ్యేవరకూ చేతులు ఊపుతూనే ఉంది.

"ఏయ్ అనిమిషా! ఏంటీ మరీ చిన్నపి

ల్లలా అలా టాటా చెబుతావు' అడిగింది కొలీగ్.

"నేనెప్పుడు మా నాన్న ముందు చిన్నపిల్లనే" అంది స్టోర్స్‌లోకి నడుస్తూ.

అనిమిష సరుకుల లిస్ట్ చూస్తోంది. సాధారణంగా ఆ టైంలో ఎక్కువ రష్ వుండదు. సేల్స్‌గర్ల్స్‌తో కూడా బాగా కలసిపోతుంది అనిమిష.

'మేడమ్ మీరు చాలా స్మార్ట్‌గా వుంటారు' అంది సేల్స్‌గర్ల్ బిస్కట్ ప్యాకెట్స్ ర్యాక్‌లో సర్దుతూ.

"ఏంటీ ఏమైనా మనీ అడ్జస్ట్‌మెంట్? అడిగింది అనిమిష.

"ఛ ఛ. నేను సిన్సియర్‌గా చెబుతున్నాను మేడమ్! మిమ్మల్ని పెళ్ళి చేసుకునేవాడు మీ అందాన్ని తింటూనే బ్రతకొచ్చు. ఆకలుండదు. దాహముండదు అంటూ పాట పాడుకుంటూ అంటుకుపోతాడు."

అనిమిష మొహం ఎర్రబడింది. సేల్స్ గర్ల్ బిస్కట్స్ ప్యాకెట్స్ సర్దడం పూర్తయ్యాక, పికిల్ ప్యాకెట్స్ సర్దే పనిలో ఉంది. అక్కడ దొరకని వస్తువంటూ లేదు. పని హాయిగా వుంటుంది.

సరిగ్గా అప్పుడే ముప్పయ్యేళ్ల వ్యక్తి వచ్చాడు. అతన్తోపాటు మరో ఇద్దరు యువకులు ఉన్నారు. వాళ్ల వాలకం చూస్తోంటే కొనడానికి వచ్చిన వాళ్లలా లేరు.

మొదట స్టోర్స్‌లోకి అడుగుపెట్టిన వ్యక్తి సేల్స్ గర్ల్ దగ్గరకు వచ్చి "ఫ్రీ నా' అని అడిగాడు.

ఆ సేల్స్ గర్ల్‌కు ముందు ఏమీ అర్థం కాలేదు. అర్థమయ్యేక ఆమె మొహం కోపంతో ఎర్రబడింది. అయినా అప్పుడప్పుడు ఇలాంటివి ఆమెకు అలవాటే. కస్టమర్లతో సాధ్యమైనంత వరకూ గొడవ పెట్టుకోదు.

"సార్ మీకేం కావాలి? " అడిగింది సాధ్యమైనంత పొలయిట్‌గా.



"ఫ్రీగా వచ్చేవి" చెప్పాడు అతడు వెకిలిగా నవ్వుతూ.

"ఫ్రీగా వచ్చేవి అయితే మాక్కూడా కావాలి" అతని కూడా వచ్చిన వాళ్ళు అన్నారు.

దూరం నుంచి ఇది గమనిస్తోన్న అనిమిష అక్కడికి వచ్చి "ఏం కావాలి సార్? " అని అడిగింది.

"అబ్బ మళ్లీ చెప్పాలట్రా బాబూ" అంటూ అనిమిష వైపోసారి చూసి "ఫ్రీ ఫ్రీగా కావాలి" అన్నాడు.

"ఏంటీ! " కాస్త సీరియస్‌గా అడిగింది అనిమిష.

వెంటనే అతను "ఒకటి కొంటే ఒకటి ఫ్రీ అంటారు ఆ ఆఫర్ లేదా" అని అడిగాడు.

"పక్క సెక్షన్‌లోకి వెళ్ళండి. ఆఫర్ లిస్ట్ అక్కడ ఉంటుంది"

"మరి నీ దగ్గరేం వుంటుంది పాపా కేర్ ఫ్రీ వుంటుందా' అడిగాడు మరింత వెకిలిగా.

ఒక్కసారిగా అనిమిష కళ్ళలో నీళ్లు గిర్రున తిరిగాయి. ఇందాకటి సేల్స్‌గర్ల్‌కు కోపం నషాళానికి అంటింది.

'రేయ ఏంట్రా వాగుతున్నావు చెప్పు తియ్యమంటావా? " అంటూ కోపంగా అంది.

ఈ అరుపుకు మిగతా సేల్స్ గర్ల్స్ పరుగెత్తుకు వచ్చారు. అందరికీ విషయం తెలిసింది.

"పోలీస్ కంప్లయింట్ ఇస్తే సరి బుద్ధొస్తుంది" కొందరు అరిచారు.

"వద్దొద్దు" అంది అనిమిష.

"అదేంటి మేడమ్! ఇలాంటి వాళ్లను విడిచిపెడితే అలుసైపోతాం" అంది ఓ సేల్స్ గర్ల్.

"పోలీస్ కంప్లయింట్ ఇవ్వాల్సిందే" పట్టుబట్టారు కొందరు.

"ప్లీజ్ నా మాట వినండి" అని వాళ్ల వైపు తిరిగి "చూడండి. మర్యాదగా వెళ్లిపోండి. మా జనానికి తెలిస్తే గొడవై పోలీస్‌స్టేషన్‌కు వెళ్తే మీకే నష్టం వెంటనే వెళ్ళిపోండి అంది.

ఆ ముగ్గురు పరిస్థితి అంచనా వేసి అక్కడినుంచి మెల్లగా జారుకున్నారు.

★ ★ ★

"ఆ పోకీరీలను అనవసరంగా వదిలేశారు. పోలీసులకు పట్టిస్తే బుద్ధొచ్చేది" అన్నారు లంచ్ టైంలో సేల్స్ గర్ల్స్.

"అనవసరంగా ఆ రౌడీ వెధవలతో గొడవెందుకు? వాళ్ల పాపాన వాళ్లే పోతారు."

"అదేంటి మేడమ్ మాకన్నా ఎక్కువ చదువుకున్నారు. అన్నీ తెలిసిన మీరే ఇలా మాట్లాడితే ఎలా ? " సేల్స్ గర్ల్స్ అన్నారు.

"ఎంత చదువుకున్నా రౌడీయిజాన్ని మన చదువుతో ఎదుర్కొంటామా? మనం బాగా చదువుకున్నామని వాళ్లు భయపడతారా? "

"ఏమో మేడమ్ మీరు చేసిన పని మాత్రం ఏం బాగోలేదు" చెప్పేశారు వాళ్లు.

"వదిలేయండి మీమీ పనుల్లోకి వెళ్లండి. ఈ విషయాన్ని ఇంతటితో మరిచిపోండి" చెప్పింది అనిమిష.

వాళ్ళకు అనిమిష ఎప్పుడూ అర్థం కాదు. ఎప్పుడూ మిస్టరీనే. గొడవలంటే ఆమడ దూరం పారిపోతుంది. రోడ్డు మీద గొడవ పడ్డా అనిమిష భయపడిపోతుంది. ఎక్కడో కొట్టుకుంటున్నారంటే ఇక్కడే వణికిపోతుంది. చాలా సెన్సిటివ్.

తెలివి అందం ఇచ్చిన ఆ దేవుడు అనిమిషకు కాస్త ధైర్యాన్ని కూడా ఇస్తే బావుండని వాళ్లు తరచు ఫీలవుతూ వుంటారు.

అనిమిష జీవితంలో పెద్ద మార్పు వస్తుందని ఆ క్షణంలో వాళ్ళకు తెలియదు.

★ ★ ★

చెక్కులు వెరిఫై చేసి డబ్బు చెక్ చేసి టోకన్లు తీసుకుంటూ శర్మ బిజీగా వున్నాడు. అతను పనిలో పడితే రాక్షసుడే క్షణం కూడా రెస్ట్ తీసుకోడు. అందరూ అతడిని సిన్సియర్ శర్మగారని అంటారు. సమయం రెండు కావస్తోంది. బ్యాంకు రద్దీ కొద్దిగా తగ్గింది. ఒక్క క్షణం టేబుల్ మీద వున్న గ్లాసు తీసుకొని నీళ్ళు తాగేశాడు. అతనికి ప్రాణం కుదుటపడ్డట్టు అనిపించింది.

సరిగ్గా అదేసమయంలో నలుగురు అగంతకులు బ్యాంకులోకి ప్రవేశించారు. శర్మ డబ్బును సర్దుతున్నాడు. ఆ నలుగురు అగంతకులు లోపలికి వచ్చి ఒకరికొకరు సైగలు చేసుకున్నారు. ఒకడు ఎంట్రన్స్ దగ్గర నిలబడ్డాడు. జనం పలుచగా ఉన్నారు.

రెండో వ్యక్తి ఓ మూలకు వెళ్ళాడు. మూడవ వ్యక్తి స్టాచ్యూలా నిలబడి వున్నాడు. నాలుగో వ్యక్తి శర్మ దగ్గరకి వచ్చాడు.

కౌంటర్ నుంచి శర్మ వైపు చూసి ఏదో మాట్లాడాడు. శర్మకు అతను మాట్లాడింది అర్థం కాలేదు. తన సీటులోనుంచి కొద్దిగా లేచి "యస్ చెప్పండి విత్‌డ్రానా? " అని అడిగాడు. ఆ వ్యక్తి చాలా వేగంగా కదిలాడు. జేబులోనుంచి రివాల్వర్ తీశాడు. చేతిని కౌంటర్‌లోకి పెట్టి శర్మ తలకు రివాల్వర్ మొనని ఆన్చి "హ్యాండ్సప్ కదిలితే చస్తావు" అని అరిచాడు. అప్పటికే పక్క కౌంటర్‌లో వున్న వ్యక్తికి అనుమానం వచ్చింది.

క్షణాల్లో అంతా ఎలర్ట్ అయ్యారు. కానీ అప్పటికే ఆలస్యమైంది. నలుగురు అగంతకులు రివాల్వర్స్ బయటకు తీశారు. "ఎవరు అరిచినా ఎమర్జన్సీ అలారం మోగించాలని ప్రయత్నించినా చస్తారు". అంటూ వార్నింగ్ యిచ్చారు.

ఓ అగంతుకుడు మేనేజర్ క్యాబిన్‌లోకి వెళ్ళి మేనేజర్‌ని బయటకు ఈడ్చుకు వచ్చాడు.

'కమాన్ హర్రీయప్. క్యాష్ కౌంటర్స్‌లో వున్న డబ్బు బయటకు తీయండి" అంటూ తొందరపెట్టారు.

'సేఫ్టీలో వున్న డబ్బు కూడ బయటకు తీయండి' మరో అగంతకుడు వార్నింగిచ్చాడు.

"సేఫ్ లాకర్స్‌లో డబ్బు ఆలస్యమవుతుంది. ముందు క్యాష్ కౌంటర్స్‌లో వున్న డబ్బు తీయనా" ఇంకో అగంతకుడు

అడిగాడు.

శర్మ ఆలోచిస్తున్నాడు. అతని రక్తం మరుగుతోంది.

"హలో చూడండి. ఇది ప్రజల డబ్బు. మర్యాదగా వెళ్ళిపొండి. ఏ గొడవ వుండదు" చెప్పాడు శర్మ.

ఆ అగంతకులు శర్మ వైపు విచిత్రంగా చూశారు. 'క్యాబే! ఇదేమైనా సినిమా అనుకుంటున్నారా నీతి డైలాగులు చెబుతున్నావు. ఎక్కువగా మాట్లాడితే మార్డాలుంగా సంర్ఘే" అంటూ రివాల్వర్‌తో బెదిరించాడు.

"మహా అయితే ఎంత మందిని చంపుతావు? మేమంతా తిరగబడితే మీరు చచ్చూర్కుంటారు. మర్యాదగా వెళ్తారా? పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చేయమంటారా? శర్మ ఫోన్ వైపు కదలబోతూ అన్నాడు.

ఓ అగంతకుడు కోపంగా రివాల్వర్‌ని వెనక్కి తిప్పి శర్మ తలమీద మోదాడు. రక్తం చిమ్మింది.

మేనేజర్ వైపు తిరిగిన ఓ అగంతుకుడు "ఒరె వాడికి చెప్పు ఎక్స్‌ట్రా వేషాలేస్తే ప్రాణాలు పోతాయి" అన్నాడు.

మేనేజర్‌కు బి.పి మొదలైంది. శర్మ వైపు తిరిగి 'శర్మగారూ! గొడవెందుకు ఆ డబ్బేదో వాళ్ళ మొహాన కొట్టండి" అన్నాడు.

"అదేంటిసార్ అలా అంటారు. అదేమైనా వాళ్ళ ప్రాపర్టీనా" అన్నాడు.

"ఒరే వాడు మాటలతో వినేట్టు లేదు వేసేయంగ్ర" అని ఒకడు అరిచి రివాల్వర్‌ని శర్మవైపు గురిపెట్టాడు.

వెంటనే మేనేజర్ జోక్యం చేసుకొని "మీక్కావాల్సింది డబ్బే కదా నేనిప్పిస్తాను" అంటూ శర్మ పక్కనే వున్న మరో క్యాషియర్‌తో చెప్పాడు. "వాళ్ళకు కావలసిన డబ్బు మీరైనా యిచ్చేయండి"

ఆ మరో క్యాషియర్ కౌంటర్‌లో వున్న డబ్బు అంతా ఓ క్యారీ బ్యాగులో సర్ది ఆ అగంతకులకు యివ్వబోయాడు. సరిగ్గా అప్పుడే శర్మ వేగంగా ముందుకు పరుగెత్తుకు వెళ్ళి అలారం బటన్ ప్రెస్ చేశాడు.

అలారం బయ్‌బయ్‌మంటూ మోగడం మొదలెట్టింది. అక్కడితో ఆగకుండా బ్యాంకులో ఓ మూలవున్న లావుపాటి కర్ర ఒకటి తీసుకొని అగంతుకుల మీద దాడి మొదలెట్టాడు.

ఆ అగంతుకులు ఈ పరిణామాన్ని ఊహించలేదు. బయట కలకలం రోడ్డు మీద వెళ్ళే వాహనాలు ఒక్కసారిగా ఆగిపోయాయి. కొందరు ఆసక్తిగా, మరికొందరు భయంగా బ్యాంకు లోపలకి తొంగి చూస్తున్నారు. సెంట్రీ పోలీసులకు ఫోన్ చేశాడు. కొందరు యువకులు ధైర్యంచేసి లోపలకి పరుగెత్తారు. క్షణాల్లో అక్కడి వాతావరణం మారిపోయింది.

ఏమాత్రం ఊహించని సంఘటన అది. ఆ అగంతకులు భయంతో బిక్కచచ్చిపోయారు. శర్మ రెచ్చిపోతూ తన చేతిలోని కర్రకు పనిచెబుతూనే వున్నాడు. అది చూసి బ్యాంకు సిబ్బందికి ధైర్యం వచ్చింది.

**ఏదైనా ఓ సంఘటన జరిగినప్పుడు, ఎవరికివారే మనకెందుకులే అని స్థబ్దుగా వుండిపోతారు. నిర్లిప్తతకన్నా భయం ఎక్కువ. పిల్లిమెడలో ఎవరూ గంట కట్టరు. అపాయం అనే పులినోట్లో ఎవ్వరు తలపెట్టరు. ఎవరైనా ఆ పనిచేస్తే అప్పుడు కదలిక మొదలవుతుంది.**

సరిగ్గా అప్పుడు జరిగింది అదే.

★ ★ ★

పోలీసులు వచ్చారు. ఒక్కడు తప్ప మిగతా వాళ్ళంతా దొరికిపోయారు. అందరూ శర్మను అభినందించడం మొదలుపెట్టారు. అప్పటివరకూ అసహనంగా వుండి శర్మ మీద చికాకును ప్రదర్శించిన మేనేజర్ కూడా ప్రసన్నవదనంతో శర్మవైపు తిరిగి అభినందనల పరంపర కొనసాగించాడు.

"థాంక్యూ శర్మగారు! మీరే కనుక ఈ

సాహసం చేసి వుండకపోతే బ్యాంకు కొన్ని లక్షల రూపాయలను నష్టపోయేది. సిబ్బంది ప్రాణాలను కూడా రక్షించారు." అంటూ శర్మను స్తుతించడం మొదలుపెట్టాడు.

శర్మకు నవ్వొచ్చింది. దొంగలను నియంత్రించే ప్రయత్నంలో ఏమైనా జరిగి వుంటే ఇదంతా మీవల్లే జరిగింది. అని తనను నిందించేవారు.

ఆ రోజు సాయంత్రం వరకు ఈ విషయంపై బ్యాంకులో చర్చ జరుగుతూనే వుంది.

★ ★ ★

అనిమిష బయటకు వచ్చింది. సాయంత్రం అయింది. స్టోర్స్‌లో పని వుండడంవల్ల తెలియలేదు. బయటకు వచ్చేసరికి కొత్త ప్రపంచంలోకి వచ్చినట్టుంది.

"అనిమిషా! ఇంటికేనా? " అనిమిషతో పాటు పనిచేసే ఓ అమ్మాయి అడిగింది.

"లేదు. కోఠికి వెళ్ళాలి" చెప్పింది అనిమిష.

"కోఠికా? షాపింగా? "

"అవును. డిటెక్టివ్ పుస్తకాల షాపింగ్" నవ్వి చెప్పింది అనిమిష.

"డిటెక్టివ్ పుస్తకాల షాపింగా? " ఆశ్చర్యంగా అడిగింది.

"అవును మా తమ్ముడి కోసం"

'మీ తమ్ముడి కోసం డిటెక్టివ్ పుస్తకాలా? నువ్వెక్కడి అక్కవు? తమ్ముడి కోసం మంచి కామిక్స్ లేదా కిడ్స్ మాగజైన్ కొంటారు గానీ"

"వాడికి డిటెక్టివ్ నవల్స్ అంటే బోల్డు యిష్టం".

"అందుకని డిటెక్టివ్ నవల్స్ కొనిచ్చి పాడుచేస్తావా? "

"వాడు ఎప్పటికైనా పెద్ద డిటెక్టివ్ అవుతాడట తెలుసా. వాడికెంత తెలివో పేపర్లలో వచ్చే దొంగతనాల గురించి చదివి, ఆ దొంగలను ఎలా పట్టుకోవచ్చో చెబుతాడు" కాస్త గర్వంగా చెప్పింది అనిమిష.

"అందుకని"

"కోఠిలో ఫుట్‌పాత్ మీద సెకండ్‌హ్యాండ్ డిటెక్టివ్ బుక్స్ దొరుకుతాయట. అడ్రస్‌కూడా చెప్పాడు. ఇవ్వాళ ఎలాగైనా కొనుక్కెళ్ళాలి".

"భలే అక్కవు. భలే తమ్ముడు అంది" ఆ అమ్మాయి నవ్వుతూ.

"వాడంటే నాకు చాలా యిష్టం. వాడికి నేనన్నా చాలా ఇష్టం" అంది తమ్ముడిని గుర్తు చేసుకుంటూ.

"గొప్ప అక్కాతమ్ముళ్ళు! టీవీ ఛానెల్ వాళ్ళకు చెప్పి ఓ సెంటిమెంటల్ సీరియల్ కనీసం ఓ లక్ష ఎపిసోడ్లు అయినా తీయొచ్చు" అంది ఆ అమ్మాయి.

అనిమిష నవ్వి ఆ ఫ్రెండ్‌కి బై చెప్పి ఆటోని పిలిచి ఎక్కి కూచున్నాక చెప్పింది కోఠికి పోనివ్వమని

★ ★ ★

కోఠి ప్రాంతం చాలా రద్దీగా ఉంది. ట్విన్ సిటీస్‌లో ఎక్కువ రద్దీ వుండే ప్రాంతం అది. ఫుట్‌పాత్‌ని ఆక్రమించుకొని బోల్డు షాపులు ఉన్నాయి. నాలుగు చక్రాల బండి మీద అమ్మకాలు సాగించే వాళ్ళే చాలా మంది.

కాలేజి అమ్మాయిలు, వాళ్ళకు బీటేయడానికి వచ్చే అబ్బాయిలు, నిరుద్యోగులు, షాపింగ్‌కు వచ్చే ఉద్యోగినులు ఇలా రకరకాల జనాలతో కోఠి క్రిక్కిరిసిపోయింది. అక్కడ దొరకని వస్తువంటూ ఉండదు. కాస్త ముందుకు వచ్చేక వరుసగా ఫుట్‌పాత్ మీద పుస్తకాల షాపులున్నాయి. అనిమిష అన్ని షాపులను అబ్జర్వ్ చేస్తూ వెళ్ళి ఓ షాపు దగ్గర ఆగింది.

అక్కడ పాత పుస్తకాల దొంతరలు

గాజు, పింగాణి వస్తువులను, ప్రతిష్టను భగ్నం చేయడం తేలిక. తిరిగి అతకటం బ్రహ్మ తరం కాదు. — ఒక సామెత

ఉన్నాయి. ఓ పక్కన డిటెక్టివ్ బుక్స్ వున్నాయి. ఆమెకు చిన్నప్పటి సంగతులు గుర్తొచ్చాయి. తనకు చాలా చిన్న వయసు ఉన్నప్పుడు నాన్న కూడా అప్పుడప్పుడు ఇలాంటి పుస్తకాలు చదివేవాడు. బహుశ అదే అలవాటు బబ్లూకి వచ్చి ఉంటుంది.

బబ్లూ చెప్పిన డిటెక్టివ్ నవలా రచయితల పుస్తకాలు ఓసారి చెక్‌చేసి పరిశీలిస్తుంది. ఓ అమ్మాయి ఇలాంటి పుస్తకాలు చూడ్డం ఆ షాపతనికి వింతగా వుంది.

రెండు మూడు పుస్తకాలు తిరిగేసి తర్వాత ఓ రెండు పుస్తకాలు కొనేసింది.

★ ★ ★

అనిమిష ఇంట్లోకి అడుగు పెడుతూనే తమ్ముని గదివైపు వెళ్ళింది. గదిలో అటు ఇటూ పచార్లు చేస్తున్నాడు బబ్లూ.

తమ్ముడి వెనకాలే తనూ పచార్లు చేయ సాగింది. బబ్లూ తనలో తనే మాట్లాడుకుంటున్నాడు.

అక్క ఇప్పుడు వస్తుందా? ఇంకాసేపటికి వస్తుందా? నేను చెప్పిన బుక్స్ తెస్తుందా తీసుకురాదా?

అనిమిషకు నవ్వొచ్చింది. తన వెనకాలే ఎవరో ఉన్న అనుమానం కలిగింది బబ్లూకి.

వెంటనే ఒక్క క్షణం ఆగి తన ముందున్న అద్దం తీసుకొని చూశాడు. తన వెనకాలే అక్క వుంది.

తమ్ముడి తెలివితేటలకు మురిసిపోతూ చెప్పింది.

"ఒరే బబ్లూ! నువ్వు చెప్పిన పుస్తకాలు తెచ్చాను."

"నాకు తెలుసక్కా నేను అడగడం నువ్వు తీసుకురాకపోవడమా" అంటూ అక్క చేతిలోని నవలలు లాక్కున్నాడు.

"ఒరె బబ్లూ! నువ్వడిగిన నవలలు తెచ్చానని అస్తమానం అవే చదువుతూ కూచోకు క్లాసు పుస్తకాలు కూడా చదువు" అంది తమ్ముడి బుగ్గమీద ముద్దు పెట్టుకుంటూ

"చదువుతాన్లే అక్కా! నేను పెద్దయ్యేక పెద్ద డిటెక్టివ్‌ని అవుతా. ఎంత పెద్ద డిటెక్టివ్‌ని అంటే డిటెక్టివ్ యుగంధర్, డిటెక్టివ్ నర్సన్ షాడో" చెప్పుకుపోతున్నాడు.

"వాళ్ళంతా ఎవర్రా"

"పెద్ద డిటెక్టివ్‌లు. నాలా చిన్నప్పట్నుంచీ తెలివి తేటలు ఉన్నవాళ్ళు"

"ఒరే బబ్లూ! నీకు తెలివితేటలు చాలా ఎక్కువరా. ఏదో ఓ రోజు నువ్వు గొప్పవాడివి అవుతావు" అంది తమ్ముడిని మెచ్చుకుంటూ. ఈలోగా తల్లి వచ్చింది.

"అయ్యిందా? అక్కా తమ్ముళ్ళ ముద్దు ముచ్చట త్వరగా మొహం కడుక్కురా అనూ. టిఫిన్ చేద్దువుగానీ"

బబ్లూ డిటెక్టివ్ నవలలను మంచం మీద ఉన్న పరుపు కింద దాచిపెట్టి బాత్రూంలోకి దూరాడు.

★ ★ ★

ఆ రాత్రి భోజనాల దగ్గర శర్మ ఉదయం బ్యాంకులో జరిగిన విషయం చెప్పాడు. అనిమిషకు చెమటలు పట్టాయి. ఉదయం స్టోర్స్‌లో జరిగిన గొడవకే భయపడిపోతుంది. అలాంటిది బ్యాంకులో జరిగిన సంఘటన విని భయంతో కంపించిపోయింది.

"మీకా గొడవలు ఎందుకు నాన్నగారూ బ్యాంకులో ఎవ్వరికీ పట్టనిది మీకెందుకు? ఆ దొంగలకు అడిగిన డబ్బు ఇస్తే సరిపోతుందిగా. పైగా మీ బ్యాంకు మేనేజర్ కూడా డబ్బులు ఇచ్చేయమని చెప్పారుగా" అంది అనిమిష.

"అదేంట్రా అను అలా అంటావు! బ్యాంకు ఏ ఒక్కరి సొత్తూకాదు. ప్రజలు దాచుకునే కష్టార్జితం. ఆ డబ్బు ఎలాంటిదైనా దానికి జవాబుదారీ మేము. ఇలా అగంతకులు వచ్చి బెదిరించగానే అలా డబ్బులిస్తే ఎలా? ఎవరికి వారు భయంతో ముడుచుకుపోతే దొంగలకు మనమే అవకాశం ఇచ్చినట్టు అవుతుంది".



"అందుకని మనం రిస్క్ తీసుకోవాలా? బ్యాంకులో అందరూ ఉన్నారు. ఒక్కరైనా ముందుకువచ్చారా? ఎందుకు? భయం ప్రాణం మీద తీపి అంతా అయ్యేక మిమ్మల్ని అభినందించారు కానీ మీకు ఏమైనా అయితే" అలా అంటున్నప్పుడు అని మిష గొంతు గాద్గదికమైంది.

"చూడు అనూ ధైర్యవంతుడు ఒకేసారి ఛస్తాడు. పిరికివాడు ప్రతీ క్షణం భయప డుతూ ఛస్తాడు. ఎక్కడో ఎప్పుడో ప్రతిఘ టన మొదలవ్వాలి ఎవరో ఒకరు స్ఫూర్తిగా నిలవాలి. తెల్లవాళ్ళకు ఎదురు నిలిచి మన ప్రాణాల మీదికి ఎందుకు తెచ్చుకోవాలి అని మహాత్ముడు అనుకున్నా, అల్లూరి సీతా రామరాజు ఆగిపోయినా మనం దాస్యశృం ఖలాల్లోనే ఉండిపోయే వాళ్ళం. అయినా ఇది చాలా చిన్న విషయం అన్యాయాన్ని ఎదిరించకపోవడం కన్నా, అన్యాయాన్ని చూస్తూ కూచోవడం పెద్ద తప్పు శర్మ చెప్పుకుపోతున్నాడు.

అనిమిష మాత్రం భయంతో వణికిపో తోంది. ఆమెకు గొడవలన్నా, దొంగలన్నా భయమే. రాత్రిపూట హారర్ సినిమాలు వచ్చినా కళ్ళు మూసుకుంటుంది.

"డాడీ చెప్పింది కరెక్ట్ అక్కా! బ్యాంకు క్యాషియర్ కృష్ణారావు వాళ్ళను డాడీలానే ఎదురిస్తాడు. అప్పుడేమో ఆ దొంగలు పగ బట్టి కృష్ణారావును చంపేస్తే డిటెక్టివ్ ఆ దొంగలను పట్టుకుంటాడు".

"బబ్లూ ఆపు ఇక" కోపంగా అంది అని మిష.

బబ్లు ఠక్కున నోరు మూసుకున్నాడు.

"అనూ! ఎందుకురా తమ్ముడ్ని అలా తిడ తావు? వాడేదో డిటెక్టివ్ కథ చెప్పాడు" అని కొడుకుని దగ్గరకు తీసుకొని "ఒరే బబ్లు డిటెక్టివ్ పుస్తకాలేనా? క్లాసు పుస్త కాలు ఏమైనా చదువుతున్నావా? " అడి

గాడు.

"అప్పుడప్పుడు క్లాసు పుస్తకాలు చదువుతున్నాను డాడీ" అని నాలిక్కర్చుకున్నాడు.

★ ★ ★

ఆ రాత్రి అనిమిషకు నిద్ర పట్టలేదు అటూ ఇటూ పచార్లు చేస్తోంది. నీళ్ళ కోసం నిద్రలేచిన శర్మ కూతుర్ని గమనించి కూతురి దగ్గరికి వచ్చాడు.

"ఏంటి నాన్నగారూ! మీరు ఇటొచ్చారు" అడిగింది అనిమిష.

"నిద్ర రావడం లేదా? " అడిగాడు శర్మ.

"భయంగా ఉంది నాన్నగారూ! ఆ దోపిడీ దొంగలు ఓ రాత్రివేళ జైలు నుంచి పారిపోయి వచ్చి మిమ్మల్ని ఏమైనా చేస్తారేమోనని".

నవ్వి అన్నా శర్మ "అలా భయపడుతూ కూచుంటే ఎలా చెప్పు? "

"ఏమో నాన్నగారూ! ఎన్ని సినిమాల్లో చూడ్డం లేదు"

మరోసారి నవ్వి చెప్పాడు.

"సినిమాలు వేరు. జీవితం వేరు. అయినా ఆ దోపిడీ దొంగలు అంత తేలికగా తప్పించుకొని రారులే! ఒరే అనూ **ఎప్పుడూ భయపడొద్దు భయం మన నీడ లాంటిది మనం ఎటు వెళ్తే అటు వచ్చేసి మనల్ని భయపెడుతుంది"**.

"అది కాదు నాన్నగారూ"

"వెళ్ళమ్మా. వెళ్ళి పడుకో "

అనిమిష వెళ్ళి పడుకుంది. బలవంతంగా కళ్ళు మూసుకుంది. శర్మ చిన్నగా ఓ నిట్టూర్పు విడిచాడు.

అనిమిష కళ్ళు మూసుకుంది కానీ నిద్ర రావడం లేదు. అలా కన్ను అంటుకోగానే కల. భయంకరమైన కల. ఉదయం పోలీసులకు తండ్రి పట్టించిన దొంగలు జైలు నుంచి తప్పించుకున్నట్టు తమ యింటికి వచ్చినట్టు తండ్రిని చంపబోతున్నట్టు.



కెవ్వున కేకవేసి కళ్ళు తెరిచింది. అంతా తన భ్రమ. బబ్లు ఏకాగ్రతగా డిటెక్టివ్ నవల చదువుకుంటున్నాడు. వెళ్ళి తమ్ముడిని మందలించి పడుకోమంది.

"నీకు భయమేసి నన్ను పడుకోమంటున్నావా అక్కా" అడిగాడు బబ్లు అక్క పక్కనే పడుకుంటూ. అనిమిష మాట్లాడలేదు బబ్లు అక్క వైపే చూస్తుండిపోయాడు. అతని చేతిలో 'హంతకులొస్తున్నారు జాగ్రత్త' డిటెక్టివ్ నవల ఉంది.

★ ★ ★

పాతబస్తీ!

ఆ పేరు చెబితేనే చాలా మందికి భయం. ఎప్పుడైనా గొడవలు మొదలయ్యాయంటే ముందుగా అందరి దృష్టి పాతబస్తీ మీదే ఉంటుంది.

ఆ పాత బస్తీలో వుంది కిళ్ళీ షంషేర్ కిళ్ళీకొట్టు.

ప్రపంచం దృష్టిలో అతనికి కిళ్ళీకొట్టు ఉంది. ఆ కిళ్ళీకొట్టులో ఆర్‌డిఎక్స్‌లాంటి పేలుడు పదార్థాలు అమ్ముతాడని చాలా మందికి తెలియదు. ఉదయం నుంచీ అర్ధరాత్రి వరకు తెరిచి వుండే ఆ కిళ్ళీకొట్టులో ల్యాప్‌ట్యాప్‌లాంటి అత్యంత అధునాతన టెక్నాలజీ అతనికి అందుబాటులో ఉంటుంది.

పాతబస్తీలో గొడవలు జరగాలన్నా, ఎక్కడైనా దోపిడీలు జరగాలన్నా ఎక్కడ ఏ నేరం జరగాలన్నా అది కిళ్ళీ షంషేర్ చేతుల మీదుగా జరుగుతుందని చాలా కొద్ది మందికి మాత్రమే తెలుసు.

అతని మీద రౌడీషీట్ ఓపెన్ చేయడానికి ప్రయత్నించిన ఓ పోలీస్ అధికారి ఓ యాక్సిడెంట్‌లో చనిపోయాడు. అది యాక్సిడెంటల్‌గా జరిగిన యాక్సిడెంట్ కాదని, కిళ్ళీ షంషేర్ ఆ పని చేయించాడని పోలీసు అధికారులకు తెలిసినా ఏమీ చేయలేకపోయారు. పోలీస్ శాఖలో అతనికి ఏజెంట్లు చాలా మంది ఉన్నారు. నెలనెలా వాళ్ళకు లక్షల్లో ముడుపులు వెళ్తూనే ఉంటాయి. కిళ్ళీ షంషేర్ చట్టవ్యతిరేక పనుల్లో ఆరితే

రిన వాడు. కొన్ని బ్యాంకులకు రికవరీ ఏజెంట్‌గా వ్యవహరించడం, సిండికేట్లుగా ఏర్పడి కంట్రాక్టులు సాధించడం అతనికి దౌర్జన్యంతో పెట్టిన విద్య.

★ ★ ★

కిళ్ళీ షంషీర్ కిళ్ళీకొట్టు ముందు ఓ జీపా గింది. ఆ జీపులో నుంచి ఓ ఇన్‌స్పెక్టర్ దిగాడు. ఆ కిళ్ళీకొట్టు దగ్గరికి ఎప్పుడూ పోలీసు వాహనాలు రావు. ఒకవేళ వచ్చినా ఆ జీపులోని పోలీసు అధికారులు సివిల్ డ్రస్‌లోనే వస్తారు. కానీ యూనిఫామ్‌లో వచ్చాడు పోలీసు అధికారి.

అతను జీపు దిగి కిళ్ళీ షంషేర్ కిళ్ళీకొట్టు దగ్గరికి వెళ్లి

"ఇక్కడ కిళ్ళీ షంషీర్ అంటే ఎవరు? " కిళ్ళీకొట్టులోకి తొంగిచూస్తూ అడిగాడు.

ఓ వ్యక్తి సీరియస్‌గా ఆ పోలీస్ అధికారి వైపు చూసి 'ఎందుకు? ' అని అడిగాడు.

"కిళ్లీ షంషీర్ ఉన్నాడా? "

అప్పటికే నలువైపుల నుంచీ కొందరు అటువైపు వచ్చారు. వాళ్లసాధారణ ప్రజలు కాదని, కిళ్లీ షంషీర్ అనుచరులు అనీ, వాళ్ల చేతుల్లో యాసిడ్ బాంబులు ఉన్నాయనీ అక్కడ పరిసర ప్రాంతంలో ఉన్న వాళ్లంద రికీ తెలుసు.

కానిస్టేబుళ్ళు భయం భయంగా చూస్తు న్నారు. వాళ్లకు షంషీర్ గురించి తెలుసు.

పోలీస్ అధికారి మరింత కోపంగా కిళ్లీ కొట్టులోకి చూసి 'మర్యాదగా అడిగితే చెప్పరా? " అన్నాడు.

'నమస్తే పోలీస్ సాబ్ మనమే షంషీర్ అంటే ఏంది కత? " చూడ్డానికి మామూ లుగా కనిపించే ఓ వ్యక్తి కిళ్ళీ కొట్టులో నుంచి బయటకు వచ్చి అడిగాడు పంచె పైకి మడుస్తూ

"నీ పేరేనా షంషీర్? " ఆ పోలీస్ అధి కారి మరోసారి అడిగాడు.

"మనమే షంషీర్ ఈ పాత బస్తీలో ఎవ ర్నడిగినా చెబుతారు. మన పేరు షంషీర్ అని" అంటూ ఓ సారి పక్కనే ఉన్న సోడా బండీ వైపు చూసి, బండివాలాని పిలిచి" తమ్మీ ఇలారా నేనెవరో ఈ పోలీస్ సాబ్‌కు చెప్పు" అన్నాడు.

వెంటనే అతను భయంగా వచ్చాడు. పోలీస్‌ని కాకుండా ఓ వ్యక్తిని చూసి భయ పడ్డం ఏమిటో అర్థం కాలేదు ఆ పోలీస్ అధికారికి.

"ఇదేమిటన్నా నువ్వు షంషీర్‌వి" అన్నాడు అతను భయంగా.

"చూశారా సాబ్ గోళికాయలు ఆడుకునే పిల్లకాయల్ని అడిగినా మన పేరు చెబు తారు. కిళ్లీ కావాలా జర్దా కిళ్ళా? మీఠా కిళ్లా? చెప్పు సాబ్ ఏ కిళ్లీ కావాలంటే ఆ కిళ్లీ. ఒక్కసారి వేసుకుంటే ఒళ్లంతా హాయిగా ఉంటుంది ఒరె సాంబ! పోలీస్ సాబ్‌కు ఓ కిళ్లీ కొట్టు "

"షంషీర్ నువ్వు మాతో పోలీస్ స్టేష న్‌కు రావాలి" చెప్పాడు పోలీస్ అధికారి.

"అచ్చా మంచిది వీలున్నప్పుడు వస్తా"

"ఇప్పుడే రావాలి వస్తావా? సంకెళ్ళు వేసి తీసుకెళ్లాలా? "

కిళ్లీ షంషీర్ మొహంలో ఏ ఫీలింగ్ లేదు.

"సోడా తాగుతారా సాబ్! మస్తుగుం టది. గ్యాస్ ముక్కులకెళ్లి పొగ వస్తది. ఒరె! పోలీస్ సాబ్‌కు ఓ సోడ కొట్టు "

పోలీస్ అధికారి షంషీర్ చేయి పట్టుకు న్నాడు. వెంటనే అక్కడ ఉన్న అనుచరులు ముందుకు కదిలారు. షంషీర్ కనుసైగ చేసిన వెంటనే యాసిడ్ బాటిళ్ళు పోలీస్ అధికారి మొహం మీద పడ్డానికి రెడీగా ఉన్నాయి.

షంషీర్ వాళ్ళను కళ్లతోనే వారించాడు.

"పోలీస్ సాబ్! ఈ షంషీర్‌తో అందరూ చేతులు కలుపుతారు. దోస్తు చేయనీకి ఇలా అరెస్టు చేయడానికి కాదు. మా ఇలాకా డబ్బులు అందలేదా? డబ్బులే మైనా ఎక్కువ కావాలా? " శాంతంగానే అడి

గాడు షంషీర్.

"రికవరీ పేరుతో నువ్వు జనం మీద దౌర్జన్యం చేస్తున్నావని నీ మీద కంప్లయింటు వచ్చింది".

"మురుగా! మురుగా! ఎంత మాట సాబ్ నేనా పొద్దున కుమారస్వామిని, మధ్యాహ్నం బాలాజీని సాయంత్రం వినాయకుడిని పూజిస్తాను. నా చేతిలో భగవద్గీత తప్ప మరో పుస్తకమే ఉండదు. సంస్కృతం అర్థం కాకపోయినా పేజీలు తిరగేస్తాను. అంత సాధువుని నేను".

"షంషీర్! నీ తెలివితేటలు కట్టిపెట్టు ముందు నడువు " అంటూ అతని మెడ మీద చేయి వేశాడు.

"వద్దు సాబ్! మన మెడ మీద చేయి వేస్తే పరువు ఏమైపోతుంది? నేనే జీపు ఎక్కుతాను" అన్నట్టు నన్ను అరెస్ట్ చేయడానికి ఏదీ కరెంటు ఉండాలి కదా".

"కరెంట్ కాదు. వారెంటు ఉంది. పోలీస్ స్టేషన్‌కు పద చూపిస్తా".

"ఇంతకీ మనమీద కేసు పెట్టింది ఎవరు సాబ్".

"ధనుంజయరావు. అతని ఇంటికి వెళ్ళి బెదిరించావా లేదా?

"ధనుంజయరావా? అతనెవరు సాబ్".

క్రెడిట్ కార్డు హోల్డర్ రికవరీ ఏజంట్ ముసుగులో నువ్వు వాళ్లింటికి వెళ్లి బెదిరించలేదూ? "

"నేనా"

"వాళ్ళమ్మాయి మీద చేయి వేసి డబ్బు కట్టకపోతే మీ అమ్మాయిని తీసుకెళ్తా అన్లేదూ".

"రామ రామ"

"అతని ఇంట్లోని టీవీని బద్దలు కొట్టలేదూ".

"శివ శివ"

"తెల్లారేలోగా తీసుకున్న డబ్బుకు పదిరెట్లు కట్టకపోతే ఇంటిల్లిపాదినీ ఊరేసి చంపుతానని అన్లేదూ"

"హవ్వవ్వవ్వ ఎంత మాట సాబ్"

"స్టేషన్‌లోకి పద. అన్నీ అవే తెలుస్తాయి"

"మీరు రమ్మన్నాక రాకపోతే ఎలా సాబ్ నేను బాధ్యత గల పౌరుడిని డ్యూటీలో ఉన్న పోలీసు వాళ్ళని గౌరవిస్తాను ఒక్క నిమిషం సాబ్! కాస్త తినేసి వస్తాను తందూరీ చికెన్ మస్తుగ ఉంటుంది నువ్వు కూడా రుచి చూస్తావా."

పోలీస్ అధికారి మొహంలో రంగులు మారుతున్నాయి. కిల్లీ షంషీర్ గురించి పూర్తిగా తెలియకుండానే వచ్చాడు. పర్యవసానం కూడా అతనికి తెలియదు.

"ఒరె సాబ్ గుస్సగా ఉన్నాడు. నేను స్టేషన్‌కు వెళ్లొస్తా. షాపు మంచిగ చూసుకొండి" అంటూ పోలీస్ అధికారి వైపు చూసి "పదండి సాబ్" అన్నాడు.

సరిగ్గా అప్పుడే డిసిపీ వెహికిల్ అక్కడ ఆగింది. డిసీపీని చూడగానే అటెన్షన్‌లోకి వచ్చి సెల్యూట్ చేశాడు ఆ పోలీస్ అధికారి.

"మిస్టర్ మూర్తీ! వాటీజ్ దిస్? ఇక్కడ ఏం చేస్తున్నారు? "

"ధనంజయరావు అనే వ్యకి కంప్లైంట్ యిచ్చాడు సార్. అతడిని ఈ షంషీర్ వేధిస్తున్నాడు. రికవరీ ఏజెంట్ పేరుతో దౌర్జన్యం చేస్తున్నాడు అందుకని."

"అందుకని అరెస్ట్ చేద్దామని వచ్చావా? " కోపంగా అని షంషీర్ వైపు తిరిగి, "షంషీరన్నా! మావాడికి మీ గురించి తెలియక పొరపాటు పడ్డాడు. ఈ ఒక్కసారికి వదిలేయండి"

"అయ్యయ్యో ఎంత మాటా? ఎవరి డ్యూటీ వాళ్లు చేయాలి నా మీద ఓ నింద పడ్డాక అది నాకెంత పెద్ద మచ్చ చట్టం తనపని తాను చేసుకుపోతుంది."

"సారీ షంషీర్ భాయ్! ఎక్స్‌ట్రీమ్‌లీ సారీ" డిసీపీ అని- మూర్తి అనబడే పోలీస్ అధికారి వైపు చూసి మీరు వెళ్లండి" అన్నాడు.

"సార్! ఆ ధనుంజయరావు మన పోలీస్

స్టేషన్‌లోనే ఉన్నాడు. షంషీర్‌ని అరెస్ట్ చేసి తనకు రక్షణ కల్పించకపోతే స్టేషన్‌లోనే ఉరి వేసుకుని చస్తానని చెప్పాడు"

"అవును! ఎప్పుడో చెప్పాడు నాతో కూడా"

"ఇవ్వాళ ఇప్పుడతను మన పోలీస్‌స్టేషన్ లోనే ఉన్నాడు."

"ఏసీ అతనూ ఇతనూ ఒక్కడేమో చూడు" అంటూ చప్పట్లు చరిచాడు.

డిసిపీ వెహికిల్‌లో నుంచి ఓ వ్యక్తి దిగాడు.

"ధనంజయరావు మీరా? మీరు"

"ఇతనే కదా మీరు చెప్పిన వ్యక్తి"

"అవున్సార్"

"సీ మిస్టర్ ధనంజయరావు షంషీర్‌గారి మీద నువ్వే కంప్లయింట్ ఇచ్చావా?"

"లేదు సార్".. తల దించుకొని అన్నాడు ధనంజయరావు అనబడే వ్యక్తి.

"వాటీజ్ దిస్ మూర్తీ! అతనేమో కంప్లయంట్ ఇవ్వలేదంటాడు. నువ్వేమో ఇచ్చాడంటావ్ ఏంటీ?"

"నోమోర్ ఆర్గ్యుమెంట్స్. నువ్వు స్టేషన్‌కు వెళ్లిపో"

మూర్తికి ఒక్కక్షణం బుర్ర గిర్రున తిరిగిన ఫీలింగ్. తాను షంషీర్‌ని అరెస్ట్ చేస్తానని అత్యుత్సాహంతో బయల్దేరినప్పుడు కానిస్టేబుళ్లు ఎందుకు వారించారో ఇప్పుడు అర్థమైంది.

సరిగ్గా ఇది జరిగిన పన్నెండు గంటలకు పాతబస్తీ మీదుగా ఇంటికి వెళ్తున్న మూర్తి బైక్‌ని కొంతమంది అడ్డగించారు.

మూర్తి బైక్ ఆపి ఎదురుగా ఉన్న ఆగంతకుల వైపు చూశాడు. వాళ్ల మొహాల్లో క్రూరత్వం తొంగి చూస్తోంది.

"దిగుబే" అన్నాడు ఒకతను.

మూర్తి హోల్‌స్టర్‌లో నుంచి రివాల్వర్ తీయబోయాడు. అది గమనించిన ఒకతను వచ్చి అతని రెండు చేతులు వెనక్కి విరిచి పట్టుకున్నాడు.

అతడి నుంచి విడిపడే ప్రయత్నం చేస్తూ గింజుకున్నాడు మూర్తి.



## మీ భర్తనైతే విషం తాగేస్తాను

బ్రిటన్ హౌస్ ఆఫ్ కామన్స్‌లో వాడిగా వేడిగా చర్చ జరుగుతోంది. పదునైన మాటలతో ప్రత్యర్థులపై దాడికిదిగే లేడీ ఆస్టర్ అసహనంగా చర్చిల్ వంక చూస్తూ' మిస్టర్ చర్చిల్ నువ్వు ఓ తాగుబోతువు..' అంది. దానికి వెంటనే చర్చిల్ '..నేను తాగుబోతునైనా రేపీపాటికి మాములుగా అవుతాను కానీ మేడమ్ మీరు పరమ అనాకారి.. మరి మీ సంగతేంటి?' అన్నాడు తడుముకోకుండా.

అనాకారి అంటే ఏ మహిళ భరిస్తుంది? అందుకే ఆమె ఆగ్రహంతో ఊగిపోతూ 'మిస్టర్ చర్చిల్.. నేనేగనుక మీ భార్యనైతే కచ్చితంగా మీరుతాగే కాఫీలో ఇంత విషం కలిపేస్తాను' అంది.

'నేను మీ భర్తనయ్యే పరిస్థితేవస్తే ముందూ వెనుకా ఆలోచించకుండా దాన్ని తప్పకుండా తాగేస్తాను' అన్నాడు చర్చిల్ కూల్‌గా.

ఆయన చతురతకు లేడీ ఆస్టర్‌తో సహా సభ ఫక్కుమంది.

సరిగ్గా అప్పుడే నవ్వు వినిపించింది. ఆ నవ్వు తెరలు తెరలుగా ఆ ప్రాంతాన్ని ఆక్రమించుకుంది. అర్థరాత్రి పన్నెండు గంటల సమయం. జనం పలుచగా ఉన్నారు.

అక్కడి వాతావరణం చూసి ఎవరికి వారు మెల్ల మెల్లగా పక్కకు జారుకుంటున్నారు.

మూర్తి ఆ నవ్వు వినిపించిన వైపు చూశాడు. షంషేర్ అతనే కిళ్లీషంషేర్. నవ్వుతూనే ఒక్కో అడుగు ముందుకు వేస్తున్నాడు. జర్దా కిళ్లి అతని నోట్లో నలుగుతోంది.

"నమస్తే సాబ్! గుర్తు పట్టారా? గుర్తు పట్టడానికి ముష్కిల్‌గా ఉందా? నేనే సాబ్ షంషీర్‌ని. కిళ్లీ షంషీర్‌ని. ప్రొద్దున నా మెడ మీద చేయి వేసి స్టేషన్‌కు లాక్కెళ్తానన్నావు చూడు ఆ షంషేర్‌ని. యాదికొచ్చిందా"?

"ఎందుకిలా దారికి అడ్డువచ్చావు? "

"నేను రాలే! నువ్వే నాదారికి అడ్డు వచ్చినావు. నామెడ మీద చేయి వేసినావు. నన్ను మక్కెలిరగ తంతానన్నావు."

మూర్తి ఒక్కక్షణం మౌనంగా ఉండిపోయాడు. సరిగ్గా గంటక్రితం ధనంజయరావు ఫోన్ చేసిన విషయం గుర్తొచ్చింది.

"అయామ్ సారీ సర్! షంషీర్ మీద ఇచ్చిన కంప్లయింట్ వెనక్కి తీసుకోకపోతే పరిణామాలు తీవ్రంగా ఉంటాయని మీ డిసీపీగారే హెచ్చరించారు. షంషీర్‌తో గొడవలు ఎంతటి ప్రమాదకరమో తెలిసి వచ్చింది. పైగా నేను మీదగ్గరికి కంప్లయింట్ యివ్వడానికి వచ్చిన టైంలోనే షంషీర్ మనుష్యులు నా కూతుర్ని కిడ్నాప్ చేశారు. నేను అతనికి వ్యతిరేకంగా కంప్లయింట్ యిస్తే నాకూతురి లైఫ్ స్పాయిల్ అవుతుంది. అందుకే కంప్లయింట్ వెనక్కి తీసుకోక తప్పలేదు. ఈరోజే నేను ఊరు విడిచి వెళ్తున్నాను. వెళ్లేముందు మీకు క్షమాపణ చెప్పాలని అనిపించింది."

ఆ ఫోన్ కాల్ అటెండ్ అయ్యాక మూర్తి మైండ్ బ్లాంక్‌గా తయారైంది. షంషీర్ లాంటి వాళ్లు ఎలా ఎదిగి పోతున్నారో అర్థమైంది. ఆ ఆలోచనతోనే ఇంటికి బయల్దేరుతుండగా ఈ సంఘటన జరిగింది.

★ ★ ★

"ఏంటి సాబ్ ఆలోచిస్తున్నావు. అన్నట్టు నాకు యూనిఫామ్‌లో ఉన్న పోలీసులంటే మస్తు గౌరవం. అందుకే మాఫ్ కీజియే సాబ్ మీ యూనిఫామ్ విప్పేయండి. మీ టోపీ తీసేయండి ప్లీజ్ ప్లీజ్ సాబ్"

మూర్తి శరీరం ఒక్కసారిగా గగుర్పొడిచింది.

'అబ్బ మీరైనా యూనిఫామ్‌ను పీకేయండ్రా" అన్నాడు షంషేర్.

షంషేర్ అనుచరులు మూర్తి ఒంటిమీద వున్న యూనిఫామ్‌ని తొలగించారు. అండర్ వేర్ బనియన్‌మీద ఉన్నాడు.

"సారీ సాబ్ మెడమీద చేయేసిన మిమ్మల్ని వదిలేశాననుకో రేపట్నుంచీ నిక్కర్లు వేసుకునే పిల్లకాయలు కూడా నన్ను పిచ్చినాకొడుకుని చూసినట్టు చూస్తారు. అందుకే నామెడ మీద చేయేసిన మీ చేయి నరికి పారేశాననుకో అందరూ భయపడిపోతారు ఏమంటారు? "

భయంతో మూర్తి వణికిపోయాడు. షంషేర్ చేతిలో పొడవాటి కత్తి మాంసం కొట్టే కత్తి ఇద్దరు వ్యక్తులు మూర్తిని పట్టుకున్నారు. అతని కుడిచేతిని గట్టిగా పట్టుకున్నారు.

షంషేర్ చేతిలోని కత్తి పైకి లేచింది. కొద్ది క్షణాల్లో అక్కడ బీభత్సం రాజ్యమేలింది. రక్తం ఏరులా పారింది. దౌర్జన్యం పడగవిప్పింది. దాష్టీకం చెలరేగింది. మూర్తి అరిచిన అరుపుతో పాతబస్తీ ప్రతిధ్వనించింది. అతని కుడిచేయి మోచేయి కింది భాగం తెగి కిందపడింది.

షంషేర్ కత్తికి అంటిన రక్తాన్ని తన చొక్కాకి తుడుచుకుని తాపీగా జీపు దగ్గరికి నడిచాడు.

★ ★ ★

పరులకు సౌభాగ్యం సాధించడంలో సాయపడేవాడే ఆదర్శవాది.

– హెన్రీఫోర్డ్

"చూశావా అనిమిషా! ఎంత ఘోరమో. నడిరోడ్డు మీద ఓ పోలీసు అధికారి చేయి నరికారు" పేపర్ చదివి కూతురితో అన్నాడు శర్మ.

"రోజూ ఎన్నో నేరాలు-ఘోరాలు జరుగుతుంటాయి. వాటిని మనం ఏం చేయగలం నాన్నగారూ! నిస్సహాయంగా చూస్తూ వుండడం తప్ప. పేపర్‌లో వార్తలు చదివి మన పని మనం చేసుకోవాలి" నిర్లిప్తంగా అంది అనిమిష.

"అదేమిటమ్మా అలా అంటావు. నీది ఉడుకు రక్తం. నువ్వలా అనకూడదు. యువతలో చైతన్యం వెల్లివిరియాలి. అన్యాయన్ని తూర్పారబట్టాలి. కేవలం పేపర్లలో వచ్చే వార్తలు చదివి, కొన్నిరోజులు పోయాక, ఆ పేపర్లన్నీ పాత పేపర్లవాడికి అమ్మి చేతులు దులుపేసుకోవాలనుకునే మనస్తత్వం మారాలమ్మా" శర్మ అన్నాడు.

"నాన్నగారూ! ఇవన్నీ సినిమాల్లో చూడ్డానికి నవలల్లో చదవడానికి బావుంటాయి. అంతేగానీ మనమేదో అపర కల్కి అవతారంలా కత్తిచేత పట్టుకొని గుర్రమెక్కి దుష్ట శిక్షణ చేయలేముగా"

"ఎందుకు చేయలేము" శర్మ అలా అనేసరికి షాకవడం అనిమిష వంతయింది.

"ఏం ఎందుకు చేయలేము? కల్కి వస్తున్నాడంటే ఎక్కడో ఏ దేవుడో అవతారం ఎత్తి రావాలా? నువ్వు కూడా దుష్ట శిక్షణ చేయొచ్చు"

"నేనా? "

"నువ్వేంటమ్మా ఎవరైనా చేయొచ్చు. అన్యాయాన్ని ఎదుర్కోవాలనే ఆలోచన వస్తే చాలు"

"అంటే ఈ ప్రజల్లో ఆ ఆలోచన రావడం లేదా నాన్నా"

"లేదు. అన్యాయాన్ని ఎదురించాలన్న ఆలోచన రావడం వేరు. అన్యాయాన్ని ఎదురించడానికి ప్రయత్నించడం వేరు"

"రెంటికీ తేడా ఏమిటి నాన్నా"

"చాలా వుందమ్మా. నడిరోడ్డుమీద ఓ హత్య జరుగుతుంటే వెంటనే ఆ అన్యాయాన్ని, ఘోరాన్ని ఎదురించాలని అనిపించొచ్చు. కానీ అందుకు ప్రయత్నం ఎంత మంది చేస్తారు?

"చేస్తేమాత్రం గూండాలను, హంతకులను మనం ఎదురించి బ్రతగ్గలమా? "

శర్మ నవ్వాడు. అతని నవ్వులో హేళన లేదు. ఎదుటివారి అమాయకత్వాన్ని అర్థం చేసుకున్నట్టు ఉందా నవ్వు.

"బాగా ఆలోచించు అనిమిషా! ఒక వీధిలో కొన్ని వందలు వేలమంది ఉంటారు. నడిరోడ్డుమీద వందలమంది వెళ్తూ వుంటారు. చంపేవాడు ఒక్కడు. అతనితోపాటు ఉన్న దుర్మార్గులు ఓ నలుగురు ఐదుగురు లేదా ఇరవైమంది. కానీ జనం వందల్లో, వేలల్లో వుంటారు. ఒకడు కత్తి పట్టుకొని బెదిరిస్తే వందల సంఖ్యలో వేల సంఖ్యలో వున్న జనం భయంతో పారిపోతారు. నిజంగా ఆ వందల వేల జనం తిరగబడితే" ఒక్కక్షణం ఆగి కొనసాగించాడు శర్మ. "ఆ గూండాలు చావడం ఖాయం. కానీ భయం. ఎవరికి వారే తాము మాత్రం సమస్య నుంచి దౌర్జన్యం బారి నుంచి తప్పించుకుంటే చాలనే ఆలోచన. ఆ ఆలోచనే ఆ మనిషిని నిర్వీర్యం చేస్తుంది. ఆ భయమే గూండాలకు ఊపిరిగా మారుతుంది. ఎక్కడో చదివిన గుర్తమ్మా

***ఎక్కడ ప్రజల అమాయకత్వం ఊపిరి పోసుకుంటుందో, ఎక్కడ ప్రజల భయం నిశ్శబ్దంగా, నిర్లిప్తత మాటున ఒదిగిపోతుందో అక్కడ దౌర్జన్యం పరిఢవిల్లుతుంది. దౌర్జన్యం చేసే ఒక గూండాకన్నా, ఆ దౌర్జన్యాన్ని ప్రతిఘటించలేనివాడే ఈ సమాజంలో బ్రతకడానికి అనర్హుడు.***

తండ్రి మాటల్లోని తీవ్రత అనిమిషకు అర్థమవుతూనే ఉంది. ఆమెకెప్పుడూ తండ్రి విషయంలో అదే భయం. అన్యాయాన్ని

సహించడు. ఎప్పుడే గొడవ తెచ్చిపెడతాడో అన్న భయం.

"సర్లే నాన్నా మన విషయం మనం చూసుకుందాం. మనం జాలి చూపించడం తప్ప ఏం చేయగలం? "

"నిజానికి మనమీద మనం జాలిపడాలి. మన చేతకానితనం. మనలోని నిర్లిప్తత ఇవీ మనలోని వైఫల్యాలు"

"సరే నాన్నగారూ మీరు త్వరగా తయారైతే మనం బయల్దేరొచ్చు" అంది అనిమిష.

శర్మ టైం చూశాడు. తొమ్మిదిన్నర అవుతోంది. వెంటనే లేచి తయారవ్వసాగాడు.

బబ్లూ డిటెక్టివ్ నవల నోటుబుక్‌లో పెట్టి చదువుతున్నాడు. శర్మ అటుగా వచ్చి కొడుకు వైపు చూసి "ఏం చేస్తున్నావురా. ఇవ్వాళ స్కూల్ లేదా"

"లేదు డాడీ. నోట్స్ చదువుకుంటున్నాను. నేను నీలా బాగా చదువుకోవాలిగా" బుద్ధిగా చెప్పాడు బబ్లూ.

"బాగా చదువు. నోట్‌బుక్ తిరగేసి ఉంది. డిటెక్టివ్ నవల బయటకు కనిపిస్తోంది" నవ్వుతూ చెప్పి బయటకు నడుస్తుంటే భార్య అంది.

"వాడలా డిటెక్టివ్ నవలలు చదువుతుంటే తిట్టటం మాని ఇంకా చదువుకోమని ఎంకరేజ్ చేస్తారా? మీరంటే వాడికి భయం ఉండొద్దూ? "

"పిచ్చిదానా! భయం ఎందుకు? అయినా వాడికి మార్కులు బాగానే వస్తున్నాయిగా! పిల్లలను క్రమశిక్షణలో పెట్టటం మంచిదే కానీ అది శిక్ష కాకూడదు. వాడు ఓవైపు క్లాసు బుక్స్ చదువుతూ మరోవైపు వాడికిష్టమైన పుస్తకాలు చదువుకుంటున్నాడు. బలవంతంగా ఒద్దని తిడితే తెలియకుండా చదువుతాడు. ఏమో? వాడు రేపొద్దున పెద్ద డిటెక్టివ్ అవుతాడేమో ఎవరికి తెలుసు"

"మంచి నాన్న! మంచి కొడుకు! సరిపోయింది" రుసరుసలాడుతూ వంట గదిలోకి వెళ్ళిపోయిందామె.

"ఏమోయ్! మంచి ఫిల్టర్ కాఫీ ఒకటి పట్టుకురా! నువ్వు కాఫీ పెడితే వీధి వీధంతా ఘుమ ఘుమలాడుతుంది" అన్నాడు శర్మ.

అయిదంటే అయిదు నిమిషాల్లో భర్తకు వేడివేడి ఫిల్టర్ కాఫీ తీసుకువచ్చింది.

"నాన్నగారు అడగటమే ఆలస్యం ఎంత స్పీడ్‌గా తెస్తావమ్మా! నీ కాఫీ ఘుమఘుమ ఇల్లంతా పరుచుకుంది" అంది అనిమిష.

"నువ్వు కూడా తాగరాదుటే తీసుకురానా" అడిగింది కూతుర్ని.

"వద్దులేమ్మా మా స్టోర్స్‌లోకి ఓ కుర్రాడు రోజూ టీ తీసుకువస్తాడు. యాలకుల టీ. బావుంటుంది"

"అదేంటి టీ తాగుతావా? "

"టీ మెదడును ఫ్రెష్‌గా ఉంచుతుంది. రోజూ ఓ కప్పు టీ తాగితే మెదడుకు మంచిదట. ఓ పేపర్‌లో చదివాను" శర్మ భార్యతో చెప్పాడు.

"మిమ్మల్ని కదిలించినా, కదిలించకపోయినా ప్రతి విషయానికీ క్లాసు పీకుతారు. అసలు మీకు తెలియని విషయమే లేదా? " భర్తని ముద్దుగా విసుక్కొంది.

"ప్రతి విషయం తెలుసుకోవాలని అనుకోవడం తప్పు కాదు. టీలో లవంగాలూ, ఇలాచీ టీ, మసాలా టీ, లైమ్ టీ డికాషన్ మలాయ్ టీ "

"ఆపండి మహాప్రభో"" రెండు చేతులూ జోడించింది భర్త వైపు తిరిగి.

అనిమిషకు నవ్వొచ్చింది. ఆమెకు ఆ ఇంటి వాతావరణం బాగా నచ్చుతుంది. ఇలాంటి వాతావరణం ఎన్ని ఇళ్ళలో ఉంటుంది?

భార్య పిల్లలను స్నేహితుల్లా చూసే కుటుంబ పెద్ద ఎక్కడ ఉంటారు? తను, అమ్మ, తమ్ముడు, నాన్న. దేవుడా! ఈ చిన్న కుటుంబానికి నువ్వే శ్రీరామరక్ష అనుకుంది అనిమిష.

ఆ క్షణం ఆమె ఊహించి ఉండదు. తన కుటుంబంలో పెనుతుఫాన్ త్వరలో మొద



లవ్వబోతోందని ఓ ఉపద్రవం ముంచుకు వస్తుందని.

ఆ ఉపద్రవమే షంషీర్! కిళ్ళీ షంషీర్.

★ ★ ★

ఓ జీపు వెళ్ళి షంషేర్ కిళ్ళీకొట్టు ముందు ఆగింది. అందులో నుంచి ఓ యాభై ఏళ్ల వ్యక్తి దిగాడు. బ్లాక్ కలర్ డ్రస్‌లో ఉన్నాడు. గడ్డం పెరిగి ఉంది. నల్ల కళ్ల జోడు. మనిషిని స్పష్టంగా గుర్తుపట్టడం కష్టం.

అతను కిళ్లీకొట్టు దగ్గరికి వచ్చి 'షంషీర్ వున్నాడా' అడిగాడు. కిళ్ళీ కొట్టులో కూర్చున్న వ్యక్తిని.

"నువ్వెవ్వరు" సమాధానం చెప్పకుండా ఎదురు ప్రశ్న వేశాడు కిళ్ళీకొట్టులో కూర్చున్న వ్యక్తి.

"ఢిల్లీలో మంచు బాగా కురుస్తుంది" అన్నాడా నలుపురంగు డ్రెస్ వేసుకున్న వ్యక్తి.

"హైద్రాబాద్‌లో మంచినీళ్ళు అమ్ముతున్నారు" చెప్పాడు కిళ్ళీకొట్టులో కూర్చున్న వ్యక్తి.

"నేను షంషీర్‌ని అర్జంట్‌గా కలవాలి" చెప్పాడు బ్లాక్ కలర్ డ్రస్ వ్యక్తి. తన కోడ్ చెప్పాడు.

"రాత్రే. ఇన్‌స్పెక్టర్ చేతిని నరికేశాడు. ఎందుకైనా మంచిదని అండర్‌గ్రౌండ్‌లోకి వెళ్లాడు. నేను కబురు చేస్తాను. చాయ్, పరోటాలు తెప్పిస్తాను. నాస్తా చేస్తూ ఉండు" అంటూ అక్కడే ఉన్న ఓ వ్యక్తిని పిలిచి ఈ సాబ్‌ని అఖ్తర్ హోటల్‌కి తీసుకువెళ్ళు. లోపలికి తీసుకువెళ్ళు" అని చెప్పాడు.

"వద్దు నేనే హోటల్‌కి వెళ్తాను. ఈలోగా నాకు స్నానానికి ఏర్పాటు చేయండి" చెప్పాడు అతను.

★ ★ ★

రాత్రి పదకొండున్నర దాటింది. ఓ

ఇరానీ రెస్టారెంట్‌లో కలుసుకున్నారు.

కిల్లీ షంషేర్, ఢిల్లీ నుంచి వచ్చిన బ్లాక్ కలర్ డ్రస్ మనిషి.

"అయామ్ జాకబ్! ఢిల్లీ నుంచి నీకోసమే వచ్చాను. దాదామియా ఈ డబ్బు పంపించాడు" అంటూ ఓ పెద్ద సూట్‌కేసు టేబుల్ మీద పెట్టాడు.

ఆ రెస్టారెంట్‌లో రష్ లేదు. సాధారణంగా ఆ రెస్టారెంట్‌కు ఎవ్వరూ రారు. గూండాలకు రౌడీలకు అదే మీటింగ్ పాయింట్. ఆ విషయం చాలా మందికి తెలుసు. అనఫీషియల్ గూండాల అడ్డా ఆ రెస్టారెంటు. ఆ రెస్టారెంట్ చుట్టుపక్కల షంషేర్ మనుష్యులు జాగ్రత్తగా కాపలా కాస్తున్నారు.

'ఈ సూట్‌కేసులో కోటి రూపాయలు ఉంది. అయిదు వందలు, వెయ్యి రూపాయల నోట్లు కట్టలే. అన్నీ పాక్డ్ కరెన్సీ. వాటిని మార్చే బాధ్యత నీదే'

"ఆ విషయం నాకొదిలేయ్. నీమీద ఎవరికీ అనుమానం రాలేదు కదా" అడిగాడు షంషేర్ అతన్ని.

"లేదు. రైలులో వచ్చాను. థర్డ్ క్లాసులో అయినా జాగ్రత్తలు నేను తీసుకుంటాను. ఈ పని ఎప్పుడు పూర్తవుతుంది, నేను తిరిగి ఢిల్లీ ఎప్పుడు వెళ్ళాలి? "

"ఈ రాత్రికి రెస్టు తీసుకో. నిన్ను మావాళ్ళు ఓ గెస్ట్‌హౌస్‌కి తీసుకువెళ్తారు. ముందు విందు పొందు అన్నీ అక్కడే! రేపే ఈ డబ్బును మార్చే పని మొదలెడ్తా. మనకో బ్యాంక్ మేనేజర్ తెలుసు. వాడు ఈ పని పూర్తి చేస్తాడు"

"మనం చెప్పినట్టు వింటాడా? "

"వినడమా? ఈ షంషేర్ మాటలు వినకపోతే యాసిడ్‌తో స్నానం చేయించనూ మొదట్లో మొండికేశాడు. వాడి భార్యను కూతుర్ని వాడి ముందే రేప్ చేస్తానని బెదిరించాను. దారిలోకి వచ్చాడు. ఆ తర్వాత డబ్బు రుచి చూపించాను. అమ్మాయిల మజా ఏమిటో తెలిసొచ్చేలా చేశాను. ఈ ప్రపంచంలో డబ్బు, సెక్స్ రెండూ ఎప్పుడూ ఫ్రెష్‌గా ఉంటాయి. ఇప్పుడు మనమేం చెప్పినా కుక్కలా తోకాడించి పనిచేసి పెడతాడు"

"వెల్! నేనిక బయల్దేరనా" అన్నాడు జాకబ్.

"హైద్రాబాద్ బిర్యానీ రుచి చూడు" అంటూ రెస్టారెంట్‌లోని వెయిటర్‌ని పిలిచి చెప్పాడు.

పావుగంటలో వేడివేడి చికెన్ బిర్యానీ తెచ్చాడు. ఓ మందు సీసా గ్లాసులు తెచ్చాడు.

"జాకబ్ భాయ్ నీ పని కానిచ్చేసి గెస్ట్ హౌస్‌కు వెళ్లిపో బయట మన వాళ్లు జీపుతో రెడీగా వుంటారు. రేపు కలుద్దాం "గుడ్ నైట్" అంటూ సూట్‌కేసును తీసుకొని బయటకు నడిచాడు షంషేర్.

ఆ రాత్రే తనకు చివరి రాత్రి అనీ తన పాలిట శనిరాత్రి అనీ జాకబ్‌కు తెలియదు.

అతనికి పెట్టిన బిర్యానీలో అతి శక్తిమంతమైన విషం కలుపబడింది.

సరిగ్గా అరగంట తర్వాత నురగలు కక్కుతూ చచ్చిపోయాడు జాకబ్. అతని శవం అనాథ శవంలా ఓ తుప్పల్లో పడి ఉంది.

★ ★ ★

అర్ధరాత్రి పన్నెండున్నర!

ఢిల్లీలో వున్న దాదామియాకు ఫోన్ చేశాడు షంషేర్.

'దాదామియా సాబ్. కామ్ ఖతం హోగయా జాకబ్‌ని ఫినిష్ చేసాను"

"వెరీ గుడ్. మన రహస్యాలు ఎవ్వరికీ శాశ్వతంగా తెలియకూడదు. జాకబ్ తెచ్చిన డబ్బు వెంటనే మార్చే పని చూడు బలికి సిద్ధంగా వున్నవాడిని ఆ డబ్బు యిచ్చి పంపించు. పోలీస్ రికార్డ్స్‌లోకి ఎక్కినవాడిని ఇక్కడికి పంపించు. ఫినిష్ చేసేద్దాం. ఏ ప్రాబ్లమూ ఉండదు" చెప్పాడు దాదా

మియా.

షంషేర్ సరేనని ఫోన్ కట్ చేశాడు. అతని ముందు సూట్‌కేసులో కోటి రూపాయల నకిలీ నోట్లు ఉన్నాయి. తెల్లారి వాటిని మార్చాలి అదీ బ్యాంకు ద్వారా.

★ ★ ★

శర్మ అంతా గమనిస్తూనే వున్నాడు.

మేనేజర్ క్యాబిన్‌లో జరిగే తంతు అతనికి కొంత అనుమానాన్ని కలిగించింది. ఉదయమే ఏమాత్రం అపాయింట్‌మెంట్ లేకుండా ఓ అపరిచిత వ్యక్తి మేనేజర్ క్యాబిన్‌లోకి వెళ్ళడం మేనేజర్ స్వయంగా అతడిని క్యాబిన్‌లోకి తీసుకువెళ్ళడం. ఏం జరుగుతోంది? లోపల జరిగేది ఏమై ఉంటుంది? అతనిలో లక్ష సందేహాలు.

మేనేజర్ క్యాష్ కౌంటర్‌లో ఉన్న మౌళిని పిలిచాడు. అతను మేనేజర్ క్యాబిన్‌లోకి వెళ్ళి పావుగంట తర్వాత వచ్చాడు. అతని మొహమంతా చెమటతో తడిసిపోయింది. కర్చీఫ్‌తో చెమట తుడుచుకుంటూ చుట్టూ చూస్తున్నాడు.

శర్మ బ్రెయిన్ షార్ప్‌గా పనిచేయడం మొదలుపెట్టింది. మౌళి చూపుల్లో ఏదో అపశ్రుతి. లోపల ఏదో జరుగుతుంది. అతని మనసు కీడుని శంకించింది. కొద్దిసేపటికి మౌళి టేబుల్ మీద వున్న ఇంటర్‌కమ్ మోగింది.

మౌళి అతన్నెవరైనా గమనిస్తున్నారేమోనని ఓసారి చుట్టూ చూసి మేనేజర్ క్యాబిన్‌లోకి వెళ్ళాడు.

సరిగ్గా పది నిమిషాల తర్వాత మేనేజర్ మౌళి కలిసి స్ట్రాంగ్ రూమ్ వైపు వెళ్ళారు.

ఈ టైంలో స్ట్రాంగ్ రూమ్‌లో పనేమిటి? పైగా మేనేజర్ చేతిలో సూట్‌కేసు వుంది.

శర్మ మనసు చూపు అంతా స్ట్రాంగ్ రూమ్ వైపే ఉంది. ఇరవై నిమిషాల తర్వాత మొహానికి పట్టిన చెమట తుడుచుకుంటూ మేనేజర్, మౌళి కలిసి క్యాబిన్‌లోకి వెళ్ళిపోయారు. మరో పదినిమిషాల తర్వాత ఇందాక క్యాబిన్‌లోకి వెళ్ళిన వ్యక్తి ఓ సూట్‌కేసుతో బయటకు నడిచాడు.

మేనేజర్ స్ట్రాంగ్ రూమ్‌లోకి తీసుకువెళ్ళిందే ఈ సూట్‌కేసు.

★ ★ ★

మేనేజర్ మొహం కందగడ్డలా ఎర్రబడింది. కోపంతో మొహం జేగురు రంగులోకి మారింది. ఆవేశంతో అతని పిడికిళ్ళు బిగుసుకున్నాయి. ఆవేశంలో భయం కూడా మిళితమై వుంది.

"ఏమిటి శర్మగారు మీరంటున్నది?" తత్తరపాటుతో అడిగాడు.

"ఉదయం మీ క్యాబిన్‌కు వచ్చిన వ్యక్తి ఎవరు సార్!"

"వాట్ నాన్‌సెన్స్ యు ఆర్ టాకింగ్" క్యాబిన్‌లోకి ఎవరు వచ్చారో ఆ వివరాలు మీకు చెప్పాలా? అసలు మీ గురించి మీరు ఏమనుకుంటున్నారు? నేను మీ సబార్డినేటని అనుకుంటున్నారా"

"సారీ సర్ ఉదయం మీ క్యాబిన్‌కి వచ్చిన వ్యక్తి మీదే నాకు అనుమానం. అతని చేతిలో సూట్‌కేసు చూశారా?"

ఒక్క క్షణం ఉలికిపాటును కప్పి పుచ్చుకుంటూ "సూట్‌కేసులో ఏముంది?" అని అడిగాడు.

"అదే నేను అడుగుతున్నాను సార్ ఈ సూట్‌కేసులో ఏముంది? మీరు స్ట్రాంగ్ రూమ్‌లోకి ఆ సూట్‌కేసు తీసుకువెళ్ళారు. తర్వాత అదే సూట్‌కేసును ఆ వ్యక్తి బయటకు తీసుకువెళ్ళాడు".

"సో.. వాట్ నా క్యాబిన్‌లోకి గొప్ప గొప్ప క్లయింట్స్ వస్తారు. బ్యాంకు మేనేజర్‌గా వాళ్ళతో డీల్ చేస్తాను. అందుకు మీ పర్మిషన్ కావాలా?" ముక్కుపుటాలు అదురుతుండగా అడిగాడు మేనేజర్.

తన్నుతాను విమర్శించుకోవడం వివేకం. ఇతరులను విమర్శించడం అవివేకం.
– అమ్మ

"మామూలుగా అయితే అక్కర్లేదు సార్ కానీ ఇందాక స్ట్రాంగ్ రూమ్‌లో డబ్బు పెడుతూ చూశాను. మన సేఫ్‌లో ఉంచిన నోట్లకు బదులు మరో నోట్లు ఉన్నాయి".

ఒక్క క్షణం ఉలిక్కిపడ్డాడు. వెంటనే కవర్ చేసుకొని 'అతని దగ్గర వంద నోట్ల బండిల్స్ ఉన్నాయి. వాటి బదులు ఫైవ్ హండ్రెడ్, థౌజండ్ నోట్ల బండిల్స్ అడిగాడు.. ఇదివరకు నేను రాజమండ్రిలో పని చేసినప్పుడు అక్కడ మన కస్టమర్"

"మన సేఫ్‌లో ఉంచిన నోట్లు వంద నోట్లు, అయిదు వందల నోట్లు కొత్తగా సేఫ్‌లోకి వెయ్యినోట్లు వచ్చి చేరాయి. అవీ కొత్తవి" అనుమానంగా మేనేజర్ వైపు చూస్తూ అన్నాడు.

"మిస్టర్ శర్మా! అసలు మీరేమనుకుంటున్నారు నేనేమైనా క్రిమినల్‌ననా? మీరేమైనా ఇంటరాగేషన్ ఆఫీసరా! వెళ్లండి వెళ్ళి మీపని మాత్రమే మీరు చూసుకొండి ప్లీజ్ యుకెన్‌గో"

"సారీ సర్! నాకెందుకో అపరిచిత వ్యక్తి మీద అనుమానం ఉంది. మరోసారి ఆ నోట్లను చెక్ చేయండి."

"వాట్" అదిరిపడి అడిగాడు.

"అవును సార్ ఓ సారి ఆ నోట్లని చెక్ చేయండి"

"మిస్టర్ శర్మ! మీరు అనవసరంగా ఏదో అపోహపడుతున్నారు."

"లేదు సార్ ముందు జాగ్రత్త వారం రోజుల క్రితం వి.యన్.కాలనీలో ఉన్న బ్రాంచీలో దొంగనోట్లు వచ్చి చేరిన వార్త మీరు చూడలేదా? "

మేనేజర్ మొహం చెమటతో నిండిపోయింది.

"మిస్టర్ శర్మ మీరు వెళ్లండి. ఆవిషయం నేను చూసుకుంటాను."

"మీ ఇష్టం సార్! అలా మీకు వీలుకాని పక్షంలో నేనే పోలీస్ కంప్లయింట్ యిస్తాను." అంటూ వెనుతిరిగాడు శర్మ.

అతనూహించని మలుపుకు ఆ సంఘటనే కారణమవుతుందని శర్మకు ఆక్షణాన తెలియదు.

★ ★ ★

అప్పటికే నాలుగో రౌండ్ పూర్తయింది.

మేనేజర్ కళ్లు ఎర్రగా మారాయి. మౌళి వణికిపోతున్నాడు.

కిల్లీ షంషేర్ తాపీగా మందుకొడుతూ చికెన్ సిక్స్టీఫైవ్ తింటూ ఉన్నాడు.

"షంషేర్ సాబ్ మీరే ఏదో చేయాలి" అన్నాడు తూలిపోతూ మేనేజర్.

"అబ్బ మీరు కంగారు పడకండి మేనేజర్ గారు రిలాక్స్".

"ఏం రిలాక్స్! శర్మగాడు కళ్లముందు కనిపిస్తేనే కిక్కు దిగిపోతుంది. మీకు వాడి గురించి తెలియదు. దొంగలు లక్షలు దాచుకుంటుంటేనే వదిలిపెట్టలేదు. ఎదురించాడు. అలాంటిది కోటి రూపాయలు అక్షరాలా కోటి రూపాయలు నకిలీ నోట్లు బ్యాంకులో ఉన్నాయని తెలిస్తే చస్తే వదిలిపెట్టడు. పోలీసులు వరకూ వెళ్తాడు."

"అంతటి మగాడా" వ్యంగ్యంగా అన్నాడు షంషేర్

"మీకు వాడి సంగతి తెలియక మాట్లాడుతున్నారు. చిన్న పొరపాటు వచ్చినా ఊర్కోడు. ఛండశాసనుడు. దేనికీ వెనుకాడడు."

పగలబడి నవ్వాడు షంషేర్.

"దేఖో మేనేజర్ సాబ్! ప్రతిదానికీ ఓరేటు ఉంటుంది. కొన్నింటికి ఎక్కువ రేటు ఉంటుంది. అది కనుక్కొని కొనుక్కోవడమే."

వాడు డబ్బుకు వినే మనిషి కాదు.

"డబ్బుకు వినకపోతే మందుకు వింటాడు. ఆడదాని పొందుకు వింటాడు."

"మహాప్రభో వాడు అలాంటి వాటికి వినడు."

"అయితే కత్తికి వింటాడు."

అదిరిపడి అడిగాడు మేనేజర్

"అంటే ఏం చేస్తారు? అతడ్ని చంపే స్తారా"?

"మరేమైనా అనుమానమా - నాకు రెండే తెలుసు. ఒకటి డబ్బుతో కొట్టడం. రెండు కత్తితో పొడవడం. అయిన నువ్వీ విషయం వదలేసి నిశ్చింతగా ఉండు. రేపు అతని సంగతి చూసుకుందాం. ఈలోగా నేను చెప్పినట్టు వాడిని బుజ్జగించే పని చేయి."

నిస్సహాయంగా 'అలానే' అన్నట్టు తలూపాడు మేనేజర్. మౌళి తూలుతూ లేచాడు.

★ ★ ★

స్ట్రాంగ్ రూమ్ తెరిచాక శర్మ నిన్న పెట్టిన నోట్లని పరిశీలించసాగాడు. మేనేజర్ మౌళికి సైగ చేయగా అతను అక్కడ్నుంచి వెళ్లిపోయాడు. మేనేజర్ శర్మ వైపు తిరిగి "శర్మగారూ! మీరోసారి నా క్యాబిన్‌కి రండి" అంటూ తన క్యాబిన్‌కి తీసుకు వెళ్లాడు.

★ ★ ★

"చెప్పండి సార్! ఏమిటి విషయం" అడిగాడు శర్మ.

"ముందు మీరు కూర్చోండి" అంటూ బెల్ నొక్కి ప్యూన్‌ని పిలిచి "నేను చెప్పే వరకు ఎవర్నీ లోనికి రానివ్వకు" అని చెప్పాడు. ప్యూన్ వెళ్లిపోయాడు.

మేనేజర్ ఓసారి మొహానికి పట్టిన చెమట తుడుచుకుంటూ శర్మ వైపు చూసి

"శర్మగారూ! కొన్ని విషయాలు మనం చూసి చూడనట్లు వదలేయాలి. ఏమంటారు".

"మనం వదిలేసినా ధర్మం వదిలేయదు. ఇంతకీ మీరు వదిలేయమని చెప్పిన విషయాలేమిటి సార్?" సూటిగా అడిగాడు శర్మ.

"ఎక్కడైనా కొన్ని లొసుగులు ఉంటాయి వాటిని మనం మరిచిపోవాలి" అన్నాడు అన్యాపదేశంగా మేనేజర్.

"సార్ ఈ డొంక తిరుగుడు వద్దు. మన స్ట్రాంగ్‌రూములో కోటి రూపాయల నకిలీనోట్లు వచ్చి చేరాయి. ఆవిషయం మీకు తెలుసా?"

మేనేజర్ గొంతు తడారిపోయింది.

"మీరు వెంటనే నిన్న మీదగ్గరకు వచ్చిన అతడి గురించి పోలీసులకు చెప్పండి."

"అతడి గురించి పోలీసులకా? ఎందుకు?"

"ఎందుకంటే అతని నకిలీ నోట్లను మీద్వారా స్ట్రాంగ్ రూమ్‌లోకి వెళ్లే ఏర్పాటు చేసుకున్నాడు. బహుశ మిమ్మల్ని భయపెట్టి ఆపని చేయించి ఉంటాడు" అని మేనేజర్ మొహంలోని రియాక్షన్స్ గమనించసాగాడు శర్మ.

"శర్మగారూ! పెద్ద పెద్ద వాళ్లతో వ్యవహారాలు మనం చూసీ చూడనట్లు ఉండాలి. మనకు కరెక్ట్‌గా తెలియనప్పుడు మనం దేంట్లోను వేలు పెట్టకూడదు."

"నేను నకిలీ నోట్లని నిర్ధారించే చెబుతున్నానుసార్" శర్మ స్థిరంగా అన్నాడు.

"చూడండి శర్మగారూ! అవి నకిలీనోట్లు అని మీరు చెబితేగాని తెలియదు. ఎక్కడెక్కడో మార్పులు అవుతుంటాయి వదిలేయండి"

"మన ఖాతాదారులను మనమే మోసం చేయడమా?"

"అదికాదు శర్మగారూ."

"సారీసర్! ఆ నకిలీ నోట్ల విషయం తేలే వరకు నేను క్యాష్ కౌంటర్‌లో కూచోలేను. స్థిమితంగా ఉండలేను"

మేనేజర్ తల పట్టుకున్నాడు. శర్మ పట్టుదల అతనికి బాగా తెలుసు. వ్యవహారం చాలా వరకు వెళ్ళేలా ఉందని అర్థమైంది. ఏం చేయాలో పాలుపోలేదు. వెంటనే ఓ నిర్ణయానికి వచ్చాడు.

శర్మ రెండు చేతులూ పట్టుకున్నాడు.

"శర్మగారూ! మొదటిసారి బుద్ధి తక్కువై ఆ షంషేర్‌కు భయపడి తప్పుచేశా. నాకు ఇరవైనాలుగు గంటలు టైమ్ ఇవ్వు.

అంతా సెట్‌రైట్ చేస్తా. విషయం పోలీసులవరకు వెళ్తే నా భవిష్యత్తు అంధకారం అవుతుంది. నా కూతురి పెళ్ళిపెట్టుకున్నాను".

శర్మ ఒక్క క్షణం ఆలోచించి అన్నాడు.

"సార్! మీమీద నాకు కోపంలేదు. మన బ్యాంకులో తప్పు జరక్కూడదు. మనల్ని నమ్మిన ఖాతాదారులను మోసం చేయకూడదు. మాతృ సంస్థ స్తన్యంమీద పాదాలతో తన్నకూడదు. వెంటనే ఆ నకిలీ నోట్ల బదులు అసలు నోట్లు చేర్చండి. మరోసారి నేరస్థులతో చేతులు కలపకండి" చెప్పి బయటకు వచ్చాడు శర్మ.

శర్మ వెళ్ళగానే మేనేజర్ ఒక్కక్షణం రిలాక్స్ ఫీలై వెంటనే ఫోన్ చేశాడు. షంషేర్‌కు జరిగిందంతా చెప్పాడు.

షంషేర్ మిగతా విషయాలు తాను చూసుకుంటానని చెప్పాడు.



★ ★ ★

శర్మ ఇంటికి వెళ్ళేసరికి ఇల్లంతా చిందరవందరంగా వుంది. టీవీ పగిలిపోయింది. కిటికీ అద్దాలు ముక్కలయ్యాయి. బబ్లూకు ఇష్టమైన పెంపుడు పిల్లి రక్తపు మడుగులో వుంది. శర్మ భార్య భయంతో వణికిపోతోంది.

"ఏమైంది? " శర్మ భార్యను అడిగాడు. అతనికి ఇదంతా అయోమయంగా వుంది.

"ఎవరో షంషేరట రౌడీలతో వచ్చాడు. ఇల్లంతా చిందరవందర చేశాడు. సర్వనాశనం చేశాడు.

"ఎందుకు? " అతనికి కొద్దికొద్దిగా అర్థమవుతూ ఉంది.

అప్పుడే ఆ ఇంట్లో ఫోన్ మోగింది. శర్మ రిసీవర్ ఎత్తి "హలో" అన్నాడు.

"హ..లో..వ్. శర్మాజీ కైసేహై మైరీక్‌హు. ఇల్లంతా ఎలా వుంది? ఇల్లు పీకి పందిరి వేయడం అంటారు చూడు అలా వుంది. ఇది జస్ట్ శాంపిల్ మాత్రమే మెయిన్ షో తర్వాత"

"ఏయ్ ఎవర్నువ్వు? ఇంట్లో మగాళ్ళు లేని టైంలో దౌర్జన్యం చేయడమే మగతనమా? "

"అబ్బ! పోనీ ఇప్పుడొచ్చి నీ ఇంటిని పీకి పందిరి వేయనా హలోవ్ నా జోలికి రావద్దు వస్తే ఖతం అవుతావ్. మర్యాదగా నీ పని నువ్వు చేసుకో"

"చూడు షంషీర్! ఇది పద్ధతికాదు" శర్మ అన్నాడు.

"ముందు నీ లిమిట్‌లో నువ్వుండు సంఝే"

"షంషీర్! నేనిప్పుడే నా ఇంటిమీద దౌర్జన్యం చేసినందుకు పోలీసు కంప్లయింట్ ఇస్తాను"

"సరే అలాగే ఇవ్వు" విట్నెస్ కావాలా చెప్పు. నా మనుష్యులను పంపిస్తాను"

"యూ బ్లడీ ఇప్పుడే నీమీద కంప్లయింట్ ఇస్తాను" అని ఫోన్ పెట్టేశాడు శర్మ

అప్పుడే అనిమిష ఇంటికి వచ్చింది. వస్తూనే అక్కడి పరిస్థితి చూసి బెదిరిపోయింది. బబ్లు భయంతో ఓ మూలన ఉండిపోయాడు.

"ఏంటి నాన్నగారూ! ఏమిటిదంతా? " అనిమిష భయంగా అడిగింది.

"దౌర్జన్యం. ఆ షంషేర్ చేసిన దౌర్జన్యం దొంగనోట్ల విషయం నేను ఎక్కడ బయట పెడతానోనని ఇలా మనల్ని బెదిరిస్తున్నాడు. నేనిప్పుడే వాడిపని చెబుతాను. పోలీస్ స్టేషన్‌కు వెళ్ళి కంప్లయింట్ ఇచ్చి

వస్తాను" చెప్పులు వేసుకుంటూ అన్నాడు శర్మ "వద్దు నాన్నగారూ! అయ్యిందేదో అయ్యింది. ఆ గూండాలతో మనకు గొడవే మిటి? " వారించింది అనిమిష.

"నీకు తెలియదమ్మా మనం ఊర్కుండి పోతే ఇంకా రెచ్చిపోతారు. అయినా మన మీద దౌర్జన్యం చేసిన వ్యక్తిని ఎలా వదిలి పెడతాం అదీగాక, కోటి రూపాయల నకిలీ నోట్ల నేరం"

"పోనీయండి"

"అదే వద్దు అనిమిషా! ఆ భయం ఆ నిర్లి ప్తత వద్దు" అంటూ పోలీస్ స్టేషన్‌కు బయ ల్దేరుతుండగా మళ్ళీ ఫోన్ మోగింది.

మళ్ళీ ఆ షంషీర్ గాడి నుంచే అయివుం టుంది అనుకుంటూ తాపీగా రిసీవర్ ఎత్తి 'హలో' అన్నాడు.

"శర్మగారూ! నేను మేనేజర్‌ని. బ్యాంకులోనే ఉన్నాను. నేను ఆపదలో ఉన్నాను. వెంటనే వచ్చేయండి" ఆ తర్వాత ఫోన్ కట్ అయింది.

'అమ్మా అనిమిషా! మేనేజర్‌గారు ఏదో ఆపదలో ఉన్నట్టున్నారు. నేను బ్యాంకుకు వెళ్ళొస్తా" అంటూ బయటకు నడిచాడు.

★ ★ ★

బ్యాంకు ముందు ఆటో ఆగింది. శర్మ ఆటో దిగి కంగారుగా లోపలికి పరుగెత్తాడు. సెంట్రీ అలానే చూస్తుండిపోయాడు. అప్పుడు టైం రాత్రి ఎనిమిది దాటింది.

★ ★ ★

శర్మ బ్యాంకు లోపలికి అడుగుపెట్టేసరికి అంతా నిశ్శబ్దంగా ఉంది. చీకటిగా ఉంది. మేనేజర్ క్యాబిన్‌లో కూడా లైటు లేదు. ఒక్క క్షణం అయోమయంగా అనిపించింది శర్మకు, తను పొరపడ్డాడా?

సరిగ్గా అప్పుడు వినిపించిందా మూలుగు.

"సార్! శర్మ తడుముకుంటూ మేనేజర్ క్యాబిన్ తలుపు తోశాడు. ఎవరో లోపల నుంచి తెరిచినట్టు తెరుచుకుందా క్యాబిన్.

అతనికి బ్యాంకు కొత్త కాదు. ఎక్కడ స్విచ్ బోర్డు ఉంటుందో తెలుసు.

మెల్లగా తడుముకుంటూ స్విచ్ బోర్డు దగ్గరికి వెళ్ళి స్విచ్ వేశాడు. ఆ క్యాబిన్ అంతా వెలుతురు పరుచుకుంది.

ఆ వెలుతురులో అతనికో దృశ్యం కనిపిం చింది. అతని ఒంట్లో చిన్న జలదరింపు. మేనేజర్ రక్తపు మడుగులో ఉన్నాడు. అతని గుండెలో కత్తి దిగబడి ఉంది. చిన్న మూలుగు. ఇంకా అతను కొన ప్రాణాలతో ఉన్నాడు.

"సార్! "అంటూ మేనేజర్ దగ్గరికి వెళ్ళాడు. మేనేజర్ ఏదో చెప్పబోయాడు. బహుశ తను చేసిన పొరపాటును సరిదిద్దు కొని తన తప్పును ప్రక్షాళన చేసుకోవాలని అనుకున్నాడేమో!

కానీ అతనికా అవకాశం లేకుండాపో యింది. శర్మ అక్కడ ఓ పొరపాటు చేశాడు. గుండెలో దిగబడిన కత్తిని లాగాడు. రక్తం చివ్వున చిమ్మింది. సరిగ్గా అప్పుడే ఎవరో క్యాబిన్ డోర్ క్లోజ్ చేశారు.

శర్మ సిక్స్‌త్ సెన్స్ ప్రమాదాన్ని పసిగ ట్టింది. అప్పటికే బ్యాంకులో వున్న అలారం అదేపనిగా మోగడం మొదలుపెట్టింది.

జనం ఎక్కడి వాళ్ళక్కడ నిలబడిపో యారు. సెంట్రీ ఈలోగా పోలీసులకు ఫోన్ చేశాడు.

★ ★ ★

శర్మ నిస్త్రాణంగా కుర్చీలో కూచుండిపో యాడు. అతని శరీరమే కాదు. మెదడు మొద్దుబారింది. అతను ఊహించని ఊహా తీత సంఘటన.

"చెప్పండి మిస్టర్ శర్మ. ఎందుకు బ్యాంకు మేనేజర్‌ని హత్య చేశారు? " ఇన్‌స్పెక్టర్ అడుగుతున్నాడు.

రెండు చేతులతో కణతలు నొక్కుకు న్నాడు. అతనికి తన నిర్దోషిత్వం ఎలా నిరూపించుకోవాలో అర్థం కాలేదు. ఆ అవ కాశం కూడా లేదని తెలుస్తోంది. ఇదంతా పథకం ప్రకారం జరిగిన కుట్ర అని తెలు

స్తూనే ఉంది.

"చెప్పండి శర్మా. మీ వయసును, మీ మీద బ్యాంకు సిబ్బందికి ఉన్న గౌరవాన్ని దృష్టిలో పెట్టుకొని మీతో సాఫ్ట్‌గా డీల్ చేస్తున్నాం. మీరు మర్యాదగా జరిగినదే మీతో చెప్పకపోతే మేము మా పద్ధతిలో ఇంటరాగేషన్ చేయవలసి ఉంటుంది." ఇన్‌స్పెక్టర్ సాధ్యమైనంత పొలయిట్‌గానే చెప్పినా అందులో హెచ్చరిక కటువుగానే వినిపిస్తోంది.

"ఇన్‌స్పెక్టర్‌గారూ! మీరు నమ్మినా, నమ్మకపోయినా నిజం నిజమే. బ్యాంకు మేనేజర్ ఫోన్ చేస్తేనే వచ్చాను. కావాలంటే సెంట్రీని అడగండి".

ఇన్‌స్పెక్టర్ సెంట్రీని పిలిపించాడు. సెంట్రీ ఓ పక్కన నిలబడ్డాడు. ఏం జరిగిందో చెప్పమని అడిగాడు ఇన్‌స్పెక్టర్ సెంట్రీని.

"శర్మసార్ హడావిడిగా, కోపంగా వచ్చి మేనేజర్‌గారు ఉన్నారా? అని అడిగాడు. నేను ఉన్నారని చెప్పాను. అంతే! విసురుగా లోపలకి వెళ్ళిపోయారు. లోపల్నుంచి అరుపులు వినిపిస్తున్నాయి. పెద్దవాళ్ళ గొడవ మనకెందుకులే అనుకున్నాను. ఇంతలో మేనేజర్‌గారు చావుకేక పెట్టారు. లోపలికి వెళ్ళి చూసేసరికి శర్మగారు మేనేజర్‌గారిని కత్తితో పొడుస్తున్నారు. భయంతో నోట మాటరాలేదు. అలారం మోగించాను. మీకు ఫోన్ చేశాను"

శర్మ సెంట్రీవైపు చూశాడు. అతను అబ్దం చెబుతున్నాడని అర్థమైంది.

"చూడు రామ్‌సింగ్! నువ్వెందుకో అబద్ధం చెబుతున్నావు నిజం చెప్పు" శర్మ అన్నాడు.

సెంట్రీ రామ్‌సింగ్. తల వంచుకొని "నేను నిజమే చెప్పాను సార్" అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ ఎదురుగా మౌళి ఉన్నాడు. అప్పటికే బ్యాంకు సిబ్బందిని ఇన్‌స్పెక్టర్ పిలిపించాడు.

"మీరు చెప్పండి. శర్మగారికి, మేనేజర్‌గారికి ఏమైనా గొడవలున్నాయా?"

మౌళి శర్మవైపు చూశాడు. శర్మ చూపులు అభావంగా వున్నాయి.

'మీరిక్కడ ఎవ్వరికీ భయపడవలసిన అవసరం లేదు. నిజం చెప్పండి" ఇన్‌స్పెక్టర్ అన్నాడు.

"నాకు తెలిసి పెద్ద గొడవలేమీ లేవు కానీ"

"కానీ" ఇన్‌స్పెక్టర్ రెట్టించి అడిగాడు.

"ఈ రెండు మూడు రోజులుగా శర్మగారు మేనేజర్‌గారి మీద ఏదో విషయంలో ఒత్తిడి తీసుకువస్తున్నట్టు అనిపించింది."

"శర్మగారు మేనేజర్ గారి మీద ఒత్తిడి తీసుకు వస్తున్నట్టు మీకెలా తెలుసు?" ఇన్‌స్పెక్టర్ అడిగాడు.

"శర్మగారు తరుచూ మేనేజర్ గారి క్యాబిన్‌లోకి వెళ్తున్నారీమధ్య. అదీగాక ఇవ్వాళ లంచ్ టైమ్‌లో మేనేజర్ గారు నన్ను పిలిచి చెప్పారు. శర్మగారు ఇలాంటి వారని అనుకోలేదు. ఆయనకు డబ్బు మీద వ్యామోహం పెరిగింది అని అన్నారు"

"ఐసీ" అని శర్మ వైపు తిరిగి

"చెప్పండి మీరేమంటారు?"

నిర్లిప్తంగా నవ్వి అన్నాడు శర్మ.

"ధర్మం మౌనంగా ఉండిపోయినప్పుడు, న్యాయం వినలేని స్థితిలో ఉన్నప్పుడు, చట్టం కేవలం ఓ అలంకారమే అయినప్పుడు ఏం చెప్పమంటారు?"

"అంటే మీరిప్పటికీ నిర్దోషినే అంటారు"

"దోషం చేయని నేను ఎప్పటికీ నిర్దోషినే. నా అంతరాత్మకు వ్యతిరేకంగా ఏ పనీ చేయను"

"సో మీ అంతరాత్మ మేనేజర్‌ని చంపమని చెప్పిందా?"

"ప్రాణం పోయినా సరే అబద్ధం చెప్పొద్దని చెప్పింది"

"అయామ్ సారీ మిస్టర్ శర్మా! ఆధారాలు స్పష్టంగా ఉన్నాయి. సాక్ష్యాలు కళ్లముందు కనిపిస్తున్నాయి. హత్యకు మోటివ్ డబ్బే

అని తెలుస్తోంది" అని మౌళి వైపు తిరిగి "మీ బ్యాంకులో క్యాష్ డిటైల్స్ మీకు తెలుసా? "

తెలుసన్నట్టు తలూపాడు మౌళి.

"బ్యాంకులో డబ్బు ఏమైనా పోయిందా? "

"చెక్ చేస్తే తప్ప చెప్పలేము సార్" చెప్పాడు మౌళి.

"కమాన్ చెక్ చేయండి" చెప్పాడు ఇన్స్పెక్టర్.

★ ★ ★

"కోటి రూపాయల తేడా వస్తోంది సార్"

"అంత పెద్ద మొత్తమా? అంత పెద్ద మొత్తం మీ దగ్గర ఉంటుందా? "

"ఓ పార్టీ పెద్ద మొత్తంలో డ్రా చేయడం కోసం ముందే చెప్పి పెట్టారు. అదీగాక, మాది హెడ్డాఫీసు. రోజూ లక్షల్లో విత్‌డ్రాయల్స్ ఉంటాయి"

"ఐసీ" అని ఇన్‌స్పెక్టర్ శర్మ వైపు చూసి "ఆ కోటి రూపాయలు ఎక్కడికి తరలించారు? " అని అడిగాడు.

శర్మకు అర్థమైంది. ఇది వాదనలతో కంఠశోషతో తేలే విషయం కాదు.

"ఇన్‌స్పెక్టర్ నన్ను అరెస్ట్ చేయండి" అన్నాడు శర్మ.

★ ★ ★

లాకప్‌లో ఉన్న తండ్రిని చూసి తల్లడిల్లిపోయింది అనిమిష.

"ఏమిటి నాన్నా ఇదంతా? మనమేం పాపం చేశామని? " ఏడుస్తోంది అనిమిష.

"డోంట్ క్రయ్ మైడియర్ బేబీ! ఇదంతా ఆ షంషీర్ ఆడిస్తోన్న నాటకం"

"మన ఇంటిమీద అతను దాడి చేసిన విషయం పోలీసులకు చెప్పకపోయారా? "

"ఇప్పుడు పోలీసులు ఏ విషయాన్నీ నమ్మే పరిస్థితిలో లేరు. సాక్ష్యాలు వాళ్ళకు అనుగుణంగా, పకడ్బందీగా ఉన్నాయి. మనమిప్పుడు ఏం చెప్పినా నమ్మరు"

"ఇప్పుడేం చేద్దాం డాడీ? " అడిగింది అనిమిష.

"కాలమే కొన్ని సమస్యలను పరిష్కరిస్తుంది. వివేకమే అన్ని సమస్యలకు పరిష్కారం చూపిస్తుంది. ధర్మం గెలుస్తుంది. నువ్వేం కంగారు పడకు. అమ్మను ఓదార్చు తమ్ముడు జాగ్రత్త.

నువ్వేమీ డీలా పడకు నీ డాడీకి ఏమీ కాదు" ధైర్యం చెప్పాడు శర్మ.

తండ్రిని ఓదార్చాలని వచ్చిన ఆమె ఓదార్పు పొందుతోంది.

అనిమిషకు ఓ లాయర్ అడ్రస్ ఇచ్చి కలవమని చెప్పాడు శర్మ.

అనిమిష ఆ లాయర్ అడ్రస్ తీసుకొని వెళ్ళిపోయింది.

★ ★ ★

అనిమిష వెళ్ళిన అరగంట తర్వాత షంషీర్ వచ్చాడు.

"హలో శర్మ సాబ్ బావున్నారా? బాగానే ఉంటారు. మీరిప్పుడు గవర్నమెంట్ గెస్ట్ కదా." క్రూరంగా నవ్వుతూ అన్నాడు షంషీర్.

శర్మ నవ్వాడు. ఆ నవ్వులో రకరకాల అర్థాలు. షంషీర్ విస్తుపోయి చూశాడు. భయంతో వణికి పోతాడని అనుకున్నాడు.

"ఏంటీ శర్మ సాబ్ మీ గుండె ఉక్కులా ఉందే? "

"నిజాయితీని నమ్మినవాడి గుండె ఉక్కులానే ఉంటుంది"

"అబ్బా. బ్యాంకు నుంచి కోటి రూపాయలు దొంగిలించి వ్యక్తిని హత్య చేసినందుకు ఉరిశిక్ష ఖాయం" నవ్వి చెప్పాడు షంషీర్.

"కోర్టు అంత గుడ్డిగా శిక్ష విధించదు. మేనేజర్‌ని నేను చంపానని నువ్వు పోలీసులకు చెప్పినంత మాత్రాన చట్టం నమ్మదు".

"ఆధారాలు చూపినా నమ్మదా? "

మన అభివృద్ధికి బద్ధవిరోధి "అసహనం" – డా॥ సర్వేపల్లి

"ఎక్కడో ఓ లింకు ఉంటుంది. ఆ లింకు తెగితే మిగతా లింకులన్నీ తెగిపోతాయి."

"అంటే" మొహాన్ని క్వశ్చన్ మార్క్‌లా పెట్టి అడిగాడు షంషీర్.

"బ్యాంకులో పోయిన కోటి రూపాయలు నేను దొంగతనం చేయలేదని ప్రూవ్ చేస్తే అన్ని లింకులూ తెగిపోతాయి"

"అబ్బా ఎలా ప్రూవ్ చేస్తావు? " షంషీర్ అడిగాడు.

"ఎలా అంటే బ్యాంకులో దొంగిలించబడ్డాయని అదే నేను దొంగతనం చేశానని చెప్పిన కోటి రూపాయల వివరాలు నేను బయట పెడితే అన్ని నిజాలు బయటకు వస్తాయి"

ఒక్క క్షణం ఉలిక్కిపడ్డాడు షంషేర్. అతని మెదడు బ్లాంక్‌గా మారింది.

షాక్ తిన్నాడు షంషేర్. "బ్యాంకులో నకిలీ నోట్ల బదులు అసలు నోట్లు నువ్వు మేనేజర్ సాయంతో తస్కరించావు. నాది కంప్యూటర్ బ్రెయిన్. ఆ నెంబర్లన్నీ తెలుసు. అందులో చాలా వరకు కొత్త నోట్లే. కళ్ళు మూసుకొని అయినా సిరీస్ చెప్పగలను"

షంషీర్ మొహం ఎర్రబడింది. శర్మ లాకప్‌లో కాకుండా బయట వుంటే ఈ పాటికి చంపేసేవాడే కానీ లాకప్‌లో ఉన్నాడు. ఆ స్టేషన్ ఇన్‌స్పెక్టర్ డబ్బు మొహం మీద కొట్టగానే లొంగే ఘటంలా కనిపించటం లేదు.

"షంషీర్ మరో విషయం నీ నకిలీ నోట్ల నంబర్లు కూడా తెలుసు. ఆ నకిలీ నోట్ల కుంభకోణం బయటకు వచ్చిందంటే నీ అడ్రస్ వుండదు. స్టాంపుల కుంభకోణంలో మంత్రులు చిక్కుకున్నారు."

షంషీర్ పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

"లెక్కపెట్టుకో షంషీర్. రోజులు లెక్కపెట్టుకో. నిజం భూమిని చీల్చుకొని మహావృక్షంలా బయటకు వస్తుంది"

షంషీర్ మొహం ఇంకా మరింతగా ఎర్రబడింది. వెంటనే అక్కడనుంచి విసవిసా బయటకు వెళ్ళిపోయాడు.

లాయర్ తనకున్న పలుకుబడిని ఉపయోగించి ఆఘమేఘాల మీద శర్మకు బెయిల్ సంపాదించాడు. స్టేషన్ ఇన్‌స్పెక్టర్ నిజాయితీపరుడు. అతను శర్మ నిజాయితీపరుడని నమ్ముతున్నాడు.

★ ★ ★

శర్మకు నిద్ర రావడం లేదు. రెండ్రోజులుగా భార్య నిద్రాహారాలు మానివేసింది. ఆమె అయోమయంలో ఉంది. భర్తకు జరిగిన అవమానం భరించలేక పోతోంది.

ఎప్పుడూ హుషారుగా ఉండే బబ్లూలో కూడా భయం మొదలైంది. అనిమిష రెండ్రోజులుగా డిపార్ట్‌మెంట్ స్టోర్స్‌కు వెళ్ళడం లేదు.

ఎప్పుడే క్షణం ఏం జరుగుతుందోనన్న భయం. తండ్రిని అంటిపెట్టుకునే ఉంటుంది.

రాత్రి పదకొండు దాటింది.

శర్మ అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. భార్య నేలమీద అలానే పడుకుండిపోయింది.

బబ్లూ సోఫాలో నిద్రపోయాడు. అనిమిష తండ్రినే గమనిస్తోంది. మెల్లిగా తండ్రి దగ్గరికి వచ్చింది.

శర్మ డైరీలో ఏదో రాస్తున్నాడు.

"నాన్నగారూ!" పిలిచింది అనిమిష.

రాయడం ఆపి కూతురి వైపు తిరిగి "ఏమిటమ్మా నిద్ర రావడం లేదా? " అని అడిగాడు.

"నిద్ర మీక్కూడా రావడం లేదు కదా నాన్నగారూ"

"అవునమ్మా నిద్ర రావడం లేదు. ఈ మనుష్యుల్లోని స్వార్థం చూస్తుంటే నిద్ర రావడం లేదు, ఈ మనుష్యుల్లో అవకాశవాదం చూస్తొంటే నిద్ర రావడంలేదు. ఈ మనుష్యుల్లోని కుళ్ళు, కుతంత్రాలు, నేరపూరిత మనస్తత్వాలు చూస్తుంటే నిద్ర రావడం లేదు"

"నాన్నగారూ! ఈ ప్రపంచం గురించి ఆలోచించడం మాని, మీకోసం మిమ్మల్నే

నమ్ముకున్న మాకోసం ఆలోచించండి" అంది. అలా అంటున్నప్పుడు ఆమె గొంతు వణికింది.

"ఇలా రారా" కూతుర్ని దగ్గరకు పిలిచాడు. కూతురి తలమీద చేయి వేసి నిమిరాడు.

అతనో నిర్ణయానికి వచ్చాడు. అనిమిష తండ్రి వంకే చూస్తోంది.

"అన్ని విషయాలకు గుండె దిటవు చేసుకోవాలమ్మా. మనం మన గురించేకాదు. మనచుట్టూ వున్న వాళ్ళ గురించి కూడ ఆలోచించాలి. మనం సంఘజీవులం. ఈ ప్రపంచంలోనే వున్నాం. అనాగరిక సమాజంలో లేము"

*భయం నీడ కన్నా ప్రమాదకరమైనది. మనం ఎటువెళ్తే అటువస్తుంది. ఈ ప్రపంచంలో బ్రతకాలంటే ధైర్యమనే అస్త్రం ఎప్పుడూ నా దగ్గరే వుండాలి. నేను చేసే ఈ పోరాటంలో నాకేమైనా సరే నువ్వు బెదరవద్దు."*

"నాన్నగారూ! మీరేం మాట్లాడుతున్నారు? మీరలా మాట్లాడితే నాకు భయంగా వుంది"

"భయం! ఆ భయమే వద్దంటున్నాను. నేను దోషిగా ఈ ప్రపంచం ముందు నిలబడలేను. నేనే నిర్దోషినని ఈ ప్రపంచం నమ్మాలి. ఈ పోరాటంలో నాకేమైనా అయితే ఢిల్లీలో భీష్మాచార్య అని నా ఫ్రెండున్నాడు. వాడు నీకు సాయం చేస్తాడు"

"ఇప్పుడవన్నీ ఎందుకు నాన్నగారూ!"

"ఇప్పుడే చెప్పనీయమ్మా! ఇదిగో నా డైరీ. ఇది భద్రం చేయరా! నాన్నగారూ! నేనేం కావాలి డాక్టర్‌నా, ఇంజనీర్‌నా? అని అడిగే దానివి గుర్తుందా? "

గుర్తుందన్నట్టు తలూపింది అనిమిష.

"అప్పుడు నీ యిష్టం తల్లీ అనేవాడిని. నిజానికి ఈ సమాజాన్ని అద్దంలా చూపించే జర్నలిజం అంటే నాకెంతో యిష్టం. నీ భయపడే మనస్తత్వం, గొడవలెందుకు అని సర్దుకుపోయే తత్వం చూసి నీ యిష్టానికి వదిలేశాను. ఇప్పుడనిపిస్తోంది నా కూతుర్ని జర్నలిస్ట్‌ని చేసి ఉంటే బావుండేదని"

"నాన్నగారూ!" తండ్రి వంక విభ్రాంతిగా చూసింది. తనకు తెలిసి ఇంత ఇదిగా తండ్రి ఎప్పుడూ మాట్లాడలేదు. "అక్షరాల ఖడ్గంతో అవినీతిని దునుమాడే కలం నీ చేతిలో ఆయుధంగా వుండాలమ్మా. ఈ సమాజానికి నా కూతురు అక్షరాస్త్రంతో శస్త్ర చికిత్స చేస్తుందని చెప్పుకోవాలన్న ఆశయం నాది. నిన్నెప్పటికైనా నేను అలా చూడగలనా? " అడిగాడు కూతుర్ని.

"తప్పకుండా నాన్నా తప్పకుండా" ఉద్వేగంతో చెప్పింది అనిమిష.

గోడ గడియారం పన్నెండు గంటలు కొట్టింది.

"ఒరే అనూ నువ్వెళ్ళి పడుకోరా. చాలా రాత్రయింది" అన్నాడు శర్మ.

తండ్రితో ఇంకా ఏదో చెప్పాలని, మాట్లాడాలని ఉంది. కానీ తండ్రి మాటలతో తన గది వైపు నడిచింది అనిమిష.



షంషేర్ కళ్ళు చింతనిప్పుల్లా ఉన్నాయి. ఎదురుగా టీపాయి మీద విస్కీగ్లాసు. ఆ పక్కనే చిప్స్ వున్నాయి. అతని ఎదురుగా అతని అనుచరులు చేతులు కట్టుకొని వున్నారు. టీపాయి మీద విస్కీగ్లాసు పక్కనే సెల్‌ఫోన్ వుంది. మాటి మాటికి ఆ సెల్‌ఫోన్ వంక చూస్తున్నాడు.

ఆ సెల్‌ఫోన్ నంబర్ ఒక్క దాదామియాకు తప్ప మరెవ్వరికీ తెలియదు.

అరగంట నుంచి అసహనంగా వున్నాడు. పోలీస్ స్టేషన్ నుంచి వచ్చాక దాదామియాను కంటాక్ట్ చేశాడు షంషేర్. అతనికి శర్మమీద పీకల్దాక కోపం వుంది. మొన్నటికి మొన్న ఇన్‌స్పెక్టర్ చేయి నరికాడు. శర్మను ఏంచేయాలో తెలియడంలేదు. అతడిని అంత తక్కువగా అంచనా వేయలేకపోతున్నాడు. అదే విషయాన్ని దాదామియాతో

చెబితే తనే ఫోన్‌చేసి శర్మను ఏంచేయాలో చెబుతానని చెప్పాడు.

విస్కీగ్లాసును ఎత్తి పెదవుల దగ్గర పెట్టు కున్నాడు. అసహనంగా వుంది. చికాగ్గా వుంది. కోపంగా వుంది. కసిగానూ వుంది. నోటిదగ్గర వున్న విస్కీ గ్లాసును నేలకేసి కొట్టాడు. గ్లాసు భళ్ళున శబ్దం చేస్తూ పగి లిపోయింది. సరిగ్గా అప్పుడు రింగయింది సెల్‌ఫోన్.

వెంటనే తన ఎదురుగా వున్న అనుచరు లకు సైగచేసి బయటకు వెళ్ళమన్నాడు.

వాళ్ళు వెళ్లాక ఓకె బటన్ ప్రెస్‌చేసి "చెప్పండి దాదామియాసాబ్! ఆ శర్మగాడిని ఏంచేయమంటారు" ఉపోద్ఘాతాలు లేకుండా డైరెక్టుగా అడిగేశాడు.

"చంపేసేయ్ మార్‌డాలో. మన దారికి అడ్డురావద్దని చివరిసారిగా చెప్పిచూడు. లేదంటే ఫినిష్"

"అచ్ఛా సాబ్. నేను ఈ మాటకోసమే ఎదురుచూస్తున్నాను. ఇప్పుడే పనిపూ ర్తిచేస్తా" షంషేర్ అన్నాడు.

"ఇప్పుడా వద్దు రేపుపొద్దున పనిపూర్తి చేయ్. ఈ రాత్రంతా అతను మన గురించి భయపడుతూ వుండాలిగా"

"ఠీక్‌హై దాదామియా సాబ్. మీరు చెప్పినట్టే చేస్తాను"

"వెరీగుడ్. ఒక్క విషయం షంషేర్. శత్రువును ఏమాత్రం నిర్లక్ష్యం చేయకూ డదు. రిమెంబర్" అవతలవైపు లైన్ కట్ అయింది.

షంషేర్ మరోసారి తనదైన వికృతమైన నవ్వు నవ్వి విస్కీ సీసాను నోటిదగ్గర పెట్టు కున్నాడు. ఏమీ కలుపుకోకుండానే గొంతు లోకి ఒంపుకున్నాడు. గొంతు మండినట్ట యింది. అయినా ఆ మంట అతనికి ఆనం దంగానే వుంది.

★ ★ ★

"నాన్నగారూ! మీరు రెడీనా? నేను రెడీ" అంటూ హాలులోకి వచ్చిన అనిమిష ఒక్క క్షణం కలవర పడిపోయింది. తనెంత తొందర పడింది. ఆమె తన తప్పు తెలుసు కునేలోగా శర్మ అన్నాడు.

"ఏమిటమ్మా అంత కంగారు. అలవాటు ప్రకారం నువ్వు మాట్లాడావు. నేను సస్పెండ్ అయిన విషయం మరిచిపో యావు"

"సారీ నాన్నగారూ" అంది నొచ్చుకుంటు న్నట్టు అనిమిష.

"ఇందులో సారీ ప్రసక్తి ఏముంది? నువ్వేమీ తప్పుచేయలేదు. పద నేనే మీ స్టోర్స్ వరకూ వచ్చి నిన్ను దిగబెడతాను".

"అయ్యయ్యో వద్దు నాన్నగారూ! నేను బస్సులోనో ఆటోలోనో వెళ్తాను"

"అదేమిటమ్మా. నేను బ్యాంకుకు వెళ్ళకూ డదుగానీ, నిన్ను డ్రాప్ చేయకూడదని ఎవరూ ఆర్డర్ వేయలేదే. ఏమిటమ్మా. సస్పెండైన తండ్రి నీతో వస్తే నామోషీ అనుకున్నావా? "

"అయ్యయ్యో అదేమిటి నాన్నగారూ. అలా అన్నారు. మీకు శ్రమ ఎందుకని అన్నాను. మీ మనసు నొప్పిస్తే క్షమిం చండి" అంది మనస్ఫూర్తిగా అనిమిష.

"అదేంలేదు. పద. బబ్లూని కూడా స్కూల్ దగ్గర దిగబెట్టి నిన్ను స్టోర్స్ దగ్గర డ్రాప్ చేస్తాను. అలా అయినా కాసేపు అన్నీ మరిచిపోగలుగుతాను" అన్నాడు శర్మ.

"సరే నాన్నగారూ! మీ ఇష్టం మీరెలా మంచిదనితోస్తే అలా చేయండి" అంది అని మిష.

శర్మ బండి బయటకు తీశాడు. బబ్లూని ముందు కూచోబెట్టుకున్నాడు.

★ ★ ★

"బబ్లూ ఈమధ్య డిటెక్టివ్ నవలలు చద వడం లేదేమిటి? " కొడుకుని అడిగాడు డ్రైవ్ చేస్తూ శర్మ.

బబ్లూ మాట్లాడలేదు. తండ్రిని పోలీ సులు అరెస్టుచేయడం చూసి షాకయ్యాడు.

ఆ షాక్ నుంచి అతనింకా కోలుకోలేదు.

"మాట్లాడవేం బబ్లూ. ఈరోజు నుంచి నేను కూడ డిటెక్టివ్ నవలలు చదువుతాను. నీకీ విషయం తెలుసా? చిన్నప్పుడు నేను విపరీతంగా డిటెక్టివ్ నవలలు చదివేవాడిని" కొడుకులోని డల్‌నెస్‌ని పోగొట్టడానికి ప్రయత్నిస్తున్నాడు శర్మ.

"జాగ్రత్తగా వెళ్ళండి నాన్నగారూ! పరధ్యానంగా డ్రైవ్ చేయకండి" అంటూ వెయ్యి జాగ్రత్తలు చెప్పింది తండ్రికి.

శర్మ నవ్వి అన్నాడు "చిన్నప్పుడు నువ్వు స్కూల్‌కు వెళ్ళేప్పుడు నీకు జాగ్రత్తలు చెప్పేవాడిని. ఇప్పుడు నువ్వు నాకు చెబుతున్నావా తల్లీ"

"అదేంలేదు నాన్నగారూ! ఏదో మనస్సు ఉండబట్టలేక"

"సరే పెందరాళే వచ్చేయ్. నేను లాయర్ గారిని కలిసి ఇంటికి వెళ్తాను బై" చెప్పి శర్మ వెళ్ళిపోయాడు.

★ ★ ★

శర్మ డ్రైవ్ చేస్తూనే గమనిస్తున్నాడు. తన బండిని ఎవరో ఫాలో అవుతున్నారు. వెనక జీపు. ఆ జీపు ఎవరిదో అతనికి తెలియదు. అతని మస్తిష్కంలో ఏదో అనుమానపు ఛాయ.

శర్మ బండిని రైట్ టర్న్‌కు తిప్పాడు. జీపు కూడ రైట్ టర్న్ తిరిగింది. శర్మ కన్‌ఫర్మ్ చేసుకున్నాడు. ఆ జీపు ఖచ్చితంగా తనని ఫాలో అవుతుంది. తను కేర్‌ఫుల్‌గా ఉండాలి. లేకపోతే అతను అలా ఆలోచిస్తూ వుండగానే జీపు వేగం పెరిగింది.

ఈ ఆలోచనలో శర్మ ఒక పొరపాటు చేశాడు. ఎవ్వరూలేని నిర్మానుష్య ప్రాంతానికి రావడమే అతను చేసిన పొరపాటు. ఆ పొరపాటు సరిదిద్దుకునేలోగా జరగవలసిన అనర్థం జరగనే జరిగింది.

వేగంగా వచ్చిన జీపు శర్మ వెహికిల్‌ని ఢీకొట్టింది. శర్మ వెహికిల్ చాలా దూరం వెళ్ళి పడింది. శర్మ వేసిన కేక ఆ నిర్మానుష్య ప్రాంతంలో ప్రతిధ్వనించింది.

అనిమిష సిటీ హాస్పిటల్‌లోకి కంగారుగా పరుగెత్తుకు వచ్చింది. ఎవరో ఓ అజ్ఞాత వ్యక్తి ఫోన్‌చేసి మీ నాన్నకు యాక్సిడెంట్ అయింది. సిటీహాస్పిటల్‌లో వున్నారని చెప్పారు.

రిసెప్షన్ దగ్గరికి వెళ్ళి ఆదుర్దాగా అడిగింది. రిసెప్షనిస్ట్ ఎడమచేతివైపు చూపించింది. అనిమిష అటువైపు పరుగెత్తింది.

రెండో వార్డులో మంచంమీద తలమీద బ్యాండెజ్‌తో కనిపించాడు తండ్రి.

ఆమెకు దుఃఖం ఆగలేదు. కొద్దిసేపటిక్రితమే తనను డ్రాప్‌చేసి వెళ్ళిన తండ్రి ఇంతలోనే ఇలా అవడం ఆమె జీర్ణించుకోలేకపోతోంది.

తండ్రికి డ్రెస్సింగ్ చేసి నర్స్ వెళ్ళిపోయింది. డాక్టర్ ఇంజక్షన్ చేసి వెళ్ళబోతుంటే వణుకుతున్న గొంతుతో అడిగింది.

"డాక్టర్‌గారూ మా నాన్నగారికి ఏమీకాదుగా"

డాక్టర్ ఓసారి అనిమిష వైపుచూసి "పెద్ద సీరియస్ ఏమీ కాదు. ఎవరో ఓ అజ్ఞాత వ్యక్తి ఇక్కడ జాయిన్‌చేసివెళ్ళాడు. యాక్సిడెంట్ కేసులో పోలీసులకు ఇన్‌ఫామ్ చేయాలి. మానవతా దృష్ట్యా పెద్ద గాయాలు ఏమీ కానందున ఫార్ములాస్ పాటించలేదు" చెప్పాడు.

"థ్యాంక్యూ డాక్టర్" అంది. రెండు చేతులు జోడించి.

"ఇట్సాల్‌రైట్ సాయంత్రానికల్లా డిశ్చార్జి చేస్తాం ఈవినింగ్ ఇంటికి తీసుకువెళ్ళొచ్చు" చెప్పాడు డాక్టర్.

అలానే అన్నట్టు తలూపింది అనిమిష. తండ్రిని హాస్పిటల్‌లో చేర్పించిన వ్యక్తికి మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకుంది. అలాగే తనకు ఫోన్‌చేసి ఇన్ఫర్మేషన్ ఇచ్చిన వ్యక్తికి కూడా!

ఆ ఇద్దరూ ఒక్కరేనని ఆ ఇద్దరూ షంషేరేనని అతనే కావాలని తండ్రికి యాక్సిడెంట్

చేసి హాస్పిటల్‌లో చేర్పించి, తనకు ఫోన్‌చే శాడని తెలియదు అనిమిషకు.

★ ★ ★

అతి కష్టం మీద కళ్ళు తెరిచాడు శర్మ. ఎదురుగా కూతురు కనిపించింది. తలంతా బరువుగా అనిపించి తలమీద చేయివేసి ఉలిక్కిపడ్డాడు. తలమీద బ్యాండేజ్‌వుంది.

"నాకేమైంది? " స్వగతంగా గొణుక్కు న్నాడు శర్మ.

"మీరు పరధ్యానంగా డ్రైవ్ చేసినట్టు న్నారు. చిన్న యాక్సిడెంట్. ఎవరో మహా నుభావుడు హాస్పిటల్‌లో జాయిన్‌చేశారు" చెప్పింది అనిమిష.

మెల్లమెల్లగా గుర్తుకు రాసాగింది. తన వెహికిల్‌ని జీపులో ఎవరో వెంబడించడం వాళ్ళు కావాలని యాక్సిడెంట్ చేయడం మరి తనను కాపాడింది ఎవరు? అతనలా ఆలోచిస్తూ వుండగానే అనిమిష అంది తండ్రితో.

"నాన్నగారూ ఎక్కువగా ఇప్పుడేమీ ఆలో చించకండి. ప్రశాంతంగా నిద్రపొండి. డాక్ట ర్‌గారు సాయంత్రానికల్లా డిశ్చార్జి చేస్తాన న్నారు"

శర్మ మాత్రం ఆలోచించడం మానలేదు. సరిగ్గా అప్పుడే ఓ వ్యక్తి బొకేతో వచ్చాడు.

"శర్మగారంటే మీరేనా? " అడిగాడు ఆ వ్యక్తి. అవునన్నట్టు తలూపాడు శర్మ.

ఆ వ్యక్తి శర్మ చేతిలో బొకే ఓ ఉత్తరం పెట్టాడు.

"హాస్పిటల్ బయట ఓ వ్యక్తి వున్నాడు. ఇది మీకు ఇచ్చి రమ్మన్నాడు" చెప్పి వెళ్ళిపో యాడా వ్యక్తి.

అనిమిష అలానే చూస్తుండిపోయింది. శర్మ బొకేని మంచంపక్క వున్న టీపాయ్ మీద పెట్టి ఉత్తరం విప్పాడు.

"హలో ఈ శాంపిల్ ఎలా వుంది? త్వరగా కోలుకో మిస్టర్ శర్మా! మరో శాంపిల్‌కు ఎదురుచూడాలిగా. మర్యాదగా ఇప్పటికైనా కామ్‌గా పక్కకు తప్పుకో. మిగతా వ్యవహారం నేను చూసుకుంటాను. అన్నట్టు నీకు యాక్సిడెంట్ చేసింది, చేయిం చిందీ, హాస్పిటల్‌లో చేర్పించిందీ నేనే. వింటే బ్రతికిపోతావ్ అతితెలివికి పోతే చచ్చిపోతావ్! షంషేర్" అని ఉందా ఉత్తరంలో.

శర్మ టీపాయ్ మీద ఉన్న బొకేని కోపంగా గోడకేసి విసిరికొట్టాడు.

అనిమిష స్థాణువై నిలబడిపోయింది. తండ్రి చేతిలోని ఉత్తరం చదివేక ఆమె మెదడు మొద్దుబారిపోయింది.

★ ★ ★

తలమీద బ్యాండేజీతో వచ్చిన భర్తని చూసి హడలిపోయింది శర్మ భార్య. చిన్న యాక్సిడెంటేనని సర్దిచెప్పేసరికి తలప్రాణం తోకకు వచ్చినంత పనయింది.

అనిమిషకు చాలా కంగారుగా, భయం గానూ వుంది. తండ్రి స్థయిర్యాన్ని చూసి ఆమె మరింత ఆందోళనకు గురి అవు తోంది. తండ్రి మొండితనం తెలుసు. శత్రువు తెగింపు తనకూ తెలుసు.

★ ★ ★

అనిమిష తీవ్రంగా ఆలోచిస్తోంది. దిగులు భయంలాంటి భావాలు ఆమెను వెంటాడు తున్నాయి. ప్రశాంతంగా ఉన్న తమ కుటుంబంలో ఈ సంఘటన ఆమెకో పెనుతుఫాను అనిపిస్తోంది.

ఆమె సందిగ్ధావస్థలో ఉంది. తండ్రివైపు న్యాయం వుంది. నైతిక విలువల వాస్తవమూ ఉంది. అయినా తండ్రిని సమర్థించలేకపో తోంది. సగటు మధ్య తరగతి అమ్మాయిలా ఆలోచిస్తోంది. తనకు తాను, తన తల్లి, తండ్రి, తమ్ముడు కుటుంబం ముఖ్యం.

ఈ నీతులు వినడానికి బాగానే వుంటాయి. కానీ పాటించడానికి వాస్తవంగా

> *అసభ్యరీతిలో పొందిన విజయంకంటే, నీతిగా పొందిన అపజయం మేలు.*
>
> – ఆర్థర్ కార్‌వెల్

నిజాయితీ కోసం నిలబడి ప్రాణాలు ఇవ్వవలసిన పరిస్థితి వస్తే తట్టుకోవడం ఎవరి వల్ల అవుతుంది?

ఆమె ఆ దేవుడ్ని ఒక్కటే కోరుకుంది. మా కుటుంబం బాగుండాలి. అది స్వార్థమే కావచ్చు, కానీ తప్పదు. కుటుంబాన్ని బలియిచ్చి నీతికోసం ప్రాణాలు విడిచే త్యాగగుణం తనలో లేదు. విషాదాన్ని మిగిల్చే త్యాగం తనకు అక్కర్లేదు. అలా ఆలోచిస్తూనే నిద్రలోకి జారుకుంది అనిమిష.

★ ★ ★

షంషేర్ చుట్టూ వలయంలా అనుచరులు నిలబడి వున్నారు.

"ఎక్కడా తేడా లేకుండా పని ఫినిష్ చేశారుగా" అడిగాడు షంషేర్ అనుచరుల వైపు తిరిగి

'ఫర్‌ఫెక్ట్‌గా చేశాం! గ్యాస్ సిలిండర్ పేలి చనిపోయారనుకునేలా ప్లాన్ చేశాం. ఈ పాటికి ఇల్లంతా తగలబడి వుండొచ్చు" చెప్పాడు అనుచరుల్లో ఓ వ్యక్తి.

షంషేర్ పెదవుల మీద ఓ క్రూరమైన నవ్వు మెరిసింది. ఇప్పుడతనికి రిలాక్స్‌గా వుంది. ఈ శర్మ తన కంట్లో నలుసులా తయారయ్యాడు. అతడిని చంపటమొక్కటే మార్గం అని తోచింది. అదీకాకుండా శర్మ పత్రికాఫీసులకు వెళ్ళి నకిలీ నోట్ల కుంభకోణం గురించి పత్రికల వాళ్ళకు సమాచారం అందించే ప్రయత్నం చేస్తున్నట్టు తెలిసింది. అందుకే అతని కుటుంబాన్ని లేపేయాలని నిర్ణయించుకున్నాడు. యాక్సీడెంటల్‌గా ఉండేందుకు దౌర్జన్యంగా శర్మ యింట్లోకి ప్రవేశించి గ్యాస్ లీక్ చేసి యిల్లు తగలబడే ప్లాన్ చేశాడు. సరిగ్గా ఇది జరగడానికి గంట ముందు

"నాన్నగారూ! నేను డిపార్ట్‌మెంటల్ స్టోర్స్ వరకు వెళ్ళొస్తాను. నాకెందుకో మిమ్మల్ని వదిలివుండాలని అనిపించడం లేదు. అక్కడ జాబ్ మానేస్తాను. అదే విషయం వాళ్ళకు చెప్పి వస్తాను" చెప్పింది తండ్రితో అనిమిష.



## కుటుంబం ఎలా ఏర్పడుతుంది?

అవకాశం చిక్కినప్పుడల్లా తన చెణుకులతో పార్లమెంట్ సభ్యులకు కితకితలు పెట్టడం చర్చిల్ అలవాటు. ఓసారి గృహవసతి అంశంపై చర్చకు తెరతీస్తూ 'ప్రతికుటుంబానికీ తలదాచుకోవడానికి ఓ నీడకావాలి.. దానికోసం ఓ ఇల్లుకావాలి..' అంటూ ప్రసంగం మొదలెట్టాడు. తర్వాత '..అసలు కుటుంబం ఎక్కడ మొదలవుతుంది?..' అంటూ ప్రశ్నించి 'ఇంకెప్పుడు.. ఓ అబ్బాయి ఓ అమ్మాయితో ప్రేమలో పడ్డప్పుడే' అని తానే సమాధానం చెప్పాడు.

ఆ మాటలకు సభ్యులు నవ్వారు. అవకాశం చిక్కిందికదా అనిప్రత్యర్థులు పగలబడి నవ్వారు. కావాలనే ఈ చర్చను ఈ వైపు మళ్లించిన ఆయన 'అవును.. కుటుంబం ఏర్పడాలంటే ఇంతకుమించి ప్రత్యామ్నాయం ఏమీ లేదు.. ఇది నిజంగా నిజం.. ఇదికాక మీకేమన్నా తెలిస్తే చెప్పండి.' అన్నాడు కొంటెగా.

భలే.. ఇరకాటంలో పడేశాడ్రా నాయనా అనుకుని మౌనం వహించారు ప్రత్యర్థులు.

"ఈ మాత్రానికే ఉద్యోగం మానేయాలా? ఎలా జరగవలసి వుందో అలా జరుగుతుంది. నువ్వు ఎప్పటిలాగానే వెళ్తూ వుండు. రిజైన్ చేయొద్దు" చెప్పాడు శర్మ.

"వద్దు నాన్నగారూ! నేనేం చేయాలని అనుకుంటున్నానో వచ్చాక చెబుతా" అంటూ స్టోర్స్‌కు బయల్దేరింది.

అనిమిష వెళ్ళిన అరగంటకు ఆ యింటి ముందు ఓ జీపు ఆగింది. అందులో నుంచి చాలా మంది దృఢకాయులు దిగారు.

★ ★ ★

ఒకేసారి లోపలికి చొచ్చుకు వచ్చిన అగంతకులను చూసి షాకయ్యాడు శర్మ.

"ఎవరు మీరు? ఏం కావాలి? " కోపంగా అడిగాడు.

"నీ చావు కావాలి! నీ యిల్లు తగలబడి పోవడం కావాలి" చెబుతూనే ఒకడు వంట గదిలోకి వెళ్ళాడు.

శర్మ ఫోన్ దగ్గరికి వెళ్ళాడు. మరొకడు వచ్చి టెలిఫోన్ వైరు కత్తిరించాడు. ఇంకొకడు యింటి తలుపులు, కిటికీలు మూశాడు. గదిలో ఉన్న శర్మ భార్య భయంతో హాలులోకి వచ్చింది. బబ్లూ భయంతో వణికిపోయాడు. జ్వరంగా వుందని ఆరోజు స్కూలుకు వెళ్ళలేదు.

"ఏయ్ ఎవరు మీరంతా" శర్మలో ఆందోళన ఎక్కువైంది. వాళ్ళెవరో అతనికి అర్థమవుతూనే వుంది. వాళ్ళేం చేయబోతున్నరో అతనికి మెల్లమెల్లగా అర్థం కాసాగింది. అతను ఒక్కడు. వాళ్ళు చాలామంది. శారీరకంగా వాళ్ళు దృఢంగా వున్నారు.

కిచెన్‌లో వున్న గ్యాస్ సిలెండర్ కనెక్షన్ పీకి లీక్ చేశారు.

శర్మ వాళ్లను ఎదిరించే ప్రయత్నం చేసి విఫలమయ్యాడు. వాళ్లు గ్యాస్ లీక్ చేసి అన్ని తలుపులు, కిటికీలు మూసి బయటకు వచ్చారు. మెయిన్ బయట వుంది. బయటకు వచ్చే ముందు అన్ని స్విచ్‌లను ఆన్ చేసి, మెయిన్ ఆఫ్ చేశారు. బయటకు వచ్చి టైం చూడసాగారు.

శర్మ వెంటనే తలుపుల మీద దబదబ బాదసాగాడు. గ్యాస్ ఆ యింటిని పరుచుకుంటోంది. హాలు బయట ఉన్న వాళ్ళు టైం చూస్తున్నారు. శర్మ వెంటనే ఆ యింట్లో వున్న స్విచ్‌లు ఆఫ్ చేయడం మొదలుపెట్టాడు. అప్పటికే బయట మెయిన్ వేశారు అగంతకులు.

పెద్ద విస్ఫోటకం. శబ్దం! మంటలు!!

★ ★ ★

అనిమిష మనసు ప్రశాంతంగా వుంది. రాత్రంగా బాగా ఆలోచించి ఆమె ఓ నిర్ణయానికి వచ్చింది. ఇన్నాళ్లు తనను భయం వెన్నాడింది. తండ్రి నుంచి తను ఏం నేర్చుకుంది? తండ్రి కోరిక తీరిస్తే? తను ఎందుకు జర్నలిస్ట్ కాకూడదు? తండ్రితో మాట్లాడాక ఆమె పత్రికలను రెగ్యులర్‌గా ఫాలో అవ్వడం మొదలుపెట్టింది.

ప్రపంచంలో ఎన్ని విషయాలు అలా కదిలిపోతున్నాయి? ఎన్ని నేరాలు మరెన్నో ఘోరాలు ఎన్ని విచిత్రాలు ఎన్ని వైరుధ్యాలు. మనమెందుకు ఏమీ పట్టనట్టుగా వుండాలి. తను జర్నలిస్ట్ అయితే తండ్రి ఎంత సంతోషిస్తాడో? అదే విషయాన్ని తండ్రితో చెప్పాలి.

ఆమెకు తను జర్నలిస్ట్ కావాలని అనుకోవడానికి ప్రభావితం చేసిన అంశం తండ్రి తాపత్రయమే ఆమె వేగంగా యింటివైపు అడుగులు వేసి స్థాణువై నిలబడిపోయింది. దూరంగా తన ఇల్లు కాలిపోతోంది. చుట్టుపక్కల వాళ్లు తలో చేయి వేసి మంటలను ఆర్పే ప్రయత్నం చేస్తున్నారు.

ఫైరింజన్లు వున్నాయి. హడావిడి. అరుపులు. హాహాకారాలు. తన కళ్ళ ముందే ఇల్లు తగలబడిపోతోంది. అయిపోయింది. అంతా అయిపోయింది. కుప్పలా కూలి కింద పడిపోయింది అనిమిష.

★ ★ ★



తల్లి మాంసం ముద్దయిపోయింది. ఆన వాలు లేకుండా మారిపోయింది. తమ్ముడు భయంతో ముడుచుకుపోయి అలానే చచ్చి పోయాడు. అతడి చేతిలో ఓ డిటెక్టివ్ నవల చివరి పేజీలు సగం కాలిపోయి వున్నాయి.

తండ్రి చివరి శ్వాసలో వున్నాడు. బర్న్ వార్డులో చావు బతుకుల మధ్య పోరాడుతు న్నాడు.

★ ★ ★

దోమ తెరలాంటిది వుంది. శరీరం కాలిన వాసన భరించలేని వాసన అయినా ఆమెను ఆ దుర్వాసన కదిలించడం లేదు.

తండ్రి తనకు దూరం కాబోతున్నాడన్న బాధ ఆమెను ఘనీభవించిన విషాదంలోకి మార్చింది.

అతికష్టమ్మీద కళ్లు తెరిచాడు శర్మ. తొంభై శాతం కాలిన గాయాలతో ఇంకా అతను బ్రతికి వుండడం ఆశ్చర్యమే అంటు న్నారు డాక్టర్లు.

అతను కూతురికి ఏదో చెప్పాలని ప్రయత్నిస్తున్నాడు. ఆ పరిస్థితుల్లో అతను మాట్లాడ్డమూ కష్టమే.

మెల్లిగా నోరు తెరిచాడు.

"నేను వెళ్ళిపోతున్నానురా. అందర్నీ నాతోపాటు తీసుకువెళ్ళిపోతున్నాను. తమ్ముడూ, అమ్మా కళ్ళ ముందే మంటల్లో తగలబడిపోతున్నారు. ఏడవకు. కంట తడి పెట్టకు. నీ కన్నీళ్ళను అక్షరాలుగా మార్చు. డైరీలో నువ్వు రాసింది చదివాను. నా కోసం జర్నలిస్ట్ కావాలన్న నీ కోరిక నాకీ చివరి సమయంలో ఆత్మ సంతృప్తిని కలిగి స్తోంది. ఈ ప్రపంచం కోసం నువ్వు కలం పట్టు. ప్రతీ అక్షరంలో నేను వుంటాను. నీ అక్షరాల శబ్దంలో అవినీతిపరుల చెవులు పగిలిపోవాలి".

"నాన్నగారూ! మీరు మాట్లాడొద్దు. తర్వాత మాట్లాడుకుందాం. రెస్ట్ తీసుకోండి"

అతను జీవంలేని నవ్వు నవ్వాడు.

ఇప్పుడు మాట్లాడకపోతే, నేనింకా మాట్లా డలేను. ఢిల్లీలో భీష్మాచార్య అని నా ఫ్రెండున్నాడు. పెద్ద జర్నలిస్ట్. అడ్రస్ డైరీలో వుంది. ఆ... ల్... ద... బె... స్ట్... గాడ్ బ్లెస్‌యు మై చైల్డ్ అతని కళ్ళు మూతలుపడ్డాయి. తల పక్కకు వాలి పోయింది.

ఆమెకు దుఃఖం రాలేదు. విషాదం ఘనీ భవిస్తే కన్నీళ్ళెలా బయటకు వస్తాయి?

★ ★ ★

ఇల్లంతా తగలబడిపోయింది. ట్రంకుపె ట్టెలో తండ్రి డైరీ భద్రంగా వుంది. ఎప్పటి కైనా షంషేర్ తనను, తన కుటుంబానికి హాని తలపెడతాడని రాసుకున్నాడు శర్మ.

మొదటిసారిగా ఆమెలో ఆవేశం పొంగింది. కళ్ళు ఎర్రబడ్డాయి. కసి ఆకాశా న్నంటింది. వెర్రి ఆవేశం! ఆ వెర్రి ఆవే శంలో తగలబడి శిథిలమైన కిచెన్ రూమ్‌లో కూరలు తరిగే కత్తిని తీసుకొని ఒంటరిగా పాతబస్తీకి బయల్దేరింది.

★ ★ ★

దాదామియా నుంచి ఫోన్ వచ్చింది. సెల్ ఫోన్ చేతిలోకి తీసుకొని ఓ.కె బటన్ ప్రెస్ చేసి "చెప్పండి దాదామియా సాబ్ ఇక్కడ ఆ శర్మగాడి కుటుంబాన్ని లేపేసా."

"వెరీగుడ్! ఎవ్వరికీ ఏ అనుమానం రాలేదు కదా"

"లేదు. వచ్చినా మన గురించి కంప్ల యింట్ ఇచ్చే దమ్మెవ్వరికి వుంటుంది? సాబ్! కుటుంబం అంతా మాడి మసైపో యింది. ఇక మనకు ఏ ప్రాబ్లమూ వుండదు"

సరిగ్గా అదే సమయంలో అనిమిష ఆ పరిసరాల్లోకి వచ్చింది. సాధారణంగా ఆ సమయంలో షంషేర్ ఒంటరిగా వుంటాడు. పెద్ద హడావిడి లేదు. అతని చుట్టుపక్కల ఎవ్వరూ లేరు.

దాదామియాతో మాట్లాడి ఏదో అను మానం వచ్చి వెనక్కి తిరిగాడు షంషేర్.

కోపంతో సివంగిలా నిలబడి వుంది అని మిష. ఆమె చేతిలో కత్తి.

"నువ్వు నువ్వెవరు? " అడిగాడు ఒక్క క్షణం అయోమయానికి గురైన షంషీర్.

"నేనెవరో తెలియదా? నువ్వు నిర్దాక్షి ణ్యంగా చంపిన శర్మ కూతుర్ని" అంది ఆవే శంలో రొప్పుతూ.

ఒక్క క్షణం అదిరిపడ్డాడు.

"నువ్వు చావలేదా? ఆ బద్మాష్‌గాళ్ళు నిన్ను వదిలిపెట్టారా? ". అని ఒక్క క్షణం ఆగి, ఆమె వంక చూశాడు.

"బహుత్ సుందర్‌హై. చాలా బాగు న్నావు పోనీలే. నిన్ను వదిలేస్తాను. నాతో వుండిపో" అన్నాడు ఆమె దగ్గరికి వెళ్తూ-

"ఆగక్కడ. దగ్గరికొస్తే పొడిచేస్తా" అంది కత్తిని అతని మొహం ముందు ఆడిస్తూ.

పగలబడి నవ్వాడు షంషేర్.

"పూర్‌గర్ల్ ఇలాంటి కత్తులతో నేను చెవిలో గుబిలి తీసుకుంటాను. బెట్టు చేయకుండా బుద్ధిగా వచ్చి నా కౌగిలిలో వాలిపో" అన్నాడు.

అనిమిష సివంగిలా మారి అతని మీద దాడి చేసింది. కత్తితో అతని భుజం మీద దాడిచేసే ప్రయత్నం చేసింది. ఒక్క క్షణం కంగారుపడి హడలిపోయి వెనక్కి అడుగువే శాడు. ఆమెను నిలువరించే ప్రయత్నం చేశాడు.

తను నిర్లక్ష్యంగా ఉన్నాడు. ఆమె వెర్రి ఆవేశంలో వుంది. పైగా చేతిలో ఆయుధం వుంది.

వెంటనే ఎలర్టయ్యాడు షంషేర్.

"రేయ్ ఆవో! వెధవల్లారా! ఎక్కడ చచ్చార్రా రండి" అరిచాడు షంషీర్.

షంషీర్ అనుచరులు ఆ అరుపు విని ఎలర్ట్ అయ్యారు. షంషీర్ అనిమిష చేయి బిగించి పట్టుకున్నాడు. ఈలోగా అతని అనుచరులు వచ్చి అనిమిష పెడరెక్కలు

విరిచి పట్టుకున్నారు.

"చూస్తే లేడిపిల్లలా వున్నావు! సివంగిలా రెచ్చిపోతున్నావు. నిన్ను చంపకుండా మావాళ్ళు పొరపాటు చేశారు. పోనీలే వయసులో వున్నావు. ఈ రాత్రి నిన్ను అనుభవించి రేపు రెడ్‌లైట్ ఏరియాకు ట్రాన్స్‌ఫర్ చేస్తా, ఈ రాత్రి సుఖం నాదే. ఇక నీలాంటి అందమైన ఫిగర్‌ని అమ్మినందుకు లక్షల్లో లాభం" అంటూ ఆమె ముందు నిలబడ్డాడు.

అనిమిష ఆలోచిస్తుంది. ఏం చేయాలి? ఎలా తప్పించుకోవాలి? వెర్రి ఆవేశంలో తను చేసిన పొరపాటు ఏమిటో అర్థమైంది.

"ఏమిటి ఆలోచిస్తున్నావు. పర్మినెంట్‌గా నా దగ్గరే వుండిపోవాలనా? అలాగైనా నాకేం అభ్యంతరం లేదు" అన్నాడు. ఆమె పెదవుల మీద చేయి వేయబోతూ.

మెరుపులా రియాక్టయింది. అనిమిష కాళ్లు పైకి లేపి షంషీర్ రెండు కాళ్ల మధ్య తన్నింది. ఒక్కక్షణం గట్టిగా అరిచాడు షంషీర్. అదే అదునుగా అందర్నీ విదిలించుకుంది.

షంషీర్ అరుపుచూస్తే అందరూ కంగారు పడిపోయారు. ఆ కంగారులో అనిమిష విషయం ఒక్కక్షణం విస్మరించారు. అదే అదునుగా ఆమె తప్పించుకుంది.

★ ★ ★

రైల్వే స్టేషన్‌లో వుంది అనిమిష. తనకిక్కడ భద్రత లేదని అర్థమైంది. అయినా ఇక్కడ తనేం చేస్తుంది? తండ్రి, తల్లి, తమ్ముడిని అందర్నీ కోల్పోయింది.

విధివశాత్తో, ప్రమాదమో కాదు. బలవంతంగా చంపబడ్డారు. షంషీర్ మనుష్యుల వేట మొదలవుతుంది. అతని బారినుంచి తప్పించుకోవాలి. అతనికి మనశ్శాంతి లేకుండా చేయాలి. ఆమెకు మెరుపులాంటి ఆలోచన వచ్చింది. టెలిఫోన్ బూతుదగ్గరికి వెళ్లి ఫోన్ చేసింది. తండ్రి డైరీలో ఉన్న షంషీర్ ఫోన్ నంబరు గుర్తొచ్చి ఆ నంబర్ డయల్ చేసింది.

★ ★ ★

"షంషీర్ స్పీకింగ్" అన్నాడు ఫోన్ లిఫ్ట్ చేసి షంషీర్.

'కోన్‌హై తుమ్ ఎవర్నువ్వు? "

"ఎవ్వరా గుర్తు తెచ్చుకో, నీ శత్రువుని నీ మృత్యువుని"

"నువ్వు! నువ్వెవరు? "

'అనిమిష. శర్మ కూతుర్ని"

"నువ్వా? ఎక్కడున్నావు? "

"నీ పక్కలో బల్లెంలా ఉంటాను. సిటీలోనే ఉన్నాను. షంషీర్! నిన్ను వదిలిపెట్టను. దొంగనోట్లకు సంబంధించిన నంబర్లు ఉన్నాయి. నీకు సంబంధించిన వివరాలు మా నాన్నడైరీలో రాసి భద్రపరిచాడు. ఇక్కడే ఉంటాను. నీ నీడలా వెంటాడుతాను. నీకు కనిపించకుండా నిన్ను వెంటాడుతాను. గుడ్‌నైట్ కాదు బ్యాడ్‌నైట్ డెత్ నైట్"

ఫోన్ కట్ అయింది. షంషేర్ తలమీద చేతులతో కొట్టుకున్నాడు.

అనిమిష ఢిల్లీ వెళ్లే రైలు ఎక్కింది. షంషేర్ తను సిటీలోనే ఉందని తన కోసం గాలిస్తాడు. టెన్షన్ ఫీలవుతాడు. ఈలోగా తాను నాన్న చెప్పినట్టు భీష్మాచార్య దగ్గరికి వెళ్తుంది. నాన్న కోరిక తీరుస్తుంది. తన కుటుంబం తనకు దూరం కావడానికి కారణమైన ఏ ఒక్కర్నీ తను వదిలిపెట్టదు.

★ ★ ★

ఓ కన్నీటి చుక్క ఆమె బుగ్గల నుంచి జారిపడింది. గతమై నేలరాలింది.

గతం తాలూకు ఆలోచనల్నుంచి బయట పడింది అనిమిష. టైం చూసుకుంది. అర్ధరాత్రి బాత్రూంలోకి వెళ్లి మొహం కడుక్కుని వచ్చింది.

సరిగ్గా అదే సమయంలో...

★ ★ ★

ఢిల్లీ సమీపంలోని ఘజియాబాద్. హరీం

దర్‌సింగ్ తన షాపు కట్టేసి వస్తున్నాడు అర్ధరాత్రి. తొమ్మిదిలోపే షాపు కట్టేస్తారు. స్టాక్‌కు సంబంధించిన లోడింగ్ వుండ డంతో అది పూర్తిచేసి షాపు కట్టేసరికి ఆల స్యమైంది.

అయినా అతనికి ఆ రోడ్డు కొత్తేమీకాదు. ఎప్పుడు ఇంటికి వెళ్లిపోదామన్న ఉత్సా హంతో ఉన్నాడు. ఆరోజే భార్య పుట్టింటి నుంచి వచ్చింది. వచ్చీరాగానే ఫోన్‌చేసి భర్తను త్వరగా వచ్చేయమని చెప్పింది.

ఎనిమిదిన్నరకే స్వీట్‌షాప్ నుంచి భార్యకు ఇష్టమైన రసగుల్లా తెప్పించాడు. మల్లెపూలు తీసుకున్నాడు. అతని మనసు కన్నా వేగంగా బండిని పోనిచ్చే ప్రయత్నం చేస్తున్నాడు.

సరిగ్గా అప్పుడు జరిగిందా సంఘటన. ఓ వింత ఆకారం బండి హెడ్‌లైట్ల వెలుతు రులో రోడ్డుకు అడ్డంగా కనిపించింది. ఒక్క క్షణం అతని గుండె వేగంగా కొట్టుకుంది. తను భయపడ్డంలేదు కదా! బండిని స్లోచేసి కళ్లు నులుముకుని మరీచూశాడు. ఎదురుగా ఓ ఆకారం.

అయిదడుగుల ఎత్తు ఉంటుంది. మొహం వికృతంగా ఉంది. ఒళ్లంతా అదోలా ఉంది. కాళ్లకు ఇనుప బూట్ల మాది రిగా ఉన్నాయి.

హరీందర్‌సింగ్‌కు బండిని వేగంగా పోని వ్వాలో ఏంచేయాలో తోచలేదు ఆ వింత ఆకారం రోడ్డుకు అడ్డంగా నిలబడింది. ఏమాత్రం తను తొందరపడినా తనను గాయపర్చడం ఖాయం.

బండిని స్టడీగా పోనివ్వాలని నిర్ణయించు కున్నాడు. బండిని రెయిజ్ చేశాడు. అయినా అతని శరీరం వణుకుతోంది. ఆ వింత ఆకారం కళ్లు ఎర్రగా చింతనిప్పుల్లా ఉన్నాయి. భయంకరంగా అతనివైపే చూస్తోంది. బండి వింత ఆకారాన్ని సమీ పించింది. స్పీడ్ పెంచాడు. కానీ వింత ఆకారం ఒక్క ఉదుటున బండిమీదికి లంఘించింది. బండి కిందపడింది.

ఆ వింత ఆకారం హరీందర్‌సింగ్ మీద పడింది. గోళ్లతో రక్కింది. భయంతో అరి చాడతను. నోరు పెగలడంలేదు. అలానే స్పృహతప్పి పడిపోయాడు.

★ ★ ★

ఈజీచెయిర్‌లో కూచొని తల వెనక్కి వాల్చాడు భీష్మాచార్య. అనిమిష మెల్లగా అతని దగ్గరికి వచ్చింది. తన గతం అతనికి చెప్పాలి. అబద్ధం ముసుగు తొలగించాలి. తను ఎందుకు వచ్చిందీ అతనికి వివరంగా చెప్పాలి. వీలైతే అతని గతం తెలుసుకోవాలి.

అలా ఆలోచిస్తూనే అతడిని సమీపిం చింది. అతను బాగా తాగి వున్నాడని టీపాయ్ మీద ఖాళీగా వున్న విస్కీ సీసా లను చూస్తేనే తెలుస్తోంది. కనీసం విస్కీ లోకి చిప్స్ కూడా తీసుకోలేదు.

సరిగ్గా అప్పుడే ఫోన్ రింగయింది. అర్ధ రాత్రివేళ ఫోన్ ఏమిటి? లిఫ్ట్ చేయాలా? వద్దా? అది పర్సనల్ కావచ్చు. ఫోన్ రింగ వుతూనే వుంది. ఇంకా డైలమాలోనే వుంది అనిమిష.

భీష్మాచార్య చిరాగ్గా కళ్ళు తెరిచాడు. ఫోన్ రింగ్ అతడ్ని డిస్టర్బ్ చేసింది. ఎదు రుగా వున్న అనిమిషను చూశాడు.

"ఫోన్ రింగ్ అవుతుంటే లిఫ్ట్ చేయొ చ్చుగా" అన్నాడు చిరాగ్గా

అనిమిష ఒక్క క్షణం తటపటాయించి రిసీవర్ లిఫ్ట్ చేసింది. అవతల వ్యక్తి ఏదో చెప్పాడు. వెంటనే మౌత్‌పీస్ దగ్గర చేయి అడ్డుగా పెట్టి "మీతో అర్జంట్‌గా మాట్లాడా లట. బ్యూరో చీఫ్ ఫోన్ చేశారు" చెప్పింది.

"ఇప్పుడు ఏమిటిట? .. ఈ మినిష్టర్‌గా డిని ఎవరైనా కిడ్నాప్ చేశారా? ఉగ్రవా దులు ఢిల్లీని బాంబులతో పేల్చేస్తామని చెప్పారా? "

అనిమిషకు ఏం చెప్పాలో అర్థం కాలేదు. భీష్మాచార్య కళ్ళు తెరవకుండానే, "విషయమే మిటో కనుక్కో" అన్నాడు. అనిమిష అదే విషయం బ్యూరో చీఫ్‌కు చెప్పింది. రెండు

నిమిషాల తర్వాత మళ్ళీ మౌత్‌పీస్‌కు చేయి అడ్డంపెట్టి చెప్పింది.

ఢిల్లీ సమీపంలోని ఘజియాబాద్‌లో ఓ వింత ఆకారం వరుసగా నలుగురిపై దాడిచేసిందట. హరీందర్‌సింగ్ అనే వ్యక్తి పరిస్థితి విషమంగా వుందిట".

'అయితే ఏమిటట నేను వెళ్ళి వాళ్ళను పరామర్శించాలా పెట్టేయమను ఫోన్" అన్నాడు. మరో పెగ్ ఫిక్స్ చేసుకుంటూ.

అనిమిష మౌనంగా ఫోన్ పెట్టేసింది. భీష్మాచార్య రెండో పెగ్గు కూడా పూర్తిచేశాడు. అనిమిష కిచెన్ రూమ్‌లోకి వెళ్ళి పల్లీలను నూనెలో ఫ్రయ్‌చేసే వాటిమీద కారం, ఉప్పు కలిపి, ఉల్లిపాయలు తరిగి ఓ ప్లేటులో తీసుకువచ్చి టీపాయ్ మీద పెట్టింది.

భీష్మాచార్య అంతా గమనిస్తూనే వున్నాడు. అనిమిష కాస్త దూరంలో నిలబడి వుంది.

'నువ్వింకా నిద్రపోలేదా. వెళ్ళు వెళ్లి పడుకో" అన్నాడు భీష్మాచార్య.

"మీరు రాత్రి భోంచేయలేదు. ఏమైనా తింటారేమో నని"

"మందు వుంటే నాకే ఫుడ్డు అక్కర్లేదు. అనవసరంగా నీ నిద్ర వేస్ట్ చేసుకోకు. మరో విషయం. ఇంకెప్పుడూ నా కోసం ఇవన్నీ ప్రిపేర్ చేయకు"

అనిమిష మరింకేమీ మాట్లాడలేదు. ఓసారి అనిమిష వంక చూసి "ఇందాక బ్యూరో చీఫ్ ఫోన్‌చేసి ఏమన్నాడు" అని అడిగాడు.

వివరంగా బ్యూరో చీఫ్ చెప్పింది తిరిగి చెప్పింది అనిమిష.

"మరి నువ్వేం చేస్తున్నావు ఇంట్లో కూచొని పల్లీలు ఫ్రయ్ చేసుకుంటూ, ఎప్పుడు వంట చేద్దామా అని ఎదురుచూస్తున్నావా? "

ఒక్క క్షణం చురకత్తుల్లాంటి ఆ మాటలు వచ్చి ఆమె గుండెల్లో గుచ్చుకున్న ఫీలింగ్ కలిగింది.

"జర్నలిజం నాకు యిష్టం. ప్రాణం అన్నావుగా. రాత్రి కాగానే ఇంటికొచ్చి ముసుగుతన్ని పడుకునే నీకు జర్నలిజం ఎందుకు? "

"అది కాదు"

"ఏది కాదు? జర్నలిస్ట్ అంటే అర్ధరాత్రుళ్ళు కూడా ఆఫీసులో వుండాలి. అందుకే అన్నాను. నీకు జర్నలిజం సరిపడదని ఇప్పటికైనా మించిపోయింది ఏమీ లేదు. టికెట్ తెప్పిస్తాను. హైద్రాబాద్ వెళ్ళిపో".

ఉక్రోషంగా తలెత్తి ఏదో అనబోయింది అనిమిష.

"ఏం? బ్యూరో చీఫ్ ఆ వార్త చెప్పగానే నువ్వా వార్తని కవర్ చేయడానికి వెళ్ళొచ్చుగా భయమా అర్ధరాత్రి పూట ఎలా వెళ్ళాలని భయమా? "

అనిమిష గిరుక్కున వెనక్కి తిరిగి గదిలోకి నడిచింది. సరిగ్గా అయిదంటే అయిదే నిమిషాల్లో జీన్స్ పాంటు, టీ షర్టుతో బయటకు వచ్చింది. ఆమె చేతిలో కైనెటిక్ హోండాతో వుంది.

"వెరీ గుడ్! ముందు హాస్పిటల్‌కు వెళ్ళి ఆ హరీందర్‌సింగ్‌కు ఎలా వుందీ కనుక్కొని, అతడిని ఇంటర్వ్యూ చేయాలి. అది వెంటనే పత్రికాఫీసుకు అందేలా చూడాలి" చెప్పాడు భీష్మాచార్య.

అనిమిష బయటకు నడిచింది. ఆమెకా విషయం చిత్రంగా తోచింది. అంత మందు మత్తులో కూడా తను చెప్పిన విషయాలు గుర్తుపెట్టుకున్నాడు. గాయపడ్డ వ్యక్తి పేరు గుర్తుంది. అతడిని ఏవిధంగా అర్థం చేసుకోవాలో అర్థం కాలేదు అనిమిషకు.

సరిగ్గా రెండు నిమిషాల తర్వాత, అనిమిష బయల్దేరిన రెండు నిమిషాల తర్వాత భీష్మాచార్య ఓ వ్యక్తికి ఫోన్ చేశాడు.

'అనిమిష బయల్దేరింది. జాగ్రత్తగా ఫాలో అవ్వు టేక్కేర్"

భీష్మాచార్య ఫోన్ చేసింది జాన్‌డేవిడ్‌కి.

అనిమిషను ఫాలో అవుతున్నాడు జాన్‌డేవిడ్.

★ ★ ★

ట్వంటీఫోర్ అవర్స్ సర్వీస్ హాస్పిటల్ ముందు తన కైనిటిక్ ఆపింది అనిమిష. టైం ఒంటిగంట దాటింది. రిసెప్షనిస్ట్ నిద్రలో జోగుతోంది. అనిమిష రిసెప్షనిస్ట్ దగ్గరికి వెళ్ళి ఆమెను తట్టి లేపింది.

"ఎక్స్‌క్యూజ్ మీ! హరీందర్‌సింగ్ అనే పేషెంట్"

ఆ రిసెప్షనిస్ట్ నిద్రమత్తులో వుంది.

'మీరెవరు? ' చిరాగ్గా అడిగింది.

'ప్రెస్ రిపోర్టర్'ని అంది కాసింత గర్వంగా అనిమిష.

రిసెప్షనిస్ట్ నిద్రమత్తు వదిలింది. వెంటనే ఎడమచేతివైపు చూపించి చెప్పింది. "రూమ్ నెంబరు థర్టీన్ మేడమ్"

అనిమిష గబగబా అటువైపు నడిచింది.

★ ★ ★

రూమ్ నెంబరు థర్టీన్

హరీందర్ సింగ్‌కు శరీరమ్మీద చాలా చోట్ల గాయాలు అయ్యాయి. ఆమె భార్య కాబోలు అతని తల దగ్గర ఉన్న కుర్చీలో కూచొని ఏడుస్తూ ఉంది. ఆమె తాలూకు బంధువులు కూడా వచ్చినట్టున్నారు. రూమ్ బయట నిలబడి వున్నారు.

అనిమిష తనను తాను పరిచయం చేసుకుంది. హరీందర్‌సింగ్ అప్పుడే కళ్ళు తెరుస్తున్నాడు. డ్యూటీ డాక్టర్ వచ్చాడు. అనిమిష తన ఐడెంటిటీ చెప్పి వివరాలు అడిగింది.

"పెట్రోలింగ్ వాళ్ళు స్పృహతప్పి ఉన్న ఇతడిని చూసి మా హాస్పిటల్‌లో జాయిన్ చేశారు. సిట్యుయేషన్ మరీ క్రిటికల్ ఏం కాదు. గాయాల బాధ కన్నా, ఎక్కువ షాకింగ్‌కు గురయ్యాడు.

"స్పృహలోకి వచ్చాడు కాబట్టి మీరతడిని ఇంటర్వ్యూ చేయొచ్చు. అన్నట్టు భీష్మాచార్య గారు ఎలా ఉన్నారు? " అని అడిగాడు డాక్టర్.

ఆ డాక్టర్ నోటివెంట భీష్మాచార్య పేరు విని ఆశ్చర్యపోయింది. ఆయనకు ఎంత గౌరవం?

హరీందర్‌సింగ్ కళ్ళు తెరిచాడు. అత నింకా షాక్‌లో నుంచి కోలుకోలేదని అతని వాలకం చూస్తుంటే తెలుస్తోంది.

"హలో ఐయామ్ అనిమిష. ప్రెస్ రిపోర్టర్‌ని. ఏం జరిగిందీ తెలుసుకుందామని"

అతనికి ప్రెస్ అంటే గౌరవం. వెంటనే మెల్లగా లేచి మంచానికి ఒదిగి కూర్చున్నాడు. జరిగిన సంఘటన చెప్పాడు.

"అంటే ఆ వింత ఆకారం మనిషిది కాదంటారా? "

"ఖచ్చితంగా చెప్పలేను. కానీ మనిషిలా లేదు ఆకారం. అయిదడుగులు మించి లేదు. దాని కళ్ళు చింతనిప్పుల్లా ఉన్నాయి. ఇప్పటికీ తలుచుకుంటుంటే భయమేస్తోంది"

అనిమిష అతను చెప్పే ప్రతి విషయాన్నీ చకచకా రాసేస్తోంది.

అదే రాత్రి అదే వింత ఆకారం దాడివల్ల మరో ముగ్గురు అదే హాస్పిటల్‌లో జాయిన్ అయ్యారు. వాటి వివరాలు కూడా రాసుకుంది. వాళ్ల ఫొటోలు తీసుకుంటే బావుండనిపించింది. కనీసం ఫొటోగ్రాఫర్‌ని తీసుకు వచ్చినా బావుండేది అనిపించింది. ఆమె అలా అనుకుంటున్న సమయంలోనే ఫొటోగ్రాఫర్ వచ్చాడు.

ఆశ్చర్యపోవడం అనిమిష వంతయింది. తన మాటలు వినే వచ్చారా? అనుకుంది.

భీష్మాచార్య గారు పంపించారు. ఫొటోలు తీయడానికి.

ఒక్క క్షణం సిగ్గుపడింది. భీష్మాచార్యను తనెంత తక్కువ అంచనా వేసింది. అతని ముందుచూపుకు, షార్ప్‌గా అతను తీసుకునే

పూర్ణ ఆయుర్దాయం కలవాడు అర్ధ ఆయుర్దాయం కలవాడు ఇద్దరు పోగొట్టుకునేది ఒక్కటే ప్రాణం. – ఒక సామెత

నిర్ణయాలకు మనసులోనే హేట్సాఫ్ చెప్పింది.

మరో పదిహేను నిమిషాల్లో ఫొటోలు తీసే కార్యక్రమం కూడా పూర్తయింది. అక్కడినుంచి పత్రికాఫీసుకు వెళ్ళింది. ఆమె రాగానే బ్యూరో చీఫ్ ఎదురువెళ్లాడు.

"మీ కోసమే ఎదురుచూస్తున్నాం. భీష్మాచార్య గారు చెప్పారు మీరు స్పెషల్ న్యూస్ తీసుకు వస్తారని" అన్నాడు.

అనిమిష తను రాసిన న్యూస్ స్టోరీ ఇచ్చింది.

తను ఇచ్చిన న్యూస్ స్టోరీ ప్రింటింగ్‌కు వెళ్తోంది. ఆ ఆలోచనే చాలా ఉత్సాహంగా ఉంది అనిమిషకు.

కష్టం తర్వాత తెలిసొచ్చే సుఖం విలువ అర్థమవుతోంది. కృషి తర్వాత వచ్చే ఫలితం ఎలా ఉంటుందో అనుభవైకవేద్య మవుతోంది.

"మీరిక వెళ్ళొచ్చు" అన్నాడు బ్యూరో చీఫ్.

"పర్లేదు" అంది అనిమిష.

"మీరు న్యూస్ స్టోరీ తెచ్చివ్వగానే మిమ్మల్ని ఇంటికి పంపించమని చెప్పారు సార్" అన్నాడు బ్యూరో చీఫ్.

"ఏమిటో ఈ మనిషి సరిగ్గా అర్థమవ్వరు" మనసులోనే అనుకుంది అనిమిష.

కళ్ళు మండుతున్న ఫీలింగ్ రాత్రంతా సరిగ్గా నిద్రలేకపోవడం వల్ల కలిగిన ఫీలింగ్ అని అర్థమైంది. ఇంటికి బయల్దేరింది. ఇంటికి వచ్చి బండి పార్క్ చేస్తుంటే చిన్న అనుమానం కలిగింది.

తననెవరో ఫాలో చేస్తున్నారన్న అనుమానం అది. ఎప్పుడూ తననెవరో ఫాలో చేస్తున్నట్టు అనిపిస్తుంది. అది నిజంగా నిజమా? తన భ్రమా?

★ ★ ★

బద్ధకంగా కళ్ళు తెరిచి చూసింది అనిమిష.

గోడ గడియారం ఉదయం ఆరున్నర సూచిస్తోంది. తనకు రాత్రి రాగానే మొద్దు నిద్రపట్టేసింది. ఇప్పటివరకూ తను నిద్రపోవడమా? మెల్లగా లేచి హాలులోకి వచ్చింది.

భీష్మాచార్య జాగింగ్‌కు వెళ్ళొచ్చి స్నానం చేసి హాలులో కూచొని కాఫీ తాగుతూ పేపరు చదువుతున్నాడు. గిల్టీ ఫీలింగ్ కలిగింది. తను కాఫీ కలిపి ఇవ్వాల్సింది. అయినా తను అర్ధరాత్రి రెండు దాటాక వచ్చేసరికి కూడా మందు తాగుతూ ఉన్న ఈ పెద్ద మనిషి అప్పుడే లేచి ఎలా తయారయ్యాడో అర్థంకాలేదు.

"కిచెన్‌లో ఫ్లాస్కులో కాఫీ ఉంది. మొహం కడుక్కుని కాఫీ తాగు" చెప్పి మళ్ళీ పేపరులో తలదూర్చాడు భీష్మాచార్య.

బాత్రూంలోకి వెళ్ళి మొహం కడుక్కొని ఫ్లాస్క్‌లోని కాఫీ కప్పులోకి ఒంపుకొని తాగుతుండగా గుర్తొచ్చి తను రాసిన న్యూస్ స్టోరీ సంగతి.

ఒక్కసారి తను రాసిన న్యూస్ స్టోరీ చూసుకోవాలని అనిపించి హాలులోకి వచ్చింది.

భీష్మాచార్య లాన్‌లోకి వెళ్లి ఎవరితోనో సెల్‌లో మాట్లాడుతున్నాడు.

పేపర్ తీసి న్యూస్ స్టోరీ చూసింది.

విజృంభించిన వింత ఆకారం? అన్న హెడ్డింగ్ కింద న్యూస్‌స్టోరీ వచ్చింది. తను రాసిందే కానీ, తను రాసింది రాసినట్టు రాలేదు. హెడ్డింగ్ కూడా తను పెట్టింది కాదు. అయినా తాను ఓ విషయం గమనించింది. న్యూస్‌స్టోరీ తను రాసినదాని కన్నా బాగా వచ్చింది. ఇంత బాగా రాయవచ్చా అనిపించింది. అన్నింటికన్నా ముఖ్యంగా న్యూస్‌స్టోరీ క్రెడిట్ తనకే ఇస్తూ బైలైన్ వేయడం.

★ ★ ★

పత్రికాఫీసులోకి వెళ్లిన అనిమిషను రిపోర్టర్లు, సబ్ఎడిటర్లు అభినందించారు. వాళ్ల అభినందనలు అందుకుంటుంటే చెప్పలేని ఆనందం కలిగింది. తనకు కేటాయించిన

సీటులో కూచొని రైటింగ్ ప్యాడ్ పక్కకు జరుపుతుంటే న్యూస్‌స్టోరీ స్క్రిప్ట్ కనిపించింది. తను రాసిన న్యూస్‌స్టోరీలో తప్పులు సరిదిద్దుతూ భీష్మాచార్య రాసిన న్యూస్‌స్టోరీ కనిపించింది.

అర్ధరాత్రి వరకూ ఇంట్లోనే ఉన్న భీష్మాచార్య ఆఫీసుకు ఎప్పుడు వచ్చాడు? ఎప్పుడు న్యూస్‌స్టోరీ రాశారో అర్ధం కాలేదు.

లంచ్‌టైంలో క్యాంటిన్‌లో చెప్పాడు బ్యూరోబాస్.

"మీరు న్యూస్ ఇచ్చి వెళ్లాక భీష్మాచార్య వచ్చి ఫ్రెష్ వెర్షన్ రాసిచ్చి నీపేరు మీద వేయమని ఇదంతా నీ క్రెడిట్‌లాగే ఉండాలని చెప్పారు."

★ ★ ★

ఉదయం పదకొండున్నర ప్రాంతంలో పబ్లిక్ స్కూల్ పక్కన ఉన్న ప్లేగ్రౌండ్‌లో కొందరు పిల్లలు క్రికెట్ అడుకుంటున్నారు. సరిగ్గా అదే సమయంలో ఓ వింత ఆకారం వాళ్ల మీద దాడి చేసింది. గోళ్లతో వాళ్లని రక్కింది. అసలే చిన్న పిల్లలు. అందులో వింత ఆకారం. భయంతో కేకలు వేశారు.

మరుక్షణమే ఆవార్త ఆనోట ఈనోట ఆప్రాంతమంతా పాకిపోయింది. పత్రికా విలేకరులు టీవీ ఛానెల్స్ వాళ్లు ఆ ప్రాంతాన్ని చుట్టుముట్టారు.

వింత ఆకారం పారిపోవడం చూశానని ఓ వ్యక్తి, ఫలాన వైపు వెళ్లిందని కొందరు. రకరకాల చిలువలు పలువలుగా ఆవార్త స్ప్రెడ్ అవుతూ వచ్చింది. ఏది నిజమో ఏది అబద్ధమో నిర్ధారణ చేసే అవకాశం కూడా లేదు.

వింత ఆకారం వార్త డైలీన్యూస్‌లో వచ్చేక సంచలనం మొదలైంది. ఏ ఇద్దరు కలిసినా ఇదే విషయాన్ని చర్చించుకోవడం మొదలు పెట్టారు.

★ ★ ★

ఆరోజు రాత్రి ఆరుబయట పడుకున్నారు ఆకాలనీ వాళ్లు. కొందరు మిద్దెల మీద పడుకున్నారు. సరిగ్గా పన్నెండు గంటల ప్రాంతంలో వింత ఆకారం ఆ కాలనీలోకి ప్రవేశించింది. ఆరుబయట పడుకున్న వాళ్ల మీద దాడి చేసింది భయంతో నిద్రలేచిన వాళ్ల కేకలు వేశారు.

ఆ వింత ఆకారం మిద్దెలపై పడుకున్న వాళ్ల మీద కూడా దాడి చేసింది. టార్చిలైట్లు, కాగడాలు కర్రలతో ఆ వింత ఆకారాన్ని వెంబడించారు కొందరు యువకులు. కానీ ఆవింత ఆకారం వాళ్ల మీద తిరగబడుతూ వాళ్లని భయపెడుతూ వాళ్లకు దొరక్కుండా పారిపోయింది.

★ ★ ★

మరుసటి రోజు పోలీసులు అసమర్ధతను నిలదీస్తూ కొన్ని పత్రికల్లో వార్తా కథనాలు వచ్చాయి. పోలీసులను దుయ్యబట్టారు. శాంతిభద్రతల విషయంలో పోలీసులూ నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారని ఆరోపించారు.

ఏదో ఓ సంఘటన జరిగితే రాజకీయ నాయకులకు చేతినిండా కావలసినంత పని. పత్రికల్లో స్టేట్‌మెంట్లు ఇవ్వడం అవసరమైతే ఆందోళనలు చేపట్టటం వాళ్లకు ఆనవాయితీ!

వింత ఆకారం విషయంలో కూడా పోలీసులను దుయ్యబడుతూ విమర్శించాయి రాజకీయపక్షాలు.

ప్రతిపక్షం వాళ్లు ఇదంతా అధికార పక్షం అసమర్ధత అని, దాడి మొదలుపెడితే, ప్రతిపక్షాల కుట్రే అని అధికార పక్షం సమాధానం యిచ్చింది.

ఇదంతా గమనిస్తోన్న అనిమిషకు అంతా అయోమయంగా ఉంది.

★ ★ ★

అనిమిష భీష్మాచార్య ఎదురుగా కూచుంది. ఆమె చేతిలో ఓ ఫైల్ ఉంది.

భీష్మాచార్య అనిమిష వంక చూసి "ఏమిటి విషయం? " అని అడిగాడు.

వింత ఆకారానికి సంబంధించిన విష

యాలు సేకరించానని చెప్పింది అనిమిష. తన చేతిలో ఉన్న ఫైల్‌ని భీష్మాచార్యకు ఇస్తూ-

భీష్మాచార్య ఆ ఫైల్‌ని పరిశీలిస్తుంటే చెప్పడం మొదలుపెట్టింది అనిమిష.

"ఇప్పటి వరకు వింత ఆకారం దాడిలో ముప్పయినాలుగు మంది వ్యక్తులు గాయపడ్డారు. ఇరవై రెండు మందికి స్వల్పగాయాలయ్యాయి. అయిదుగురు వ్యక్తులు వింత ఆకారం భయంతో మిద్దెపై నుంచి దూకి గాయాలపాలయ్యారు.

'ఐసీ' అన్నట్టు తల పంకించాడు భీష్మాచార్య.

చాలామంది వింత ఆకారం కనిపించకపోయినా కనిపించిందని చిలువలు పలువలు చేసి చెబుతున్నారు.

భీష్మాచార్య ఆమె చెప్పేది వింటున్నాడు. జనానికి మాస్ హిస్టీరియా పట్టుకుంది. ఇదిగో పులి అంటే అదిగో తోక అనేలా తయారయ్యారు. "నాకు ఇంకో అనుమానం కూడా ఉంది" అంది అనిమిష.

'ఏమిటది?' అడిగాడు భీష్మాచార్య.

'ఆ వింతఆకారం నిజంగా ఏదైనా జంతువా లేక..'

'లేక?' అడిగాడు భీష్మాచార్య.

'ఎవరైనా కావాలని నాటకమాడుతున్నారా?.'

ఒక్క క్షణం అక్కడ ఆవరణలో నిశ్శబ్దం అలుముకుంది.

'ఎందుకిలా అనుకుంటున్నావు?' అడిగాడు భీష్మాచార్య.

'ఒకేసారి నాలుగు వివిధ ప్రాంతాల్లో వింతఆకారం కనిపించిందని ప్రచారం జరిగింది. అంటే వింత ఆకారాలు నాలుగు వున్నాయా? ఒకే ఆకారం ఒకేసారి నాలుగు వివిధ ప్రాంతాల్లో ఎలా కనిపిస్తుంది? అదీ గాక వింత ఆకారం మనిషే ఎందుకు కాకూడదు?'.

'అవును ఎందుకు కాకూడదు' ఎదురు ప్రశ్నించాడు భీష్మాచార్య.

"మరో విషయం సార్! ఈ వింత ఆకారం కనిపించడం మొదలుపెట్టేక, పోలీసు పెట్రోలింగ్ పెరిగింది కానీ జనం మాత్రం పలుచబడ్డారు. పన్నెండు ఒంటిగంట వరకు అర్ధరాత్రుళ్ళు కూడా బిజీగా వుండే చాలా సెంటర్లు ఇప్పుడు తొమ్మిది పది దాటక ముందే నిర్మానుష్యమవుతున్నాయి. రెండోఆట సినిమాకు జనాలు ఎవరూ వెళ్ళడం లేదు."

భీష్మాచార్య ఆమె విశ్లేషణ వింటున్నాడు అతికొద్ది సమయంలోనే పికప్ అయింది అనిమిష.

"అయితే ఇప్పుడేమంటావ్?."

"ఈ వింత ఆకారం డెత్‌జోన్ పరిసర ప్రాంతాల్లోనే ఎక్కువగా కనిపిస్తోంది. మిగతా ప్రాంతాల్లో దీని ఉనికి లేదు. ఆ డెత్‌జోన్‌కు ఈ వింత ఆకారానికి ఏమైనా సంబంధం వుందా అని అనుమానం" అంది అనిమిష భీష్మాచార్య వైపు చూస్తూ.

డెత్‌జోన్ పేరు వినగానే భీష్మాచార్య మొహంలో రంగులు మారాయి. అతని పిడికిళ్ళు అప్రయత్నంగా బిగుసుకున్నాయి.

'నేను అటువైపు వెళ్ళి పరిశీలిస్తానంటే బ్యూరోచీఫ్ వద్దన్నారు. కాదు కూడదంటే మీ పర్మిషన్ తీసుకోవాలన్నారు'.

"సరే ఆ విషయం వదిలేయ్. నువ్వు రేపట్నుంచే ప్రెస్‌మీట్స్ కవర్‌చేయ్" చెప్పాడు భీష్మాచార్య.

ఒక్కక్షణం బిత్తరపోయింది. ఎంతో హుషారుగా వచ్చింది. ఈ కేసు తననే డీల్ చేయమంటారని ఆశపడింది. ఈ ఇన్‌వెస్టిగేషన్ ఆమెకు ఓ థ్రిల్‌గా వుంది. అదీగాక ఒకప్పుడు ప్రెస్‌మీట్స్ గురించి చులకనగా మాట్లాడిన వ్యక్తి ఇప్పుడు తనకు ఆ ప్రెస్‌మీట్స్ కవర్ చేయమని చెప్పడమేమిటి?

"అదికాదు సార్ వింత ఆకారం గురించి మొదట్నుంచి ఫాలో అవుతున్నాను. నాకు ఈ కేసు మీద ఇంట్రెస్ట్ వుంది. అందుకని"

"అందుకని ఎక్కడకి పడితే అక్కడకి వెళ్ళడమేనా? అయినా ఆ వింతఆకారానికి అంత యింపార్టెన్స్ అక్కర్లేదు. అది ఎవరో ఒకరు చూసుకుంటార్లే" అన్నాడు భీష్మాచార్య

అనిమిషకు ఎక్కడలేని నిస్సత్తువ కలిగింది. ఎంతో ఉత్సాహంగా తను వుంటే ఇదేమిటి ఇలా జరిగింది? ఆమెకు భీష్మాచార్య మీద పీకల్దాకా కోపం వచ్చింది.

ఈ మనిషి ఎప్పుడెలా మారతాడో తెలియదు. మొన్నటికి మొన్న తనని ఈ కేసు డీల్ చేయమన్నాడు. ఇప్పుడేమో వద్దంటున్నాడు. ఏమైనా సరే తను ఈ కేసు మిస్టరీని ఛేదించవలసిందే. పట్టుదలగా అనుకుంది అనిమిష.

★ ★ ★



భీష్మాచార్య ఆలోచిస్తున్నాడు. అనిమిష తన మాటలు విని నిరాశతో వెళ్ళిపోవడం కనుచివరల నుంచి గమనిస్తూనే వున్నాడు. అతని చెవిలో అనిమిష అన్న మాటలే గింగురుమంటున్నాయి. డెత్‌జోన్‌లోనే వింత ఆకారం సంచరిస్తుందా? అంటే

దాదామియా అతని నోట్లో నుంచి ఆ అక్షరాలు బయటకు వచ్చాయి. అతని పిడికిళ్ళు అప్రయత్నంగా బిగుసుకున్నాయి. అసహనంగా రెండు కణతలను చేతులతో నొక్కుకున్నాడు.

★ ★ ★

రాత్రి పదకొండున్నర.

అనిమిష యింట్లో నుంచి బయటకు వచ్చింది. భీష్మాచార్య ఇంకా యింటికి రాలేదు. ఈ వింత ఆకారం కేసు తనకు అప్పగించకపోవడం పట్ల ఆమె చాలా కోపంగా వుంది.

ఆ కేసు మిస్టరీ తనే తేల్చాలన్న పట్టుదలతో వుంది. అందుకే అంత రాత్రివేళ బయటకు వచ్చింది.

బ్లూజీన్స్ మీద బ్లాక్‌టీషర్ట్ వేసింది. మెల్లగా కైనెటిక్‌హోండాని బయటకు తీసింది. నగరశివార్ల వైపు బయల్దేరింది కైనిటిక్‌హోండా. ఆ వెహికల్ వెళ్ళిన అయిదు నిమిషాల తర్వాత మరో వెహికల్ ఆ వెహికల్‌ని ఫాలో అయింది.

★ ★ ★

నల్లటి బోర్డు మీద రేడియల్ వున్న డెత్ జోన్ అన్న అక్షరాలు మెరుస్తున్నాయి.

రాత్రంతా నిర్మానుష్యంగా వుంది. ఒక్క క్షణం భయం వేసింది అనిమిషకు. అప్పుడు తండ్రి మాటలు గుర్తొచ్చాయి.

ఎప్పుడైతే నువ్వు అభయాన్ని ఆశ్రయిస్తావో, అప్పుడు భయం నిన్ను ఆవరిస్తుంది. నిన్ను చుట్టేసి ఉక్కిరిబిక్కిరి చేస్తుంది. భయం ఒక సైకలాజికల్ ఫీలింగ్.

అనిమిష కొద్దిగా ధైర్యం తెచ్చుకుంది. తనిప్పుడు ఎటువైపు వెళ్ళాలి? దూరంగా ఓ పెద్ద ఫామ్ హౌస్. బూత్‌బంగ్లాలా అనిపించింది. అక్కడికి వెళ్తే? అక్కడ ఎవరుంటారు?

ఈ అర్ధ రాత్రి వేళ! చేతిలో ఏ ఆయుధం లేకుండా వెళ్లడం రిస్కే కదా!

సరిగ్గా అప్పుడే ఏదో శబ్దం ఏదో అరుపు ఏదో కేక భయంతో ఉలిక్కి పడి రోడ్డు పక్కగా ఆపింది తన వెహికిల్‌ని. నిర్మానుష్యమైన ఆ ప్రాంతం నిశ్శబ్దంతో భయం పుట్టిస్తోంది. వెనక్కి వెళ్ళిపోదామా? అనుకుంది.



తన వెనక ఓ ఆకారం ఉన్న ఫీలింగ్ కలిగింది. ఒళ్ళు జలదరించింది. ఆ ఊహ కలగ్గానే! నిజంగా తన వెనక ఏదైనా ఆకారం ఉందా? తన భ్రమా? తల వెనక్కి తిప్పాలంటేనే భయం వేసింది. ఏదో శబ్దం! తన వెనకే ఓ ఆకారం ఉంది.

అది వింత ఆకారం కాదు కదా వెచ్చటి ఊపిరి తన భుజం మీద తగులుతోన్న ఫీలింగ్. కనుచివరల నుంచి వెనక్కి తల తిప్పి చూడాలా అని ఆలోచిస్తూ ఉండగానే ఓ చేయి ఆమె భుజం మీద పడింది. వెంటనే ఆ చేతిని విదిలించి వెనక్కి తిరిగింది. ఊపిరి పీల్చడం మానేసింది.

కళ్ల ఎదురుగా వింత ఆకారం! దాని కళ్ళు గోళి కాయల్లా ఉన్నాయి. ఎర్రగా చింత నిప్పుల్లా ఉన్నాయి. చేతి వ్రేళ్ళ గోళ్ళు పొడవుగా శరీరంలో దిగబడి నిలువునా రెండుగా చీల్చేలా ఉన్నాయి. కాళ్లకు ఇనుప బూట్లు.

వెంటనే బండి దగ్గరికి పరుగెత్తింది. బండి స్టార్ట్ చేసింది. రెయిజ్ చేసింది. ఆ నిశ్శబ్దంలో పెద్ద శబ్దం చేస్తూ కైనెటిక్ ముందుకు దూకింది. రెండేసి అంగల చొప్పున వింత ఆకారం వస్తోంది. తన బండి వేగాన్ని మించి పరుగెడుతుందేమోనన్న భయం వేసింది.

తను ఎటువైపు వెళ్తుందో కూడా తెలియకుండానే కైనెటిక్‌ని డ్రైవ్ చేయసాగింది. ఆమె గుండె ఇంకా వేగంగానే కొట్టుకుంటోంది. మొహమంతా చెమట పట్టింది. సరిగ్గా అప్పుడే ఓ పెట్రోలింగ్ వ్యాన్ ఆమె కైనెటిక్‌కు ఎదురొచ్చింది.

పెట్రోలింగ్ వెహికిల్ హెడ్‌లైట్ల వెలుతురుకు ఒక్క క్షణం కళ్ళు మూసుకుంది. అనిమిష. పెట్రోలింగ్ వెహికిల్ నుంచి పోలీసులు దిగి అనిమిష దగ్గరికి వచ్చారు.

"ఎవరు మీరు? ఇంత అర్ధరాత్రి వేళ

ఎక్కడ్నుంచి వస్తున్నారు?' అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"అయామ్ అనిమిష".

"ఇంత రాత్రి వేళ ఎక్కడ్నుంచి వస్తున్నారు? ఈ ఏరియాలో మీకేం పని?"

"వింత ఆకారం గురించి తెలుసుకుందామని వచ్చాను".

"వింత ఆకారం గురించా? ఎందుకు? ఇంతకీ మీరెవరు?"

"ప్రెస్ రిపోర్టర్‌ని".

"ప్రెస్ రిపోర్టరా? ఏ పత్రికా?" అడిగాడు అనుమానంగా ఇన్‌స్పెక్టర్.

"డైలా న్యూస్" చెప్పింది అనిమిష.

"ఆ పత్రికలో ఉన్న రిపోర్టర్లు అందరూ నాకు బాగా తెలుసు వేరీజ్ యువర్ ఐడెంటిటీ కార్డు?"

"ఐడెంటిటీ కార్డా". ఏం చెప్పాలో తోచలేదు అనిమిషకు.

"అవును షో మి యువర్ ఐడెంటిటీ కార్డు"

"లేదు" చెప్పింది అనిమిష.

"ఐడెంటిటీ కార్డు లేదా? మిమ్మల్ని రిపోర్టర్ అని ఎలా నమ్మేది ముందు స్టేషన్‌కు పదండి."

చిక్కులో పడిపోయింది అనిమిష. ఇప్పుడు భీష్మాచార్యకు ఫోన్ చేస్తే!

వద్దంటే తనే కేసు మిస్టరీ ఛేదిస్తానని వచ్చింది. అనవసరంగా చివాట్లు పెడతాడు. పోనీ ఊర్కుంటే ఇన్‌స్పెక్టర్ ఊర్కునేలా లేడు. అర్ధరాత్రి వేళ తనను స్టేషన్‌కు తీసుకు వెళ్తారు. ఏం చేయాలి?

"హలో మిమ్మల్నే ముందు పోలీస్ స్టేషన్‌కు నడవండి" అన్నాడు కంగుమనే కంఠంతో ఇన్‌స్పెక్టర్.

"నేను కైనెటిక్ మీద వస్తాను" చెప్పింది అనిమిష.

"అదేం కుదర్దు. జీపెక్కండి" అన్నాడు.

అనిమిష నిస్సహాయంగా జీపు ఎక్కబోతుండగా వినిపించిందొక కంఠం.

"ఎక్స్‌క్యూజ్ మీ"

ఇన్‌స్పెక్టర్ తల తిప్పాడు. ఎదురుగా అయిదడుగుల పది అంగుళాల దృఢకాయుడు.

"అయామ్ డేవిడ్. జాన్ డేవిడ్. డైలీ న్యూస్ క్రయిమ్ రిపోర్టర్‌ని. దిసీజ్ మై ఐడెంటిటీ కార్డ్" జేబులో నుంచి ఐడెంటిటీ కార్డు తీసి ఇన్‌స్పెక్టర్‌కు ఇచ్చాడు.

"గ్లాడ్ టు మీట్ యు. మీ పేరు విన్నాను కానీ కలుసుకోవడం ఇదే ప్రథమం. రీసెంట్‌గా ట్రాన్స్‌ఫర్ అయి వచ్చాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్ స్పందిస్తూ.

"షీ ఈజ్ అనిమిష. మా రిపోర్టరే. భీష్మాచార్యగారికి కావలసిన వ్యక్తి. భీష్మాచార్యగారే ఓ కేసు విషయమై పంపించారు. వన్ సెకన్" అంటూ జేబులో నుంచి సెల్ ఫోన్ తీసి భీష్మాచార్యకు రింగ్ చేసి విషయం చెప్పాడు.

సెల్‌ఫోన్ ఇన్‌స్పెక్టర్‌కు ఇచ్చాడు. ఆ ఇన్‌స్పెక్టర్‌కు భీష్మాచార్య గురించి ముందే తెలిసి ఉండడం వల్ల చాలా పొలయిట్‌గా మాట్లాడాడు.

"ఓ.కె సార్. ఓ.కె సార్. మా ప్రాబ్లమ్స్ మాకు ఉంటాయి కదా సార్. అర్ధరాత్రి ఓ అమ్మాయి రోడ్డు మీద కనిపించేసరికి. అలాగే సార్" అని ఫోన్ ఆఫ్ చేసి అనిమిష వైపు తిరిగి.

"సారీ మేడమ్. ఐడెంటిటీ కార్డు లేకపోవడం వల్ల మిమ్మల్ని కాస్త ఇబ్బంది పెట్టాను. భీష్మాచార్యగారే మిమ్మల్ని ఈ కేసు విషయంగా పంపించారని ముందే చెప్పొచ్చుగా మేడమ్. మీరిక వెళ్లొచ్చు" అన్నాడు.

భీష్మాచార్య ఎదురుగా నిలబడి ఉంది అనిమిష. ఆమెకు కాస్త దూరంలో జాన్

ఉద్గ్రంథాల కంటే ఉత్తేజకరమైనది 'నిశ్శబ్దం'. – జె.టి.యస్.హార్టెన్

డేవిడ్ ఉన్నాడు.

అనిమిష అన్నింటికీ సిద్ధపడే ఉంది. భీష్మాచార్యతో అక్షింతలు వేయించుకోవడానికి సిద్ధంగా ఉంది. ఆమెకో చిక్కుముడి విడిపోయినట్టయింది. ఎప్పుడూ తనను ఎవరో వెంటాడుతున్నారని, తనని వెంబడిస్తున్నారని ఫీలయ్యేది. అది తన భ్రమేమో అనుకునేది. కానీ అది భ్రమ కాదని, నిజంగానే తనని ఓ వ్యక్తి వెంబడిస్తున్నాడని కన్ఫర్మ్ అయింది.

ఆ వ్యక్తి జాన్ డేవిడ్ అని తెలిసిపోయింది. లేకపోతే అర్ధరాత్రి వేళ అపద్బాంధవుడిలా అతనొచ్చి కాపాడ్డం ఏమిటి? నిజంగా అతను వచ్చి ఉండకపోతే? తలుచుకోవడానికే భయంగా ఉంది. ఇలాంటి వెర్రిమొర్రి సాహసాలు చేయకూడదని డిసైడైంది.

భీష్మాచార్య అనిమిష వంక చూశాడు. బుద్ధిగా తల వంచుకుని వుంది.

"ఏమిటి? నేను చెప్పినా వినకుండా అడ్వంచర్ చేద్దామని వెళ్ళావా? మూర్ఖంగా ఎక్కడికైనా చొచ్చుకుపోవాలనుకోవడం జర్నలిస్ట్ లక్షణం కాదు. ఆచి తూచి అడుగు వేయాలి. మనం ఎక్కడికి వెళ్తున్నాం? ఎలా వెళ్తున్నాం? ఎప్పుడు వెళ్తున్నాం లాంటి ముందు వెనకలు చూసుకోవద్దా? "

బుద్ధిగా తలవంచుకునే ఉంది.

"డెత్ జోన్‌కు వెళ్ళి ఏం చేద్దామని అనుకున్నావు. సినిమాల్లో చూపించినట్టుగా ఏదైనా సాహసం చేద్దామని అనుకున్నావా? ఇది సినిమా కాదు. జీవితం"

అలానే కామ్‌గా వుండిపోయింది అనిమిష.

"ఇంకెప్పుడూ ఇలాంటి సాహసాలు చేయకు. నాకు చెప్పకుండా వెళ్ళకు. కనీసం ఎక్కడికైనా వెళ్ళేటప్పుడు బండిలో పెట్రోలు వుందా లేదా కూడా చూసుకోవాలని తెలియదా? "

అప్పుడు గుర్తొచ్చింది అనిమిషకు తన బండిలో పెట్రోలు మధ్యాహ్నమే రిజర్వ్‌లోకి వచ్చింది. మహాఅయితే అయిదారు కిలోమీటర్లు వస్తుందంతే అనుకుంది. మరి తను అంత దూరం ఎలా వెళ్ళగలిగింది? అంటే తనకు తెలియకుండా బండిలో పెట్రోలు పోయించారు. ఇంకెవరు? భీష్మాచార్యే అయివుంటాడు అనుకుంది.

"సరే, ఇప్పుడు చెప్పు. ఏం చేద్దామనుకుంటున్నావు? " అడిగాడు భీష్మాచార్య.

చెప్పనా వద్దా అన్నట్లు ఆగిపోయింది అనిమిష.

"చెప్పు. పర్లేదు."

"డెత్‌జోన్ సమీపంలో నేను వింత ఆకారాన్ని చూశాను".

ఒక్క క్షణం నిశ్శబ్దం. ఆ తర్వాత అడిగాడు భీష్మాచార్య.

"చూసి ఏం చేశావు? "

సిగ్గుతో మొహం ఎర్రబడింది.

"పారిపోయి వచ్చావ్"

"అదికాదు. ఆ వింత ఆకారం"

"నీమీద దాడి చేయబోయింది. నువ్వు పారిపోయావు"

పారిపోక దాని చేతిలో చచ్చిపోవాలా? మనసులో అనుకుంది అనిమిష.

"కనీసం అర్ధరాత్రుళ్ళు వెళ్ళేప్పుడు ఓ చిన్న ఆయుధం అయినా తీసుకు వెళ్ళాలని తోచలేదా? "

"తోచలేదు" అన్నట్టు తల అడ్డం తిప్పింది.

"డెత్ జోన్ గురించి నీకేం తెలుసని అక్కడికి వెళ్ళావు? " ఖంగున మోగింది భీష్మాచార్య కంఠం.

"తెలుసుకుందామనే వెళ్ళాను" మెల్లగా చెప్పింది.

"అది తెలుసుకునేసరికి నువ్వు బతికి వుండవు" కఠినంగా అన్నాడు భీష్మాచార్య.

అనిమిషకు ఏం మాట్లాడాలో అర్థం కాలేదు. తను తొందరపడిందని అర్థమవుతూనే వుంది.

"వెళ్ళు. జాన్ డేవిడ్ డెత్ జోన్ గురించి

వివరంగా చెబుతాడు. విను! విన్నాక నువ్వేం చేయాలో నిర్ణయించుకొని ఏం చేస్తావో ఏం చేయాలని అనుకుంటున్నావో నాతో చెప్పు" అని జాన్‌డేవిడ్ వైపు తిరిగి

"జాన్‌డేవిడ్ ఆ అమ్మాయికి ఎక్స్‌ప్లెయిన్ చేయి! డెత్ జోన్ అంటే జూ పార్క్ కాదని చెప్పు" అన్నాడు.

జాన్‌డేవిడ్ అలాగే అన్నట్టు తల ఊపి 'ప్లీజ్ కమ్' అన్నాడు అనిమిష వైపు తిరిగి.

అనిమిష జాన్‌డేవిడ్‌ని ఫాలో అయింది. వాళ్ళిద్దరూ ప్రెస్‌లో వున్న చివరి గది వైపు వెళ్ళారు.

★ ★ ★

"మీకు దాదామియా గురించి తెలుసా" అడిగాడు జాన్‌డేవిడ్ తన ఎదురుగా వున్న అనిమిషను.

"దాదామియా? అతనెవరు? " అడిగించి అనిమిష.

"అండర్ వరల్డ్ కింగ్ మాఫియా సామ్రాజ్యానికి మకుటం లేని మహారాజు. ఈ ఢిల్లీ నగరాన్ని తను కనుసైగతో శాసిం చగల స్మగ్లర్."

'అతనికి డెత్ జోన్‌కు సంబంధం ఏమిటి? " అడిగింది అనిమిష.

"డెత్ జోన్ దాదామియా మాఫియా సామ్రాజ్యం. ఆ ప్రదేశంలోకి అపరిచితులు వెళ్తే ప్రాణాలతో రారు."

ఒక్కక్షణం ఆమె ఒళ్ళు గగుర్పొడిచింది. అంత ప్రమాదకరమైన ప్రాంతానికి తను వెళ్ళిందా?

"ఆ విషయం పోలీసులకు తెలియదా? " అడిగింది అనిమిష.

"తెలుసు. అయినా ఎవరూ సాక్ష్యాలతో దాదామియాని పట్టుకోలేదు. అతను ఎప్పుడు ఎక్కడ ఉంటాడో ఎవరికీ తెలి యదు. శివారు ప్రాంతంలో ఒకేసారి పులి వచ్చి ఎటాక్ చేయొచ్చు. ఆఫ్‌కోర్స్ ఆ పులి దాదామియానే కావచ్చు. అందుకే ఆ జోన్‌ని డెత్ జోన్ అంటారు".

"మరి పత్రికలన్నీ ఏం చేస్తున్నాయి? "

"సరైన ఆధారం కోసం అన్వేషిస్తున్నాయి. దాదామియా లాంటి వ్యక్తి మీద ఓ ఆరో పణ చేస్తే అది పత్రికలో రాస్తే, ఆ పత్రిక ఆఫీసు పేలిపోవచ్చు. ఆ వార్త రాసిన విలే కరి యాక్సిడెంట్‌లో చచ్చిపోవచ్చు".

"దాదామియా అంత భయంకరమైన వ్యక్తా? "

"అవును."

"అందుకే భీష్మాచార్యగారు భయపడు తున్నారా? "

జీవితంలో ఎప్పుడూ నవ్వనట్టు వున్న అతని పెదవులమీద చిన్న చిర్నవ్వు.

"ఎందుకు నవ్వుతారు" అడిగింది అని మిష.

"భయం అనేది భీష్మాచార్యగారి డిక్షన రీలో లేదు."

"మరి దాదామియా గురించి అంతా ఆందోళన ఎందుకు? దాదామియా గురించి ఆయన పత్రికలో రాయొచ్చుగా నీలాంటి డైనమిక్ జర్నలిస్ట్‌తో కూపీ లాగించవ చ్చుగా."

"ఈ ప్రపంచంలో దాదామియాను కంగు తినిపించిన వ్యక్తి దాదామియాను ఎదు ర్కొన్న వ్యక్తి ఎవరో తెలుసా"

"ఎవరు? " అడిగింది ఆసక్తిగా అనిమిష

"భీష్మాచార్యగారు" చెప్పాడు ఒక్కో అక్ష రాన్ని వత్తి పలుకుతూ

"అవునా" ఆశ్చర్యంగా అడిగింది అనిమిష

"అవును ఆయన ధైర్యానికి ముఖ్యంగా ఆయన కుటుంబాన్ని కోల్పోయారు" విషాదం గంభీరమవుతుండగా చెప్పాడు.

వెన్నులో చలి, శరీరం జలదరించిన ఫీలింగ్.

"మీకు తెలిసిన భీష్మాచార్య వేరు. అసలు భీష్మాచార్య గురించి మీకు తెలియదు. సమాంతర ప్రభుత్వం నడిపిస్తూ నేర వ్యవ స్థను శాసిస్తోన్న దాదామియాని ఢీకొన్న ఆ మేరుపర్వతం భీష్మాచార్యగారు" కళ్ళు మూసుకున్నాడు జాన్‌డేవిడ్.

ఇంకా అతని కళ్ళముందు ఆ సంఘటన కదలాడుతూనే ఉంది. ఒళ్ళు జలదరించే సంఘటన దాదామియాని నిలువరించి, అతని ఒంట్లో వణుకుపుట్టించిన భీష్మాచార్య నేలకొరిగి నిస్పృహాయుడైన సంఘటన.

★ ★ ★

రాత్రి పదకొండు దాటింది.

డైలీ న్యూస్‌లో హడావిడి భీష్మాచార్యకు ఏ.సి. గదిలో కూడా చెమటలు పడుతున్నాయి. టేబుల్ మీద ఫొటోలు వున్నాయి.

అవి మామూలు ఫొటోలు కాదు. దేశాన్ని పట్టి కట్టి కుదిపేసే ఫొటోలు. ఆ ఫొటోలు పత్రికలో పబ్లిష్ అయిన మరుక్షణం దేశాన్ని దేశంలోని చోరవ్యవస్థను పరోక్షంగా, ప్రత్యక్షంగా శాసిస్తోన్న దాదా మియా మాఫియా సామ్రాజ్యం పునాదులు కదిలిపోతాయి.

అతని ఎదురుగా జాన్‌డేవిడ్ వున్నాడు.

"వెల్ డన్ జాన్‌డేవిడ్ నీ సాహసం చరిత్రలో నిలిచిపోతుంది. నువ్వు తెచ్చిన ఈ డేరింగ్ న్యూస్ పత్రికా ప్రపంచాన్నే ఓ కుదుపు కుదుపుతుంది" అభినందన పూర్వకంగా అన్నాడు భీష్మాచార్య.

"థ్యాంక్యుసార్! మీరు నాటిన మొక్కను, అనాథగా వున్న నన్ను జర్నలిస్టుని చేశారు. జర్నలిజంలో ఓనమాలు చెప్పారు. ఈ ప్రపంచంలో ఓ గొప్ప వ్యక్తిగా నిలబెట్టారు. మీరు పెట్టిన భిక్షేయిది" వినమ్రంగా అన్నాడు జాన్‌డేవిడ్.

'ఫరగెటిట్ జాన్‌డేవిడ్ గతం విషాదమైతే మరిచిపోవాలి వర్తమానం సాహసం అయితే ఎంజాయ్ చేయాలి. డెత్‌జోన్‌కు సంబంధించిన ఈ ఆధారాలు మన పత్రికలో పబ్లిష్ అయిన మరుక్షణం సెన్సేషన్ క్రియేట్ చేస్తాయి. అంతేకాదు. ఆ దాదా మియా నేర సామ్రాజ్యం పునాదులు కదిలిపోతాయి. ఢిల్లీ నగరం ప్రశాంతంగా వుంటుంది. వీటిని వెంటనే ప్రింటింగ్‌కు పంపించు" చెప్పాడు భీష్మాచార్య.



## ఇంకెవరు? నాభార్యే

ఒకానొక సినిమాతార చర్చిల్‌ను ఒక విందులో కలిసి పిచ్చాపాటి ప్రారంభించింది. తర్వాత ఉన్నట్లుండి 'ఈ ప్రపంచంలో అత్యంత అందమైన ఆడవాళ్లలో గొప్పవ్యక్తి ఎవరు?' అని ప్రశ్నించింది.

కనీసం మొహమాటానికైనా అతను తనపేరే చెబుతాడని ఆమె ఆశ. అయితే ఆయన మాత్రం 'ఇంకెవరు? నాభార్యే!' అన్నాడు తడుముకోకుండా.

నిజంగా కూడా చర్చిల్ భార్య క్లిమెంటైన్ గొప్ప అందగత్తె. కష్టసుఖాల్లో భర్త వెన్నంటి నిలిచిన ఆదర్శ మహిళ. అందుకే అదేవిషయాన్ని చర్చిల్ తరచూ ప్రస్తావించేవాడు.

అప్పుడే టేబుల్ మీద వున్న ఫోన్ మోగింది. అతని మనసేదో కీడుని శంకించింది.

రిసీవర్ లిఫ్ట్‌చేసి "హలో. భీష్మాచార్య స్పీకింగ్" అన్నాడు.

అవతలవైపు తెరలు తెరలుగా నవ్వు.

"హూ ఈజ్ ఆన్‌ది లైన్?" కోపంగా అడిగాడు భీష్మాచార్య.

"దాదామియా నువ్వు ఎవరి సామ్రాజ్యాన్ని పెకిలించేయాలని అనుకుంటున్నావో

ఆ దాదామియానే"

"నువ్వా. అయితే ఏమిటి? "

"నీ దగ్గరున్న ఆధారాలు అన్నీ నాకు అర గంటలో అందాలి. అందుకు ఎంత కావాలో చెప్పు. కరెన్సీలో అయినా ఓ. కె."

"షటప్ ఐసే! నీలా కరెన్సీ కోసం గడ్డితినే రకం కాదు. నిన్ను ఉతికి ఆరేస్తాను"

"భీష్మాచార్యా! నువ్వు అగ్నిపర్వతాన్ని ముట్టుకోవాలని అనుకుంటున్నావు"

"కాదు. దాన్ని బూడిదగా మార్చాలని అనుకుంటున్నాను".

"అందుకు పర్యవసానం చాలా తీవ్రంగా వుంటుంది."

"నీలాంటి వాళ్ళ బెదిరింపులు నన్నేమీ చేయలేవు."

"నువ్వు పత్రికలో నా ఫొటోలు అచ్చేయ కముందే ప్రెస్సు నేలపాలవుతుంది. నీ వాళ్ళంతా నీ ఇంట్లో సజీవ సమాధి అవుతారు".

"బెదిరిస్తున్నావా దాదామియా"

"కాదు ఫ్యూచర్‌ని చెబుతున్నాను"

"ముందు నీ భవిష్యత్తు చూసుకో. పెట్టేయ్ ఫోన్" కోపంగా అని రిసీవర్ పెట్టేశాడు భీష్మాచార్య.

తుఫానుకు ముందు ప్రశాంతతలా వుంది. ఏ క్షణం ఏ విధ్వంసం జరుగుతుందో?

భీష్మాచార్య ఫోన్ పెట్టేశాడు కానీ అతని మనసంతా ఇంటిమీదే వుంది. తన భార్యకు, పిల్లలకు ఏమీకాదుకదా. ఆ ఆలోచన రావడంతోనే వెంటనే ఇంటికి బయల్దేరాడు.

★ ★ ★

ఇంటిముందు ఇష్టంగా పెంచున్న గులాబీ చెట్లు చెల్లాచెదురై వున్నాయి. తన లాన్ అంతా చిందరవందరగా వుంది. పూలకుండీలు పగిలిపోయి వున్నాయి. ఇంటికి కాపలాగా వుండే అల్సేషియన్ డాగ్ చచ్చి పడి వుంది.

భయం మొదలైంది. అతని మనసులో ఏదో భయం. ఒక్క ఉదుటున లోపలికి పరుగెత్తాడు. రక్తపు మడుగులో భార్యా, పిల్లలు ఘోరంగా హత్యచేయబడి ఉన్నారు. గట్టిగా అరిచాడు భీష్మాచార్య మోకాళ్ళ మీద కూలబడిపోయాడు. అతని గోడు వినడానికి ఆ గదిలోని గోడలు తప్ప వేరెవరూ లేరు.

★ ★ ★

పత్రికాఫీసు నుంచి ఫోన్. పత్రికాఫీసును ఎవరో బాంబుతో పేల్చేశారు. జాన్‌డేవిడ్ ఎడమకాలు ఆ బాంబు బ్లాస్ట్‌లో తెగిపోయింది.

ఒకేసారి రెండు దుర్మరణాలు.

ఇది జరగటానికి అరగంట ముందే దాదామియా మీద విల్సన్ ముఠావాళ్ళు దాడి చేశారని, ఆ దాడిలో దాదామియా గాయపడి హాస్పిటల్‌లో చికిత్స పొందుతున్నాడన్న వార్త వచ్చింది.

అదంతా అబద్ధమని వైరిపక్షాలైన దాదామియా విల్సన్‌లు కలిసి ఆడిన నాటకమని తెలిసినా ఏమీ చేయలేని స్థితి.

★ ★ ★

జాన్‌డేవిడ్ కళ్ళు తుడుచుకుంటూ చెప్పడం కొనసాగించాడు. అదీ జరిగింది. ఆ రోజు నుంచి భీష్మాచార్యగారు తాగుడుకి బానిసయ్యారు. ఆ అనుక్షణం అతనికి కళ్ళముందు తనవాళ్ళే కనిపిస్తారు. కాని ఈ వ్యవస్థ మీద కసి. ఈ నేరవ్యవస్థ మీద కసి డైలీన్యూస్‌ని ప్రాణంలా చూసుకుంటారు. ఈ పత్రికాధిపతి మంచి భావాలున్న వ్యక్తి. భీష్మాచార్య అంటే అతనికి గౌరవం. అందుకే భీష్మాచార్య కోసం పత్రికను ఎన్ని ఒడిదుడుకులైనా నడిపిస్తున్నాడు. ఎప్పటికైనా దాదామియా అంతు చూడాలనే భీష్మాచార్యగారి పట్టుదల. దానికి సంబంధించిన ఆధారాలు చాలా సేకరించాం. ఇంకా సేకరించాలి."

అనిమిష మాట్లాడలేదు. ఇలాంటి విషాద నేపథ్యం ఏదో ఉండి ఉంటుందని ఆమె

మొదట్నుంచీ అనుకుంటూనే ఉంది. చేతికి ఉండే అయిదు వేళ్ళు ఒకేలా వుండవన్నట్టు ఏ రెండు విషాదాలు ఒకేలా వుండవేమో! తాను భీష్మాచార్యలాంటి వ్యక్తికి ఏ విధంగా సాయపడగలదు?

"ఏంటీ ఆలోచిస్తున్నారు. మీరు ఢీకొనేది దాదామియాలాంటి భయంకరమైన వ్యక్తితో అందుకే భీష్మాచార్యగారు మిమ్మల్ని అటు వైపు వెళ్ళొద్దన్నారు. చాలా పత్రికలు ఆయన గురించిన ఆధారాలు తెలిసినా ప్రచురించకపోవడానికి కారణాలు రెండు. ఒకటి దాదామియాను ఎదురిస్తే జరిగే విపరీత పరిణామాలు ఎలా వుంటాయో తెలుసు. రెండు ఆర్థిక సంపత్తి సరిగ్గా లేని పత్రికలు ఇలాంటి సాహసం చేయలేకపోతున్నాయి. ప్రభుత్వాన్ని కూడా బ్లాక్‌మెయిల్ చేయగల సమర్థుడు దాదామియా".

"అలా అని మనం అతనికి భయపడి ఊర్కోవాలా? " అడిగింది ఆవేశంగా అనిమిష.

"అదను చూసి వేటువేయాలి. అందుకు ఎన్నో ఆధారాలు సమకూర్చుకోవాలి. దాదామియాను ఎదిరించాలంటే సాహసం ఒక్కటే సరిపోదు. అంగబలం. అర్థబలం కావాలి. సమయస్ఫూర్తి సాహసం వుండాలి" జాన్‌డేవిడ్ చెప్పాడు.

అనిమిష ఆలోచనలో పడింది. నిజమే ఓ మహావృక్షాన్ని సమూలంగా కూకటివేళ్ళతో పెకిలించాలంటే అంత సులువైన విషయం కాదు.

"సరే మీరు యింటికి వెళ్ళి రెస్ట్ తీసుకోండి. అన్నట్టు ఒక్క విషయం. భీష్మాచార్య గారికి తెలియకుండా ఏ రిస్కూ చేయకండి" చెప్పి బయటకు నడిచాడు జాన్‌డేవిడ్.

★ ★ ★

దాదామియా సీరియస్‌గా వున్నాడు. అక్కడున్న వాళ్ళంతా ఏ క్షణం ఏ పిడుగు తమ మీద పడుతుందేమోనన్నంత భయంగా ఉన్నారు.

"రాత్రి మన డెత్‌జోన్‌లోకి ఓ అపరిచిత వ్యక్తి వచ్చారు. మీరు గమనించారా? "

సెక్యూర్టీ చీఫ్‌కు పైప్రాణాలు పైనే పోయాయి.

"అదీ అదీ" అంటూ నీళ్ళు నమిలాడు.

'ఓ ఆడది ధైర్యంగా మన డెత్‌జోన్‌లోకి ప్రవేశించింది. ఆ విషయాన్ని మీరు నాకెందుకు రిపోర్ట్ చేయలేదు". సెక్యూరిటీ చీఫ్ వైపు చూసి అడిగాడు దాదామియా.

'పొరపాటున మన ఏరియాలోకి వచ్చిందని అనుకున్నాం' సెక్యూరిటీ చీఫ్ నీళ్ళు నమిలాడు.

"పొరపాటున రాలేదని తెలిసేక ఏం చేయాలి? " సూటిగా అడిగాడు దాదామియా.

'ఫినిష్ చేయాలి" చెప్పాడు సెక్యూరిటీ చీఫ్.

"కానీ ఎందుకు ఆ పని చేయలేదు? "

"అప్పటికే పోలీసు పెట్రోలింగ్ వెహికల్ వచ్చింది. ఆ జాన్‌డేవిడ్ కూడా అమ్మాయిని ఫాలో అవుతున్న విషయం తెలిసింది".

"మనకు తెలియకుండా ఓ అమ్మాయి ధైర్యంగా మన డెత్‌జోన్‌లోకి వచ్చింది. ఇంతమంది ఆయుధాలున్న మగాళ్ళు వుండి ఏం చేశారు? " కంగున మోగింది దాదామియా కంఠం.

"ఈ ఒక్కసారికి మన్నించండి సాబ్" అన్నాడు సెక్యూరిటీ చీఫ్.

"నాకు శిక్షించడాలు తప్ప మన్నించడాలు తెలియవు" కోపంగా అన్నాడు దాదామియా.

"ఈ ఒక్కసారికి మన్నించండి. ఇంకెప్పుడూ ఇలాంటివి జరక్కుండా చూసుకుంటాను" చెప్పాడు సెక్యూరిటీ చీఫ్.

ఒక్క క్షణం తల పంకించి "ఆల్‌రైట్ ఈ ఒక్కసారికి క్షమిస్తున్నాను. మరోసారి క్షమించాలా వద్దా అని ఆలోచించడానికి నువ్వుండవు. జావ్" కోపంగా అన్నాడు దాదామియా.

సెక్యూరిటీ చీఫ్ ఓ చిన్న నిట్టూర్పు విడిచి వెనక్కి తిరిగాడు.

అతని ముందు పొడవాటి టేబుల్ ఉంది. సలీం, షంషేర్ ఇంకా మిగతా ప్రాంతాల నుంచి వచ్చిన అతని ప్రతిని ధులు ఉన్నారు.

'షంషేర్ నా పని ఎంతవరకు వచ్చింది?'

"ఆ అనిమిష హైదరాబాద్‌లో లేదని నా అనుమానం. కేవలం అక్కడ ఉన్నట్టు నన్ను మోసం చేసిందని నా ఫీలింగ్ దాదా మియా సాబ్. అది చాలా ప్రమాదకరమైనది. దాని దగ్గర మన దొంగనోట్లకు సంబంధించిన నెంబర్లు ఉన్నాయి. అసలు నోట్లకు సంబంధించిన నెంబర్లు ఉన్నాయి. అంతేకాదు సాబ్ మరో విషయం తెలిసింది. కోటి రూపాయల గల్లంతు శర్మ చావు అనిమిష పారిపోవడం గురించి సీబీఐ ఎంక్వయిరీ చేస్తోందని తెలిసింది"

"అంటే మనం ఇప్పుడు చిక్కుల్లో ఉన్నామా?"

"ఈ పరిస్థితుల్లో అనిమిష సీబీఐ వాళ్లకు దొరికితే చాలా ప్రమాదం"

"ఆ విషయం నింపాదిగా నాకు చెబుతున్నావా? మరేం చేస్తున్నావు?" సీరియస్‌గా అడిగాడు దాదామియా.

షంషేర్ నీళ్లు నమిలాడు. సలీం మనసులో ఏదో చిన్న అనుమానం.

"దాదామియా సాబ్ చిన్న డౌట్. స్లమ్ ఏరియాలో మనకు ఓ ఆడది అడ్డుపడింది. మన డెత్‌జోన్‌లోకి ఓ ఆడది ప్రవేశించింది. ఇప్పుడు షంషేర్‌ని ఇబ్బంది పెడుతున్నదీ ఓ ఆడది. ఈ ముగ్గురు ఒక్కరే ఎందుకు కాకూడదు" అడిగాడు సలీం.

దాదామియా వెంటనే సెక్యూరిటీ చీఫ్‌ని పిలిచి "మన డెత్‌జోన్‌లో ప్రవేశించిన అమ్మాయి తాలూకు డిటైల్స్ ఉన్న క్యాసెట్ తీసుకురా"

డెత్‌జోన్‌లో ప్రవేశించే ఎవరైనా దాదా మియా ఏర్పాటుచేసిన నిఘా కెమేరాల నుంచి తప్పించుకోలేరు. అతి శక్తివంతమైన ఆ నిఘా కెమేరాలు చిత్రీకరించిన దృశ్యం తాలూకు వీడియో క్యాసెట్ క్షణాల్లో వచ్చింది.

★ ★ ★

టీవీలో అనిమిషను చూసిన షంషేర్ ఉలిక్కిపడ్డాడు.

"అదే! అదే అనిమిష" అరిచాడు ఒక్కసారిగా.

"బాగా చూడు. నువ్వు చెప్పిన అమ్మాయి అదేనా?"

"సందేహం లేదు. దాదామియా సాబ్. ఆ సివంగి చూపు నాకు బాగా గుర్తు నన్ను కాళికలా చూసింది"

"ఐసీ మరిప్పుడు ఆ అమ్మాయి ఇక్కడికి ఎలా వచ్చింది. ఆ జాన్‌డేవిడ్ భీష్మాచార్య కుడిభుజం కదా అంటే ఆ అమ్మాయికి భీష్మాచార్యకు ఏదో సంబంధం ఉండి ఉండాలి" ఆలోచిస్తూ అన్నాడు దాదా మియా.

"అదేంటో నేను కనుక్కుంటాను దాదా మియా సాబ్" షంషేర్ అన్నాడు.

"నీవల్ల కాకపోతే చెప్పు. అమ్మాయి అందంగా ఉంది. నేనే ఓ చూపు చూస్తాను" వికృతంగా అన్నాడు సలీం.

దాదామియా షంషేర్ వైపు తిరిగి "నువ్వా పనిలో ఉండు. అన్నట్టు నాకు భీష్మాచార్య గురించి తెలియదు. వాడో జిత్తులమారి. చాలా ప్రమాదకరమైన వ్యక్తి. మనవాళ్లని సాయంగా తీసుకువెళ్లు. ముందు ఆ అమ్మాయి గురించి ఎంక్వయిరీ చేయి. తొందరపడి ఆ అమ్మాయిని ఫినిష్ చేయకు. మనకు సంబంధించిన ఆధారాలు ఆ అమ్మాయి దగ్గర ఏమున్నాయో గమనించు"

"అలాగే సాబ్" అన్నాడు షంషేర్.

దాదామియా ఆలోచనలో పడ్డాడు. అతను శత్రువును ఎప్పుడూ తక్కువ

అంచనా వేయడు. అతని మెదడు పాద రసం కన్నా వేగంగా పనిచేస్తుంది. శత్రువును ఆలోచనతో ఎదుర్కోవాలి. ఆ తర్వాత ఆయుధంతో తుదముట్టించాలి అన్నది అతని థియరీ.

★ ★ ★

అనిమిష అటూ ఇటూ పచార్లు చేస్తోంది. ఆమెకెందుకో ఆ వింత ఆకారం మీద అనుమానం కలుగుతోంది. అది నిజంగా వింత ఆకారమా? తను భయంతో సరిగ్గా గమనించలేదు గానీ ఆమెకెందుకో ఆ వింత ఆకారం మనిషేమోనన్న అనుమానం కలుగుతోంది.

అది నిజంగా వింత ఆకారం కాదు అన్న విషయం బయటపెట్టాలంటే ఏం చేయాలి? అలా ఆలోచిస్తూ ఆలోచిస్తూనే ఆమెకు ఓ షార్ప్ థాట్ ఫ్లాష్ అయింది. వెంటనే భీష్మాచార్య దగ్గరికి వెళ్లింది.

అతను వాలుకుర్చీలో కూచొని తల వెనక్కు వాల్చి రెస్ట్ తీసుకుంటున్నాడు.

"సా ర్' పిలిచింది అనిమిష.

కళ్లు తెరవకుండానే అన్నాడు భీష్మాచార్య.

"ఇంట్లో అంకుల్ అని పిలువు. విషయం ఏమిటి? "

"వింత ఆకారం మీద అనుమానంగా ఉంది"

"ఏమని"

"ఆ వింత ఆకారం నిజంగా వింత ఆకారం కాదని"

"మరి ఆ వింత ఆకారం ఏమిటి? "

"ఎవరో అలా ఆ గెటప్ వేయించి నాటకం ఆడుతున్నారని"

"ఎందుకలా చేస్తున్నారని నీ అనుమానం? "

"ఏదో ప్రయోజనాన్ని ఆశించి చేస్తూ ఉండొచ్చు లేదా శాంతిభద్రతల సమస్యను పెద్దదిగా చేయడానికి చేసి ఉండొచ్చు పైశాచికమైన ఆనందం కోసం చేయొచ్చు. "అవతలవాళ్లు ఏ పర్పస్‌తో ఈ పనిచేశారో తేలుద్దామని"

"ఎలా"

"వింత ఆకారం జంతువు కాదు మనిషే అన్న వార్త రాద్దాం"

"రాసేక"

"నిజంగా అది వింత ఆకారమే అయితే ఏ రెస్పాన్స్ ఉండదు. మామూలుగా అది దాడిచేస్తూనే ఉంటుంది. ఈ మూడు రోజులుగా శివారు ప్రాంతంలోని ఈ వింత ఆకారం దాడులు జరుగుతున్నాయి. వింత ఆకారానికి ప్రాంతాల గురించి ఏమీ తెలియదుగా. మనం ఎప్పుడైతే ఈ వార్త పబ్లిష్ చేస్తామో దాని వెనుక మనుష్యుల కుట్ర వుంటే ఖచ్చితంగా బయటపడతారు"

ఆమె ఐడియా అతనికి నచ్చింది.

"ఇప్పుడు ఏం చేస్తావు? "

"మనమే ఓ వింత ఆకారాన్ని సృష్టిద్దాం"

"మనమా"

"మన ప్రెస్‌లో వున్న అయిదడుగుల వ్యక్తికి వింత ఆకారం గెటప్ వేద్దాం. అది పరుగెడుతున్న ఫోటో తీసి వేద్దాం. తర్వాత అవతల వైపు రియాక్షన్ ఎలా వుంటుందో చూద్దాం".

"వెరీగుడ్ ఐడియా ప్రొసీడ్" అభినందనపూర్వకంగా అన్నాడు భీష్మాచార్య.

"థ్యాంక్యూ సార్! సారీ థ్యాంక్యు అంకుల్" అని ఉత్సాహంగా ప్రెషప్ అయి ప్రెస్‌కు బయల్దేరింది. జాన్‌డేవిడ్‌ని కలిసి తన ప్లాన్ చెప్పింది. అప్పటికే భీష్మాచార్య జాన్‌డేవిడ్‌కు విషయం చెప్పి ఏంచేయాలో ఇన్‌స్ట్రక్షన్స్ యిచ్చాడు.

ఓ అయిదడుగుల వ్యక్తికి వింత ఆకారం గెటప్ వేశారు. రకరకాల యాంగిల్స్‌లో ఫోటోలు తీయించారు.

అనిమిష గబగబ న్యూస్ రాయడం

*దేవుడు ఇంకా గొప్ప విషయాలకోసం మనలను మలిచేందుకు వాడే పరికరాలే కష్టాలు.* – *హెచ్.డబ్ల్యూ– బీచర్*

మొదలుపెట్టింది. భీష్మాచార్య అయితే ఎలా న్యూస్‌ప్రెజెంట్ చేస్తాడో గుర్తుచేసుకొంది. తను రాసిన న్యూస్‌ని ఫోన్‌లో చదివి భీష్మా చార్యకు వినిపించింది. చిన్నచిన్న కరెక్షన్స్ చెప్పాడు.

ఆ వార్త తెల్లవారితే సంచలనం సృష్టించ డానికి ఆయత్తమవుతోంది.

★ ★ ★

అనుకున్నట్టుగానే ఆ వార్త సంచలనం సృష్టించింది. అప్పటి వరకు భయం గుప్పెట్లో వున్న వాళ్ళు తేలిగ్గా ఊపిరిపీల్చు కున్నారు.

కొందరు ధైర్యస్థులు వెంటనే ఓ గ్రూప్‌గా ఏర్పడి, ఒకవేళ వింత ఆకారం ముసుగులో ఎవరొచ్చినా కర్రలతో బుద్ధి చెప్పడానికి సిద్ధంగా వున్నారు.

ఎప్పుడైతే వింత ఆకారం జంతువు కాదని తేలిందో, మళ్ళీ జనంలో కొత్త ధైర్యం. ఆ రాత్రి రోడ్లు నిర్మానుష్యంగా లేవు.

★ ★ ★

విస్కీగ్లాసు వెళ్ళి గోడకు తగిలి భళ్ళున పగిలి ముక్కలైంది. దాదామియా కళ్ళు ఎర్ర బడ్డాయి. అతను అసహనానికి గురవుతు న్నాడు. అతని చేతిలోని డైలీన్యూస్ పేపర్ నలిగిపోతుంది.

షంషేర్, సలీం మొదటిసారిగా దాదా మియా వైపు విచిత్రంగా చూస్తున్నారు. ఎలాంటి వార్త వచ్చినా చలించని దాదా మియా ఈ వార్తకే ఎందుకిలా బరస్ట్ అయి పోతున్నాడో అర్థం కాలేదు.

అదే విషయం అడిగారు దాదామియాని. దాదామియా మాట్లాడలేదు. తన టేబుల్ మీద వున్న స్విచ్ బోర్డ్‌లోని ఓ బటన్ నొక్కాడు. సెక్యూరిటీ చీఫ్ వచ్చాడు. చేతులు కట్టుకొని నిలబడ్డాడు.

"వాళ్ళను రమ్మను" చెప్పాడు.

అయిదు నిమిషాలు తర్వాత పది వింత ఆకారాలు వచ్చాయి.

అందరూ అయిదు అడుగుల్లోపే వున్నారు.

ఢిల్లీ శివారు ప్రాంతంలో వింత ఆకారాల పేరుతో దాడి చేసేది వాళ్ళే.

"చెప్పండి మీలో ఆ పత్రికలో వున్నది ఎవరు? మీరెలా ఆ కెమెరాకు చిక్కారు?"

వింత ఆకారం వేషాలు వేసుకున్న వాళ్ళు భయపడిపోయారు.

"మేమెవరం కాదు" ముక్త కంఠంతో చెప్పారు.

సెక్యూరిటీ చీఫ్ కూడా స్థిరంగా చెప్పాడు.

"వాళ్ళెవరూ అయ్యే అవకాశం లేదు సార్"

"మరి ఈ పత్రికలో వున్నదెవరు? మన డెత్‌జోన్ పరిసర ప్రాంతాలకు ఎవరూ రావద్దని నేనీ వింత ఆకారాల నాటకం మొదలు పెట్టాను. వింత ఆకారాల వార్తలు గుప్పుమన్నాక శివారు పరిసర ప్రాంతాలు నిర్మానుష్యమయ్యాయి. మన పని చాలా తేలికైంది. ప్రజల్లో భయాందోళనలు మొద లయ్యాయి. అది మనకు ఎంతో లాభి స్తుంది.

కానీ, ఇప్పుడిలా వింత ఆకారాల నాటకం బయటపడితే జనంలో భయం పోతుంది. వింత ఆకారం జంతువు కాదు, మనిషే అని తెలిసిన మరుక్షణం జనం రెచ్చిపోతారు. జనాన్ని ఎప్పుడూ భయం గుప్పిట్లోనే వుంచాలి. అదీగాక మనం ఓ పొరపాటు చేశాం" అని ఆగాడు దాదామియా.

ఏమిటన్నట్లు చూశాడు సెక్యూరిటీ చీఫ్.

"వింత ఆకారాలను మన శివారు ప్రాంతా నికే పరిమితం చేశాం. దాన్ని ఢిల్లీలో గల్లీగ ల్లీకి వదిలేయాలి. అప్పుడే ఇది నాటకం కాదని జనానికి భయం మొదలవుతుంది. ఎప్పుడు ఎలా ఎవర్ని ఎటాక్ చేస్తుందో వూహకు అందకుండ ఎటాక్ మొదలవ్వాలి"

సెక్యూరిటీ చీఫ్ అలాగే అన్నట్టు తలూ పాడు.

దాదామియా వింత ఆకారాల వేషాల్లో వున్న మనుష్యులకు చెప్పాడు.

"మీరు ఎటువంటి పరిస్థితుల్లోనూ ఎవరికీ దొరకొద్దు. అలాంటి పరిస్థితి వస్తే అవతల వ్యక్తిని సఫా చేయాలి అర్థమైందా."

అర్థమైందన్నట్టు తలూపారు వాళ్ళు. దాదామియా వాళ్ళను వెళ్ళమన్నాడు. అదే అతను చేసిన పొరపాటు అని అతనికా క్షణం తెలియదు.

★ ★ ★

అనిమిష చకాచకా పావుల్ని కదపడం మొదలు పెట్టింది.

యుద్ధరంగంలో సైనికులను ఎప్పటికప్పుడు విజయానికి అభిముఖంగా నడిపించాలి. సుశిక్షితులైన సైనికులను నడిపించవలసింది సైన్యాధిపతే. ఇప్పుడా పాత్ర అనిమిష పోషిస్తోంది.



దాదామియా ఎలా రియాక్టవుతాడో ఊహించింది. ఆమె ఊహ కొంతవరకు నిజమైంది.

ఆ రోజు రాత్రి ఢిల్లీలో చాలా ప్రాంతాల్లో వింత ఆకారాలు కనిపించాయి. బాధితులు పత్రికాఫీసులకి ఫోన్ల మీద ఫోన్లు చేస్తున్నారు. కంట్రోల్ రూమ్ ఆ ఫోన్ కాల్స్‌తో బిజీగా ఉంది. పెట్రోలింగ్‌కు వెళ్తున్న ఓ పోలీసు వెహికిల్ మీద కూడా దాడి జరిగింది. కన్ను మూసి తెరిచేలోగా ఈ దాడులు పూర్తవుతున్నాయి. గెరిల్లా దాడులను మరిపించే రీతిలో వింత ఆకారాల దాడి మొదలైంది.

నగరమంతా గగ్గోలు. అనిమిష వెంటనే రంగంలోకి దిగింది. మెరికల్లాంటి యువకుల్ని సిద్ధం చేసింది. అప్పటికే అధికారులు వింత జీవిని వీడియో తీసినవారికి బహుమతి ప్రకటించారు.

(ఢిల్లీలో ఓ వింత ఆకారం దాడిచేయడం నిజంగానే జరిగిన సంఘటన. దాని వెనుకవున్న నేపథ్యం మాత్రం కల్పితం. అధికారులు వింత జీవిని వీడియో తీస్తే బహుమతి కూడా ప్రకటించారు. వింతజీవి మిస్టరీని ఇప్పటివరకు ఎవరూ ఛేదించలేకపోయారు - రచయిత్రి)

★ ★ ★

భీష్మాచార్య, జాన్ డేవిడ్, అనిమిష ముగ్గురూ సీరియస్‌గా చర్చించుకుంటున్నారు.

'మన ఆలోచన కరెక్ట్ అయింది. మనం వింత ఆకారానికి సంబంధించి, అదీ ఒకే ప్రాంతానికి పరిమితమైందని ఎప్పుడైతే రాశామో, అనుమానం రాకూడదని దాదామియా అతి తెలివిగా నగరమంతా ఆ వింత ఆకారాలను వదిలిపెట్టాడు. వింత ఆకారాలు చదవలేవని పథకం ప్రకారం దాడి చేయలేవని గ్రహించలేకపోయాడు. ఇదే మంచి అవకాశం. మనం మెరికల్లాంటి యువకులకు వీడియో కెమెరాలనిచ్చి అన్ని ముఖ్య ప్రాంతాల్లో పహారా కాస్తాం. ఖచ్చితంగా దొరికిపోతాడని నాకు నమ్మకముంది" అంది అనిమిష.

భీష్మాచార్య అనిమిష వైపు అభినందనపూర్వకంగా చూశాడు.

ఆమె తెలివితేటలు చూస్తుంటే అతనికి ముచ్చటేస్తోంది.

"అయితే ఇప్పుడు మెరికల్లాంటి యువకులు కావాలి. అంతేనా? ' అడిగాడు భీష్మాచార్య.

"అవును మన రిపోర్టర్లనే ఆ పని చెయ్యమంటే సరి. కొన్ని ప్రాంతాల్లో ఔత్సాహికు

లైన యువకులను ఆహ్వానిద్దాం"

"ఎలా? " అడిగాడు జాన్ డేవిడ్.

"వింత ఆకారాన్ని కనిపెట్టాలని ఆసక్తి ఉన్న యువతకు ఇదే మా ఆహ్వానం అంటూ ఓ ప్రకటన ఇద్దాం. వాళ్లలో షార్ప్‌గా ఉన్న వాళ్లను వీడియోగ్రఫీలో అనుభవం ఉన్న వాళ్లని మనం సెలెక్ట్ చేద్దాం. వాళ్లకూ ఇది థ్రిల్లింగ్‌గానే ఉంటుంది"

"ఐడియా బాగానే ఉంది. దాని వలన దాదామియాకు కలిగే నష్టం ఏమిటి? "

ఒక్క క్షణం భీష్మాచార్య వంక చూసి చెప్పింది.

"మానసికంగా దెబ్బతినడం, ఓటమి సైకలాజికల్‌గా అతనికి ఇది ఎదురుదెబ్బ అవుతుంది. అతను ఏ ప్రయోజనాన్ని ఆశించి ఇదంతా చేశాడో అది నెరవేరదు. అతడిని దెబ్బతీయడానికి మనకు ఇంతకన్నా మంచి అవకాశం దొరకదు"

అదీ సబబే అనిపించింది భీష్మాచార్యకు.

"వెరీ గుడ్ అనిమిషా. నువ్వు చెప్పిన ఐడియా బావుంది. అయితే ఒక్క విషయం. దాదామియాను తక్కువ అంచనా వేయొద్దు. శత్రువును ఎప్పుడూ మనం నిర్లక్ష్యం చేయకూడదు. తెలివైన శత్రువు సమయం కోసం వేచిచూస్తాడు. ఎప్పుడూ మన నీడ మాటునే పొంచివుంటాడు. దాదామియా అతి ప్రమాదకరమైన శత్రువు. అతను శత్రువును భౌతికంగా కన్నా మానసికంగా దెబ్బతీయడానికి ప్రయత్నిస్తాడు" అలా అంటున్నప్పుడు భీష్మాచార్య గొంతు వణికింది. అతను ఓ పథకం ప్రకారం దాడి మొదలుపెడతాడు. మనం అతని దాడిని తిప్పికొడుతున్నామన్న ఆనందంలో ఏమరుపాటుగా వుంటే చాలా కష్టం."

"యస్. మీరన్నది నిజమే శత్రువును మనం విస్మరించకూడదు" స్వగతంగా అనుకుంది అనిమిష.

"మరో విషయం" అన్నాడు అనిమిష వంక చూస్తూ భీష్మాచార్య.

ఏమిటన్నట్టు చూసింది అనిమిష.

"అతని శత్రువుల లిస్టులో ఈ క్షణం నుంచి నువ్వు కూడా చేరుతున్నావు. అతని నెట్‌వర్క్ పెద్దది. ఇక నుంచి నువ్వు చాలా ఎలర్ట్‌గా ఉండాలి. ఒంటరిగా వెళ్లే సాహసం చేయొద్దు. నువ్వు ఢీకొనేది మాఫియా అనే మహాపర్వతాన్ని. దాని తాలూకు దెబ్బ ఎలా వుంటుందీ అనుభవించినవాడిని" అన్నాడు భీష్మాచార్య.

"ఆ మహా పర్వతాన్ని అక్షరాల డైనమేట్లతో పేల్చివేస్తాను" మనసులో అనుకుంది అనిమిష.

★ ★ ★

అనిమిష వెళ్ళిపోయాక భీష్మాచార్య జాన్‌డేవిడ్‌తో మాట్లాడాడు.

"డేవిడ్! అనిమిషను జాగ్రత్తగా ఫాలో అవ్వు. ఆ అమ్మాయిలో కసి ఉంది. కానీ పసితనం! కసి ఆమెకు ప్రమాదకరం. నిజానికి ఆమెను ఓ అస్త్రంలా ఎక్కుపెట్టాలని అనుకున్నాను. కానీ స్వార్థానికి స్నేహితుడి కూతురిని బలిపెట్టకూడదని అనుకుంటున్నాను. ఆమె ఉత్సాహం మంచిదే. కానీ ఉత్సాహం ఎన్నో ఉత్పాతాలను సృష్టిస్తుంది. టేక్ కేర్ ఆఫ్ హర్."

జాన్‌డేవిడ్ 'అలాగే' అన్నాడు. భీష్మాచార్య తన గదిలోకి వెళ్ళాడు. గోడమీద తమ కుటుంబం ఫొటో. అతని బుగ్గలపై ఓ కన్నీటి చుక్క జారి నేలపై పడి ఆత్మార్పణ చేసుకుంది.

★ ★ ★

అనిమిష పత్రికలో ఇచ్చిన ప్రకటనకు ఊహించని రెస్పాన్స్ వచ్చింది. అలాంటి ప్రకటన కొందరికి థ్రిల్లింగ్‌గా అనిపించింది. నిరుద్యోగులైన యువకులు వచ్చారు.

వింత ఆకారాన్ని వీడియో తీసిన వారికి

విజ్ఞాన వంతుడు చూచిన వృక్షాన్ని మూర్ఖుడు ఎన్నటికీ చూడలేడు.
– ఒక సామెత

ప్రభుత్వం యిచ్చే బహుమతి కాకుండా, పత్రిక తరఫున పారితోషికం వుంటుందని చెప్పింది. అది చాలా మంది యువకులను ఆకర్షించింది. అమ్మాయిలు కూడా పెద్ద సంఖ్యలో ఈ వెంచర్‌లో పాల్గొంటామని చెప్పారు.

వచ్చిన వాళ్ళలో వీడియో టచ్ ఉన్నవాళ్లను సెలక్ట్ చేసుకుంది. పర్‌ఫెక్ట్‌గా ఎలా షూట్ చేయాలో ప్రొఫెషనల్ వీడియో గ్రాఫర్స్‌తో రెండుగంటలు క్లాసు యిప్పించింది. ఇదంతా పత్రికాఫీసులో కొత్త ఉత్సాహాన్ని నింపింది.

ఆ రోజు రాత్రి వింత ఆకారాలను వీడియో తీయడానికి చాలా మంది యువతీ యువకులు సిద్ధమయ్యారు.

అనిమిష కూడా స్థిరంగా ఉంది.

ఢిల్లీ నగరం నిద్రలోకి జారుకుంటోంది.

కొంతమంది యువతీ యువకులు మాత్రం వీడియో కెమెరాలు భుజాన వేసుకొని గస్తీ తిరుగుతున్నారు. కొంత మందికి సెల్‌ఫోన్లు యిచ్చింది. మరికొందరికి విజిల్స్ యిచ్చింది. ఎవరికి అపాయం వచ్చినా వెంటనే వాటిని ఉపయోగించమని చెప్పింది.

ఇంకో వంక పోలీసు పెట్రోలింగ్ వెహికల్స్ తిరుగుతున్నాయి. పత్రికా రిపోర్టర్లు రెడీగా వున్నారు. ఏ క్షణం ఏవార్త వచ్చినా ఫ్లాష్ చేయడానికి వాళ్ళ కెమెరాలు, పెన్నులు సిద్ధమయ్యాయి.

★ ★ ★

అర్ధరాత్రి పడకొండున్నర దాటుతుండగా అనిమిష ఓసారి అద్దంలో చూసుకొని చేతులకు గ్లౌవుస్ తొడుక్కొని, బయటకు నడ

## చెంచా దొంగకు బుద్ధి

ఓ ప్రముఖవ్యక్తి ఇచ్చే విందుకు హాజరయ్యాడు చర్చిల్. చర్చిల్ వచ్చాడంటే అందులో ఉండే మిగిలిన అతిథులు ఎలాంటివారో ఊహించుకోవచ్చు గదా? అంతా అత్యంత గౌరవనీయులు.. అత్యున్నత స్థాయివారు. అంతలో అతిథులు ఎవరి గొడవలో వారుండగా ఓ ఘరానాపెద్దాయన ఒక వెండి చెంచాను తీసి కోటు జేబులో వేసుకున్నాడు. విందు ఇస్తున్న పెద్దమనిషి ఆ విషయం గ్రహించాడు కానీ ఎలా అడగ్గలడు? దొంగతనం చేసిన వ్యక్తి చాలా గొప్పవాడు. పోనీ పోతే పోయిందిలే బోడి చెంచా అనుకుందామా? అంటే అది చాలా విలువైనది.. అపురూపమైనది.. చారిత్రాత్మకమైనది. కాసేపు మనసులో మథనపడిన ఆయన చివరకు విషయాన్ని చర్చిల్ చెవిలో వేశాడు. చెంచాను ఎలాగైనా ఇప్పిస్తాలే అని అభయమిచ్చాడు చర్చిల్.

తర్వాత చెంచా దొంగిలించిన వ్యక్తి వద్దకువెళ్లి ఆ కబుర్లు ఈ కబుర్లుచెప్పి-

'నేనూ ఓ చెంచా కొట్టేయబోతున్నా' అన్నాడు. ఆ ఘరానాపెద్దాయన గతుక్కుమన్నాడు. నేనూ నీలాంటివాడినే అన్న అర్థం వచ్చేలా నవ్వి చర్చిల్ కొన్నిక్షణాలు గడిచాక అతను చూస్తుండగానే తానో చెంచాతీసి జేబులో వేసుకున్నాడు. తర్వాత చూశావా నా ఘనత అన్నట్లు విజిల్‌వేసి ఆ వ్యక్తికి కన్నుకొట్టి మరోవ్యక్తితో మాట్లాడడానికి అన్నట్లు దూరంగా వెళ్లాడు.

కొద్ది నిముషాల తర్వాత మళ్లీ చెంచాదొంగ వద్దకువచ్చి, 'ప్చ్.. లాభంలేదు ఫ్రెండ్.. మనం చెంచాలు తీయడం యజమాని చూసేశాడు. ఎవరూ చూడకుండా వాటిని టేబుల్‌మీద వదిలేద్దాం' అని చెవిలో చెప్పి తనజేబులో చెంచాతీసి టేబుల్ మీద పెట్టేశాడు. చేసేదిలేక ఘరానా పెద్దాయన కూడా తనజేబులోని చెంచాను టేబుల్ మీద ఉంచాడు. అలా ఆ పెద్దమనిషి పరువును, యజమాని చెంచానూ సమయస్ఫూర్తితో కాపాడాడు చర్చిల్.

వడానికి రెడీ అవుతోంది.

సరిగ్గా అప్పుడే డ్రైవింగ్ మిర్రర్ మీద వున్న ఆమె సెల్‌ఫోన్ రింగయ్యింది.

ఓ.కె. బటన్ ప్రెస్ చేసింది ఆత్రుతగా. ఆమె ముందే అందరికీ ఇన్‌స్ట్రక్షన్స్ యిచ్చింది. ఎవరికి వింత ఆకారం కనిపించినా తనకు ఫోన్ చేయమని.

'హలో అనిమిష స్పీకింగ్' అంది.

"మేడమ్ రింగ్‌రోడ్‌లో వింత ఆకారం కనిపించింది. వెంటనే వచ్చేయండి" అవతల వైపునుంచి ఓ కంఠం కంగారుగా వినిపించింది. ఆ తర్వాత లైన్ కట్ అయింది. అనిమిష ఆ నంబర్ చూసింది. ఆమె మెమరీ పనిచేయడం ప్రారంభించింది. ఆమె మెమరీలో సెల్‌ఫోను నంబర్లు అవి ఎవరెవరికి యిచ్చింది అంతా గుర్తుంది.

సడన్‌గా గుర్తొచ్చింది. అవును ఈ నంబర్‌గల సెల్‌ఫోన్ మోహన్‌కు యిచ్చింది. వెంటనే రింగ్‌రోడ్‌కు బయల్దేరింది అనిమిష.

★ ★ ★

కైనటిక్ హోండా రింగ్‌రోడ్ వైపు వెళ్తోంది. వెహికల్ రింగ్ రోడ్‌ని సమీపిస్తుండగా ఒక్కసారిగా స్ట్రీట్‌లైట్లు ఆఫ్ అయ్యాయి. అనిమిషకు ఆశ్చర్యమేసింది. ఆ తర్వాత అనుమానం కలిగింది. సరిగ్గా తను వచ్చిన టైంలోనే స్ట్రీట్ లైట్లు ఆఫ్ అవడం ఏమిటి?

ఆమె ఆలోచిస్తూనే రింగురోడ్డుకు వచ్చేసింది. మోహన్ కోసం చూస్తోంది. ఉదయం తను అందరి పేర్లు అడిగింది. వాళ్ళ మొహమూ గుర్తు పెట్టుకుంది.

ఎక్కడో ఓ కుక్క మొరిగింది. అనిమిష ఆ చీకటిలో నుంచే కళ్ళు చిట్లించి చూస్తోంది. మరీ చీకటిగా లేకపోయినా తనకు కనిపించే మేర మాత్రమే కొద్దిగా వెలుగు వుంది.

మోహన్! పిలిచింది అనిమిష.

నో రెస్పాన్స్.

ఈసారి గట్టిగా పిలిచింది. అయినా రెస్పాన్స్ లేదు. ఎక్కడ వుండి వుంటాడు. ఓసారి రింగురోడ్డు అంతా ఓ రౌండ్ కొట్టి వచ్చింది. మోహన్ కనిపించలేదు. వెంటనే సెల్‌ఫోన్ తీసి, ఇన్‌కమింగ్ కాల్స్‌లో మోహన్ నంబర్ చూసి సెండ్ బటన్ నొక్కింది. అటువైపు ఫోన్ రింగ్ అవుతోంది. కానీ ఎవరూ లిఫ్ట్ చేయడం లేదు. చాలా సేపు చూసింది అయిదు సెకన్లు పది సెకన్లు పదిహేను ఇరవై ముప్పయి యాభైతొమ్మిది సెకన్లు ఆటోమేటిగ్గా లైన్ కట్ అయింది.

తనకు రింగ్‌రోడ్డు దగ్గర్నుంచే ఫోన్ చేసిన వ్యక్తి ఎక్కడికి వెళ్లాడు. కొంపదీసి అతనికి ఏ అపాయం జరగలేదు కదా

ఆ ఆలోచనే ఆమెకు భయాన్ని కలిగించింది. కైనెటిక్‌తో మరోసారి రింగ్‌రోడ్డు చుట్టు రౌండు కొడుతుండగా, ఓ చోట వీడియో కెమెరా కనిపించింది. ఆమె కైనెటిక్ ఆపి వీడియో కెమెరా దగ్గరకి వెళ్లింది. వీడియో కెమెరా కిందపడి పగిలిపోయి వుంది.

అమె అనుమానం క్షణక్షణానికి రెట్టింపవుతోంది. వెంటనే చుట్టూ చూసింది. కాస్తంత దూరంగా కళ్ళజోడు. చుట్టూ వెతికింది. ఆమె దృష్టి ఓ చోట పడింది. అక్కడ రక్తం మరకలు.

ఆమె గుండె వేగం రెట్టింపైంది. మోహన్‌ని వింత ఆకారం ఏమీ చేయలేదు కదా ఆమె గుండె చిక్కబట్టుకొని అన్వేషించసాగింది. రక్తం మరకలు అక్కడక్కడ వున్నాయి. ఓ చోట ఆగిపోయాయి.

అమె మరోసారి మోహన్ సెల్‌కు ఫోన్ చేసింది. రింగవుతోంది. మోహన్ ఆ చుట్టు పక్కలే వుండి వుంటే ఖచ్చితంగా లిఫ్ట్ చేస్తాడు. రింగయినా లిఫ్ట్ చేయడం లేదంటే ఆమె అలానే రింగ్ చేస్తూ అటూ ఇటూ వెతుకుతూ వుండగా ఎక్కడ్నుంచో చిన్న శబ్దం. సెల్‌ఫోన్ రింగవుతోన్న శబ్దం.

ఆ శబ్దం వచ్చినవైపు అడుగులేస్తూ వెళ్ళింది. ఓ ఎలక్ట్రిక్ పోల్ దగ్గర సెల్ ఫోన్ పడి వుంది. దానికి రక్తం అంటి వుంది. ఆ సెల్‌ఫోన్ చేతిలోకి తీసుకుంది.

ఆమె దృష్టి కాస్త దూరంలో వున్న పొదాల మీదపడింది. ధైర్యం చిక్కబట్టుకొని అటువైపు వెళ్ళింది. అక్కడ పొదల మధ్య మోహన్ శరీరం పడివుంది రక్తసిక్తమై.

వెంటనే అంబులెన్స్‌కు ఫోన్ చేసింది.

★ ★ ★

'సారీ! హీఈజ్ నో మోర్' చెప్పాడు డాక్టర్ విషణ్ణ వదనంతో.

"నో" అరిచింది అనిమిష.

ఉదయమే ఉత్సాహంగా తన దగ్గరికి వచ్చి, ఈ అడ్వెంచర్‌లో తాను పార్టిసిపేట్ చేస్తానని చెప్పిన వ్యక్తి ఇంతలోనే యిలా శవంలా మారిన నిజాన్ని జీర్ణించుకోలేకపోతోంది.

శరీరానికి బలమైన గాయాలే తగిలాయి. గోళ్ళ గుర్తులు వున్నాయి. అవి వింత ఆకారానికి సంబంధించింది. అంతే కాదు

ఆ గోళ్ళలో పాయిజన్ వుంది. ఇనుప బూట్లలాంటి కాళ్ళతో అతని శరీరాన్ని తొక్కారు. జంతువు ఎటాక్ చేసినట్టుంది డాక్టర్ చెప్పాడు.

ఆమె కనుకొలుకుల నుంచి కన్నీళ్ళు బుగ్గలపైకి జారాయి. తన కళ్ళముందే ఎంతో భవిష్యత్తు వున్న ఓ యువకుడు హత్యకు గురికావడం ఆమె జీర్ణించుకోలేపోతోంది.

భీష్మాచార్య ఆమె భుజం మీద చేయివేశాడు.

జాన్‌డేవిడ్ మొహం గంభీరంగా వుంది. వింత ఆకారాన్ని వీడియో తీయడానికి ఉత్సాహవంతులైన వాళ్ళు కావాలని ప్రకటన యిచ్చి ఇరవైనాలుగ్గంటలు కూడా కాలేదు. ఆ ప్రకటనకు స్పందించిన ఓ యువకుడు ఆ వింత ఆకారానికే బలయ్యాడు.

★ ★ ★

మోహన్ చనిపోయాడన్న వార్త సంచలనాన్ని సృష్టించింది. కొన్ని పత్రికలు దానిని చిలువలు పలువలు చేసి రాశాయి. ముఖ్యంగా కొన్ని పోటీపత్రికలు ఇదంతా డైలీ న్యూస్ పత్రికవల్లే జరిగిందని నిందించాయి.

ఒక భయాన్ని పారద్రోలే ప్రయత్నంలో ఆ భయం మరింత రెట్టింపయింది. అతి క్రూరంగా ఓ వ్యక్తి మరణించడం జనంలో ధైర్యాన్ని దైన్యంగా మార్చింది. అప్పటి వరకూ ఉత్సాహంగా వింత ఆకారాన్ని వీడియో తీస్తామన్న యువతీ యువకులు చాలా వరకు ప్రాణభయంతో తప్పుకొన్నారు. ఓ సంఘటన సంచలనమైనప్పుడు అవి నెగెటివ్ యాంగిల్‌లో వున్నప్పుడు మాస్ హిస్టీరియా ఆవరిస్తుంది అనడానికి ఓ ఉదాహరణగా నిలిచింది ఈ సంఘటన.

★ ★ ★

"ఇదంతా నా వల్లే జరిగింది" బాధగా అంది అనిమిష.

"అలా అని ఎందుకనుకోవాలి" అన్నాడు భీష్మాచార్య

"నేనే వెర్రిమొర్రి ప్రయత్నాలు చేశాను. అనవసరంగా ఎంతో భవిష్యత్తు వున్న ఓ యువకుడు అర్థాంతరంగా చనిపోయాడు" బాధగా అంది అనిమిష.

"విషాదం కొన్ని సందర్భాల్లో వివేచనను కూడా చంపేస్తుంది. మనం ఓ మంచి ప్రయత్నం మొదలుపెట్టినప్పుడు ఇలాంటి అవాంతరాలు వస్తూనే వుంటాయి. యుద్ధ రంగంలో అడుగుపెట్టేక ఎంత మంది సైనికులు చచ్చారు, ఎంత బలగం తుడిచిపెట్టుకుపోయింది లాంటి ఆలోచనలు చేయొద్దు గెలుపే ధ్యేయంగా ముందుకు సాగాలి. గతంలో కృష్ణుడు చెప్పిందీ అదే!

నావాళ్ళు 'నా మనుష్యులు' రక్తపాతం అని ఆలోచించొద్దు ఓ యజ్ఞం తలపెట్టినప్పుడు, హోమగుండంలో ఒక్కోసారి మన వాళ్ళ తలలే తెగిపడతాయి. అది హోమంలోని అగ్నిని ప్రజ్వరిల్ల చేయాలి"

చెప్పాడు భీష్మాచార్య.

"మీరెంత చెప్పినా ఓ చిన్న గిల్టీ ఫీలింగ్" అంది అనిమిష.

"పోరాటం విషాదాలకు అతీతంగా మొదలు కావాలి. ఇప్పుడు నువ్వు ఆలోచించవలసింది. మోహన్ మరణం గురించి కాదు, ఆ మరణం వెనుక వున్న నేపథ్యం గురించి! పత్రిక మేనేజ్‌మెంట్‌తో మాట్లాడి ఆ యువకుడి కుటుంబానికి మేలు జరిగేలా ప్రయత్నాలు మొదలయ్యాయి" చెప్పాడు భీష్మాచార్య.

ఆ మాటతో ఆమె మనసు కొద్దిగా తేలిక పడింది.

"అనిమిషా! నీకు మోహన్ ఎన్ని గంటలకు ఫోన్ చేశాడు" అడిగాడు భీష్మాచార్య.

'పదకొండు నలభై నలభై అయిదు నిమిషాల మధ్య సెల్‌ఫోన్‌లో చూస్తే ఇన్‌కమింగ్ కాల్ టైం కరెక్ట్‌గా తెలుస్తుంది" అంది సెల్‌ఫోన్ చేతిలోకి తీసుకొని అనిమిష.

"కానీ డాక్టర్ రిపోర్ట్ ప్రకారం మోహన్ చనిపోయింది పది నలభై పది యాభై అయిదు మధ్య" చెప్పాడు భీష్మాచార్య.

"మరి నాకు ఫోన్ చేసిందెవరు? " ఆశ్చర్యంగా అడిగింది అనిమిష.

"అదే మనం తేల్చుకోవాల్సిన విషయం నాకు మోహన్ కంఠం ఫోన్‌లో ఎలా వుంటుందీ తెలియదు. మామూలుగా మాట్లాడినప్పుడు, ఫోన్‌లో మాట్లాడినప్పుడు కొద్దిపాటి తేడా వుంటుంది. అదీగాక, నువ్వు మోహన్‌తో మాట్లాడింది ఒకేసారి అదీ కొద్దిసేపే. అందుకే నువ్వా కంఠాన్ని గుర్తుపట్టలేకపోయావు"

"అయితే ఫోన్ చేసింది..."

నెమ్మదిగా ఒక్కొ అక్షరం ఒత్తిపలుకుతూ అన్నాడు భీష్మాచార్య

"ఇంకెవరు ఆ వింత ఆకారం ముసుగులోని మనిషే.

"మరి నాకెందుకు ఫోన్ చేసినట్టు? " అనుమానంగా అడిగింది అనిమిష.

"బహుశా నిన్ను కూడా చంపాలన్న ఆలోచన అయివుంటుంది లేదా గాయపర్చాలని అనుకొని వుండొచ్చు ఈ రెండూ కాకపోయినా నిన్ను ఫూల్‌ని చేయడానికి నీలో టెన్షన్‌ని క్రియేట్ చేయడానికి అయి వుంటుంది. చెప్పానుగా దాదామియాను తక్కువగా అంచనా వేయకూడదని.

ఒకే దెబ్బకు రెండు పిట్టల్లా ఒకటి నిన్ను మానసికంగా దెబ్బతీయడం, ప్రజల్లో వింత ఆకారాలపట్ల భయాన్ని మరింత ప్రోది చేయడం. అది దాదామియా టెక్నిక్" అన్నాడు భీష్మాచార్య.

"దానిని మనం తిప్పికొట్టాలి" అంది పట్టుదలగా.

"అదే ఎలా అన్నది ఆలోచించాలి జనం యిప్పుడు మనకు సహకరిస్తారన్నది భ్రమ జనం ఎప్పుడు ఎలా రియాక్ట్ అవుతారో తెలియదు. వాళ్ళ ఆవేశం పాలపొంగులా వుంటుంది. అది స్థిరంగా వుండాలంటే మనమెంతో జాగ్రత్తగా ఆచితూచి అడుగులు వేయాలి" అన్నాడు భీష్మాచార్య.

అనిమిష ఓ నిర్ణయానికి వచ్చింది. తనే వింత ఆకారం అంతు తేల్చాలి. తన నిర్ణయం భీష్మాచార్యకి, జాన్‌డేవిడ్‌కి చెప్పింది.

"నువ్వు చాలా జాగ్రత్తగా వుండాలి. తొందరపడి ఏ నిర్ణయం తీసుకున్నా అది మనకే బెడిసికొడుతుంది. శత్రువు మన కన్నా బలవంతుడు. పైగా మూర్ఖుడు."

"అయినా సరే మనమే గెలుస్తాం" అంది. ఆత్మవిశ్వాసం తొణికిసలాడుతుండగా అనిమిష.

★ ★ ★

యధావిధిగానే ఢిల్లీ నగరం నిర్మానుష్యమైంది. అర్ధరాత్రి కావడం వల్ల పెట్రోలింగ్ వెహికిల్స్ తప్ప మరో శబ్దం లేదు. రోడ్డు మీదికి వచ్చింది అనిమిష. ఆమెకు కాస్త దూరంలో జాన్‌డేవిడ్ ఆమెను అబ్జర్వ్ చేస్తూ వున్నాడు.

కైనెటిక్ హోండాని రింగ్‌రోడ్డు వైపు తిప్పింది. ఆ ప్లేస్‌కు రాగానే ఆమెకు నిన్నటి సంఘటన గుర్తొచ్చింది. ఒక్క రోజులో ఎంత మార్పు? ఓ మనిషి నిర్జీవుడై పోయడు. ఎందుకో ఆమె మనసు భార మైంది. గొంతుకు ఏదో అడ్డుపడ్డ ఫీలింగ్.

ఒకటీ, అరా పెట్రోలింగ్ వెహికిల్స్ తప్ప నగరం నిర్మానుష్యంగానే వుంది. మామూలు సమయంలో అయితే అర్ధరాత్రి రెండు దాటేవరకు రద్దీగానే ఉంటుంది ఢిల్లీ నగరం. రింగ్ రోడ్డు దగ్గర కైనెటిక్ ఆపి పొదలవైపు కదిలింది. పొదల్లో ఏదో కదలిక. ఆమెకు అనుమానం వేసింది. హ్యాండ్ బ్యాగ్‌లో నుండి రివాల్వర్ తీసింది. అది భీష్మాచార్య రివాల్వర్. దానికి లైసెన్సు వుంది. తప్పనిసరి పరిస్థితులలో ఉపయోగించమని చెప్పాడు. ఎలా షూట్ చేయాలో జాన్‌డేవిడ్ చేసి చూపించాడు. ఏ క్షణమైనా ఆమె చేతిలో రివాల్వర్ పేలడానికి సిద్ధంగా వుంది. ఏదో ఒకటి ఈ వేళతో తేలిపోవాలి అనుకుంది.

పొదల్లోకి వెళ్తుంటే మృత్యుకుహరంలోకి వెళ్తోన్న ఫీలింగ్. తన వెనుక ఏదో అలజడి ఆమె ఎలర్ట్‌గానే వుంది. తన వెనుకే ఎక్కడో జాన్‌డేవిడ్ వుంటాడన్న నమ్మకం కూడా వుంది ఆమెకు. అందుకే కాస్త ధైర్యం.

అయితే అక్కడే ఆమె పొరపాటు చేసింది. ఆమె అంచనా ప్రకారం జాన్‌డేవిడ్ ఆమెను వెన్నంటే వస్తున్నాడు.

మధ్యలో ఓ వింత ఆకారం జాన్‌డేవిడ్‌కు తారసపడింది. జాన్‌డేవిడ్ క్షణం కూడా ఆలస్యం చేయకుండా ఆ వింత ఆకారాన్ని వెంబడించాడు.

అదే అతను చేసిన పొరపాటు. జాన్‌డేవిడ్‌ని ఏమార్చడానికే ఆ వింత ఆకారం అలా చేసిందని అతనూహించలేకపోయాడు. వింత ఆకారం జాన్ డేవిడ్‌ను దారి మళ్ళించింది. జాన్ డేవిడ్ కొద్ది దూరం వెళ్ళాక వింత ఆకారం కనిపించకపోవడంతో అటు, యిటూ చూడగలిగినా మెల్లమెల్లగా అతనికా అనుమానం బలపడసాగింది. ఇదంతా తనను ఏమార్చడానికి కాదుగా.

ఆ ఆలోచన రావడంతో అతను పొదల వైపు పరుగెత్తాడు. అప్పటికే ఓ వింత ఆకారం అనిమిష మీద ఎటాక్ ప్రారంభించింది.

★ ★ ★

పెద్ద బరువైన వస్తువులాంటిదేదో మీద పడ్డట్టు అనిపించి గట్టిగా తోసేసింది అనిమిష. వింత ఆకారం తాలూకు చేతులు అనిమిష గొంతును చుట్టుముట్టాయి. అనిమిష ఆ చేతులను విడిపించుకోవడానికి విశ్వప్రయత్నం చేస్తోంది. అంతకంతకు ఆ చేతులు అనిమిష గొంతు చుట్టూ బిగుసుకుంటున్నాయి.

ఆ వింత ఆకారం ఊపిరి ఆమె మెడభాగంలో వెచ్చగా తగులుతోంది. అది మనిషి ఊపిరి అని ఆమెకు తెలుస్తోంది. అది జంతువు పట్టు కాదు. మనిషే. ఆమె నిర్ధారణకు వచ్చింది. అయినా ఆ క్షణంలో ఆమె వింత ఆకారం మనిషా? కాదా? అని ఆలోచించడం లేదు. ముందు దాని బారినుంచి బయటపడాలి.

క్షణాలు భారంగా కదులుతున్నాయి. నిర్మానుష్యమైన ప్రాంతం. గొంతు పెగలడంలేదు. అందులోనూ పొదలు. ఆమెకు ఊపిరి వదలడం కూడా కష్టమవుతోంది. ఆమె ప్రతిఘటించడం మానేసింది. ఆమెలోని వివేచన ప్రారంభమైంది. శత్రువును ప్రతిఘటించడం కన్నా అంతమొందించే ప్రయత్నం చేస్తే?

ఆ ఆలోచన రావడంతోనే ఆమె హ్యాండ్ బ్యాగులోకి చేయి పోనిచ్చింది. ఆ వింత ఆకారం రూపంలో వున్న మనిషి తన సర్వ శక్తులు కేంద్రీకరించి అనిమిషను చంపాలని ప్రయత్నం చేస్తున్నాడు. ఆ ప్రయత్నంలో అతను అనిమిష ఆలోచనను పసిగట్టలేకపోయాడు.

అనిమిష హ్యాండ్ బ్యాగులోనుంచి అతి కష్టమ్మీద రివాల్వర్ తీసింది.

అప్పటికే ఆమె శరీరం ప్రతిఘటించే శక్తిని కోల్పోతోంది. కనీసం రివాల్వర్ గురి పెట్టి హ్యాండ్సప్ అనే శక్తి కూడా లేదు. ఆఖరి ప్రయత్నంగా రివాల్వర్ వింత ఆకారం తలకు గురి పెట్టింది. ఆమె చేతి చూపుడు వేలు ట్రిగ్గర్ మీద బిగుసుకుంది.

వింత ఆకారం ఒక్క క్షణం కంగు తింది. తను తెగిస్తే ట్రిగ్గర మీద వేలు బిగుసుకు కోవడం ఖాయం. పాయింట్ బ్లాక్ రేంజ్‌లో తను క్షణాల మీద ఛస్తాడు. ఇప్పుడేం చేయాలని ఆమెకు చంపడం కన్నా తను బతకడం ముఖ్యం.

ఆ భయం అతనిలో పారిపోవాలనే ఆలోచన కలిగించింది. వెంటనే అనిమిష చుట్టు బిగించిన చేతులను వదిలేసి, వెనక్కి తిరిగి పారిపోవడం మొదలు పెట్టాడు. అనిమిషకు అతడిని వెంటాడే ఓపిక లేదు. రివాల్వర్ అతని వైపు గురిపెట్టి పేల్చింది. ఆమె షూటింగ్‌లో ఎక్స్‌పర్ట్ కాదు. బుల్లెట్ గురి తప్పింది. అతను భయంతో పెద్ద కేక వేసి పొదలనుంచి మాయమయ్యాడు. రివాల్వర్ పేలిన శబ్దం. పెట్రోలింగ్ చేస్తున్న పోలీసులకే కాదు, ఆ పరిసరాల్లో నివసించే ప్రజలకు వినిపించింది. పోలీసులు కంగారుగా అటు వైపు వచ్చారు.

★ ★ ★

క్షణాల్లో అనిమిష బ్రెయిన్ వేగవంతమైంది. శక్తిమంతమైంది. భీష్మాచార్య చెప్పిన మాటలు ఆమె చెవుల్లో గింగురు మంటున్నాయి. జర్నలిస్టు ఇరవై నాలుగు గంటలు ఎలర్ట్‌గా ఉండాలి. ప్రతీదీ తనకు అనుకూలంగా మార్చుకోవాలి.

ఆమె ఆలోచిస్తోంది. అప్పటికే రివాల్వర్ పేలిన శబ్దం విని జాన్ డేవిడ్ భయంతో పరుగెత్తుకొచ్చాడు. అనిమిష క్షేమంగా ఉండడంతో ఊపిరి పీల్చుకున్నాడు. ఆమె తన ఆలోచన జాన్ డేవిడ్‌కు చెప్పింది. భీష్మాచార్యకు సెల్ ఫోన్ ద్వారా తెలియజేసింది.

ప్రజలనుంచి, మంత్రుల నుంచి వింత ఆకారం తాకిడి పోలీసులకు తలనొప్పి వ్యవహారంగా మారింది. అందుకే ఓ పరిష్కారం సూచించాడు భీష్మాచార్య. ఆ పరిష్కారం ఆలోచన అనిమిషది.

★ ★ ★

జాయింట్ కమిషనర్ అనిమిష చెప్పింది సావధానంగా విన్నాడు.

"మరోసారి ఆలోచించండి సార్. వింత ఆకారం తాకిడి ఎక్కువైంది. ఓ పక్క ప్రజలు, ఇంకోపక్క పత్రికలు, ప్రభుత్వమూ అందరూ మిమ్మల్నే నిందిస్తున్నారు" అనిమిష ఉపోద్ఘాతంగా అంది.

"అవును నిజమే! ఏ చిన్న నేరం జరిగినా ఘోరం జరిగినా అందరూ మమ్మల్నే నిందిస్తారు. మా పోలీసుల చేతిలో ఏ మంత్ర దండమూ ఉండదు. మేమూ మనుష్యులమే అని ఆలోచించరు. మాకేవో అతీత శక్తులున్నాయని, మేము కావాలని మా సామర్థ్యం ఉపయోగించడం లేదని దుమ్మెత్తి పోస్తారు. మంత్రుల నుంచి ఒత్తిళ్ళు పై అధికారుల నుంచి మెమోలు! ప్రజలు మమ్మల్ని బాధ్యుల్ని చేస్తారు. పత్రికలు కూడా మమ్మల్నే వేలెత్తి చూపిస్తాయి" తన ఆవేదన వెళ్ళగక్కాడు జాయింట్ కమిషనర్.

"అందుకే మీకు పరిష్కారం చెబుతున్నాను. వింత ఆకారం ఖచ్చితంగా మనిషే అని అర్థమైంది. జంతువుకి వింత జీవికి రివాల్వర్ గురించి ఎలా తెలుస్తుంది? అది పేలుతుందని తన ప్రాణం తీస్తుందని ఊహించలేదు కదా. పైగా నేను షూట్ చేసినప్పుడు ఆ వింత జీవి అమ్మా అని అరిచింది. అప్రయత్నంగా ఏ బాధవేసినా అమ్మా అంటాం. ఆ వింత జీవి వేషంలో ఉన్న మనిషి అదే పని చేశాడు".

అవునన్నట్టు తల పకించాడు జాయింట్ కమిషనర్.

"దానిని మనం అనుకూలంగా మార్చుకుందాం. మనకెలాగూ వింత జీవి మనిషని తెలిసింది. ఇప్పుడు నేను పేల్చిన బుల్లెట్ ఇక్కడ పడి ఉంది. కాబట్టి, జనం కూడా రివాల్వర్ పేలిన శబ్దం, అమ్మా అన్న అరుపూ విన్నారు. మనం చిన్న డ్రామా ప్లే చేద్దాం. వింత జీవి వేషంలో ఉన్న మనిషి పట్టుబడ్డాడని నేను షూట్ చేసినప్పుడు గాయపడ్డాడని, మీరు అంటే పోలీసులు కస్టడీలో తీసుకున్నట్టు వార్త రాస్తాం. దాంతో జనానికి వింత జీవి భయం పోతుంది. ఎక్కడ వింత జీవి కనిపించినా వెంటపడి మరీ తరుముతారు. మీకు పైనుంచి ఒత్తిళ్ళు తగ్గుతాయి. మనం చేయవలసిందల్లా మనకు నమ్మకమైన ఓ వ్యక్తికి వింత జీవి గెటప్ ఇచ్చి పేపర్లో ప్రకటించడమే. ఇందుకు మీ సహకారం కావాలి". చెప్పడం ముగించి జాయింట్ కమిషనర్ వైపు చూసింది అనిమిష.

"ఆలోచించండి సార్! దీనివల్ల మీ సమస్యలు పరిష్కారమవుతాయి. వింత జీవి పట్టుబడిన వార్త తెలియడంతో ప్రజల్లో ఆందోళన తగ్గుతుంది. మీరు మాకు కోపరేట్ చేస్తారా? లేదా? అన్నది మీరే తేల్చుకోండి" భీష్మాచార్య చెప్పాడు.

జాయింట్ కమిషనర్ దీర్ఘంగా విశ్వసించి "ఇందులో నో అనడానికి కారణాలు ఏవీ లేవు. మేమే మీకు థాంక్స్ చెప్పాలి. మా పోలీసు బుర్రలకు రాని మంచి ఆలోచన మీకు వచ్చింది. భీష్మాచార్యగారూ! మీ గురించి మాకు తెలియనిదేముంది మీరేది చేసినా మంచే చేస్తారు. మీరు చెప్పినట్టు మీకు సహకరించడానికి నాకు ఎటువంటి అభ్యంతరమూ లేదు" మనస్ఫూర్తిగా అన్నాడు.

అనిమిష తృప్తిగా ఓ నిట్టూర్పు విడిచింది. భీష్మాచార్య అనిమిష భుజం తట్టి 'కేపిటప్ బేబీ యు హావ్ డన్ ఎ గుడ్ జాబ్ అయామ్ ప్రౌడ్ ఆఫ్ యు" అన్నాడు.

అనిమిష కళ్ళు తడిబారాయి. ఈ క్షణం తండ్రి ఉంటే ఎంత ఆనంద పడే వాడో!

★ ★ ★

మరుసటి రోజు డైలీన్యూస్‌లో వచ్చిన వార్త సంచలనం సృష్టించింది.

'వింతజీవి ముసుగులో దోపిడిదొంగ' అన్న హెడ్డింగ్‌తో వార్త వచ్చింది. దాడికి దొంగలు వింతజీవి ఆకారంతో నగరంలో శివారు ప్రాంతంలో దోచుకోవడానికి పన్నాగం పన్నారని డైలీన్యూస్ అనిమిష ఈ మిస్టరీని ఛేదించి వింతజీవి ముసుగులో ఉన్న అగంతకుడిని షూట్‌చేసి గాయపరిచిందనీ, ప్రస్తుతానికి ఆ వ్యక్తి పోలీసు కస్టడీలో ఉన్నాడనీ పోలీసుల ఇంటరాగేషన్‌లో అన్ని విషయాలు ఒప్పుకున్నాడన్నది ఆ వార్త సారాంశం.

ఢిల్లీ నగరం ఊపిరి పీల్చుకుంది. వింత జీవి ముసుగులో దొంగలు తయారయ్యారని తెలిశాక ఒక నిశ్చింత. ఈసారి వింత జీవి ముసుగులో వస్తే దొంగల పని పట్టాలని నిశ్చయించుకున్నారు. అంతేకాదు వింతజీవి ఆకారంలో ఎవరు కనిపించినా వింతజీవులను చంపినా కేసులుండవని పోలీసుశాఖ ఉన్నతాధికారులు హామీ ఇచ్చారు.

★ ★ ★

"డామిట్" కోపంగా తన చేతిలో ఉన్న విస్కీబాటిల్ గోడకేసి విసిరికొట్టాడు దాదామియా. అతనెదురుగా సెక్యూరిటీ చీఫ్ భయంతో వణికిపోతున్నాడు.

అతని ముందు ఉన్న టీపాయ్ మీద డైలీ న్యూస్ పేపర్ ఉంది.

"వాటీజ్ దిస్ మన మనుష్యులెవరూ దొరక్కపోయినా దొరికినట్టు ఆ వార్త ఎలా వచ్చింది? పోలీసు కస్టడీలో ఉన్నదెవరు?" కోపంగా అడిగాడు దాదామియా.

సలీం నోరు విప్పాడు. "అదంతా ఆ భీష్మాచార్య, అనిమిష అనే లేడి జర్నలిస్ట్ కలిసి ఆడిన నాటకం అని నా అను

మానం. పోలీసు కస్టడీలో ఉన్న వ్యక్తి నిజానికి మన మనిషేకాదు. మన మనుష్యులంతా ఉన్నారు 'ఎవరూ మిస్ కాలేదు'.

"కానీ ఏం లాభం? మన ప్లాన్ అంతా తలకిందులైంది. ఆ భీష్మాచార్య మళ్ళీ మనకు పక్కలో బల్లెంలా మారాడు. ఇప్పుడు వాళ్ళకు ఆ లేడి జర్నలిస్ట్ తోడైంది. అయినా మిస్టర్ షంషేర్! నువ్వేం చేస్తున్నావు? " ఆగ్రహంగా అడిగాడు దాదా మియా.

"మన మనిషిచేత దాన్ని చంపించాలని ప్రయత్నించాను. అది కుదర్లేదు. నేనే రంగంలోకి దిగుతాను. నాకు నలభైఎనిమిది గంటల టైం ఇవ్వండి దాని సంగతి తేలుస్తాను".



దాదామియా సలీం వైపు తిరిగాడు.

"సలీం! ఆ భీష్మాచార్యను మనం వదలకూడదు. భార్యాబిడ్డల బాధతో వాడు మానసికంగా దెబ్బతింటాడని పొరపాటుపడ్డాం. పాములా పడగవిప్పాడు. ఆ పడగను తొక్కేయాలి. మనం గడ్డిపోచ అని తీసిపారేసిన భీష్మాచార్యకు ఎలక్ట్రిక్ వైరు షాకిస్తే మనమే షాక్ కొట్టి చస్తాం. ఇకనుంచి మనం వాళ్ళమీద ఓ కన్నేసి ఉంచాలి."

"అలాగే దాదామియా సాబ్" అన్నాడు సలీం. దాదామియా షంషేర్ వైపుతిరిగి-

"ఒకేసారి అయిదుకోట్ల నకిలీ కరెన్సీ ఢిల్లీ మొత్తం స్ప్రెడ్ అవాలి. అది నీ బాధ్యత. వివిధ ప్రాంతాలలో ఉన్న మన ఏజెంట్లను రమ్మని కబురుచేయి. ఒకేరోజు నకిలీ కరెన్సీ ప్రజల జేబుల్లోకి వెళ్ళాలి. మన కరెన్సీ చెల్లుబాటు కావడం, లేదా నకిలీ కరెన్సీ కారణంగా ప్రభుత్వం వెన్నులో చలి పుట్టినట్టు కావాలి. నకిలీ స్టాంపులతో ఎలా ప్రకంపనలు వచ్చాయో అలా ప్రకంపనాలు రావాలి.

షంషేర్ అలాగే అన్నట్టు తలూపాడు.

★ ★ ★

**అ**ర్ధరాత్రి పన్నెండు గంటలు.

అనిమిష తన గదిలో కూర్చుని టేబుల్ ల్యాంప్ వెలుతురులో ఫైల్ స్టడీ చేస్తోంది. అది భీష్మాచార్య ఇచ్చిన ఫైల్. దాదా మియా గురించి, సలీం గురించి, వివిధ రాష్ట్రాల్లో ఉన్న ఏజంట్ల గురించి అందులో ఉంది. ఆ అక్షరాల్లో రక్తసిక్తమైన అతని కుటుంబమే కనిపిస్తోంది. భీష్మాచార్య ఎంత కష్టపడి ఈ ఫైల్ తయారు చేసి ఉంటాడు?

జర్నలిజమంటే ఏదో ప్రెస్ కవరేజీలు, సరదాగా రాసే నాలుగు అక్షరాలే అనుకునేది ఒకప్పుడు. పత్రికలు చూసి చదివేసి ఓ నిట్టూర్పు విడిచి వాటిని మరిచిపోయేది. కానీ ఇప్పుడు పత్రికలు అంటే గౌరవం రెట్టింపయింది. *ఒక జర్నలిస్ట్ ఎంత కష్టపడితే ఓ వార్త రాయగలడు? ప్రాణాలకు తెగించి మేధస్సును మథించి పరిశోధనతో పరిశీలనతో రాస్తే అక్షరాలు పాటపతాస్త్రాలే కదా!*

దాదామియాకు సంబంధించిన ఫైల్ తిరగేస్తుంటే ఆమెకు ఆశ్చర్యం కలుగుతోంది. అనాథ, కుప్పతొట్టిలో పెరిగినవాడు. జులాయిగా తిరిగినవాడు. జేబు దొంగనతాలు చేసినవాడు, చెయిన్ స్నాచర్ ఎదిగి, ఎదిగి మాఫియా సామ్రాజ్యాన్ని శాసించే డాన్‌గా

మారడమా?

దౌర్జన్యమే దాదామియా చేతిలోని అస్త్రం. అతను అంచెలంచెలుగా ఎదగడానికి కారణం అతనిలో దయా, దాక్షిణ్యాలు లేక పోవడం, నిర్దాక్షిణ్యంగా మనుష్యుల ప్రాణాలు తీయడం. ఈ ప్రజలు దౌర్జన్యానికి భయపడినంతకాలం దాదామియా లాంటివాళ్ళు పుట్టుకొస్తూనే ఉంటారు.

**ఎన్నికల్లో నేరచరితలు పోటీచేయడానికి వీల్లేదని అన్నా, రాజకీయ పార్టీలు అభ్యర్థులు నేరచరితులు అని తెలిసినా, తమ పార్టీ అధికారంలోకి రావడమే ముఖ్యమని ఎంచి మరీ నేరస్థుడిని నిలబెట్టే సంస్కృతి దాదాపు అన్ని పార్టీల్లోనూ ఉండడంవల్లే రౌడీలు, గుండాలు, మాఫియా సామ్రాజ్యాలను విస్తృతపర్చుకుని డాన్‌లు విరాజిల్లుతున్నారు.**

భీష్మాచార్య పూర్తి విశ్లేషణలతో వివరాలతో ఫైల్ తయారు చేశాడు. అదంతా అతను ఫైల్‌గా తయారు చేయడానికి ఎంత శ్రమించి ఉంటాడు ఆ శ్రమకు అతనికి లభించిన పారితోషికం అతని కుటుంబం చనిపోవడం.

ఒక్కసారిగా తల విదిల్చింది. నిజాయితీకి ఎప్పుడూ ఈ కష్టాలు తప్పవా? దేముడైనా సరే, అన్ని కష్టాలూ భరించి చివరికి దుష్ట శిక్షణ చేస్తాడని తండ్రి చెప్పిన మాటలు గుర్తొచ్చాయి.

ఆమెకు కళ్ళు మూతలు పడుతున్నాయి. తెరిచి ఉంచిన కనురెప్పల మధ్య తమ్ముడు కదలాడాడు. ఇప్పుడు తనని తమ్ముడు ఇలా చూసి ఉంటే ఎంత సంతోషపడేవాడో నువ్వచ్చం మా డిటెక్టివ్‌లా చేస్తున్నావని పొంగిపోయేవాడు. నేను నీతో వస్తానక్కా అనేవాడు. తమ్ముడు గుర్తుకు రావడంతో ఆమె కళ్ళు కన్నీళ్లతో మసకబారాయి.

దేవుడు ఎంత నిర్దయుడు కాకపోతే తనకిష్టమైన వాళ్ళని తనకు దూరం చేస్తాడు? ఆమె విషాదాన్ని జయించే ప్రయత్నం మొదలుపెట్టింది. అప్పుడు ఆమె తల మీద చేయి పడింది. తలెత్తి చూసింది. భీష్మాచార్య.

వెంటనే లేచింది "మీరా అంకుల్ మీరింకా నిద్రపోలేదా? "

"నిద్ర! నాకు నిద్రెలా పడుతుందమ్మా! అదిసరే నువ్వేమిటి నిద్రపోలేదా? " అడిగాడు ఆమె తల మీద చేయివేసి.

"రావడంలేదంకుల్. మీరు ఇచ్చిన దాదామియా ఫైల్ చూస్తున్నాను"

"నిద్రెలా వస్తుందమ్మా! మమ్మీ డాడీ గుర్తొచ్చి ఉంటారు కదా"

"అవునంకుల్" అంది తడిబారిన కళ్ళను తుడుచుకుంటూ.

"నాన్న ఎలా వున్నాడమ్మా" అడిగాడు భీష్మాచార్య.

ఒక్క క్షణం తటపటాయించింది. ఏం చెప్పాలి? నిజం చెప్పేయాలి. అబద్ధాల ముసుగులో అంకుల్‌ని మభ్యపెట్టకూడదు. కానీ అంతలోనే ఆమె మనసు పరిపరి విధాలుగా ఆలోచిస్తోంది. అసలే అంకుల్ కుటుంబంలో విషాదం. తండ్రి గురించి చెప్పి బాధ పెట్టడం ఎందుకు?

"ఏమిటమ్మా ఆలోచిస్తున్నావు ఏం చెప్పాలా అని ఆలోచిస్తున్నావా? "

"అదేం లేదంకుల్" అంది తడబాటుగా.

భీష్మాచార్య గోడ మీద ఉన్న శర్మ ఫోటో వైపు చూశాడు. అది అనిమిష తెచ్చుకున్న ఫోటో. తన గదిలో తండ్రి ఫోటో గోడకు తగిలించింది. తనకు నిత్యం స్ఫూర్తిగా ఉంటుందని.

"ఫోటోలో చాలా బావున్నాడు. చాన్నాళ్ల క్రిందట చూశాను వాడిని" అన్నాడు భీష్మాచార్య.

"మిమ్మల్నెప్పుడూ గుర్తుచేస్తుంటాడంకుల్" అంది అనిమిష.

"అవునవును ఇప్పటికీ గుర్తు చేస్తుంటాడా? " అడిగాడు అనిమిష కళ్ళలోకి చూస్తూ.

అనిమిష ఏదో చెప్పబోయింది.

భీష్మాచార్య తన గదిలోకి వెళ్ళి రెండు నిమిషాల తర్వాత పెద్ద పూలదండతో వచ్చాడు. శర్మ ఫొటోకి వేశాడు.

అనిమిషకు ఒక్క క్షణం నోటిమాట రాలేదు. "అంకుల్!"

"నాకు అంతా తెలుసు చిట్టి తల్లీ! శర్మ నాకు చిన్నప్పటి ప్రాణం. వాడు ఒంటరిగా నిన్ను పంపించడమేమిటి? కనీసం నాకు ఫోన్ చేయకపోవడమేమిటి? " అని నువ్వు వచ్చిన రోజే ఎంక్వయిరీ చేశాను. నమ్మిన విషయాన్ని ప్రాణం పోయినా సరే ఏమార్చడు. నిజాయితీ వాడి ప్రాణం. నమ్మిన విలువల కోసం ప్రాణాలను తృణప్రాయంగా వదలడం వాడికే చెల్లిందమ్మా కాకపోతే ఒకటే బాధ వాడి కోసం ఓ ప్రాణ స్నేహితుడు వున్నాడన్న ఆలోచన వాడికి రాకపోవడం. నాకేమాత్రం విషయం తెలిసినా, వాడిని బ్రతికించుకునేవాడిని" కళ్ళు తుడుచుకుంటూ అన్నాడు భీష్మాచార్య.

"అంకుల్ అప్పుడు అప్పుడు" తన్నుకొచ్చేసింది ఆమెలో దుఃఖం.

కట్టలు తెగిన దుఃఖాశ్రువుల ఉధృతి ఆమెను నిలువెల్లా ముంచేసింది. భీష్మాచార్య ఆమె తల మీద చేయి వేసి ఓదార్చాడు. తన కూతురే తనముందు ఏడుస్తోన్న ఫీలింగ్.

"అంకుల్ మీలో మా నాన్నను చూసుకుంటున్నాను. మీరే గనుక లేకపోతే ఈ మహానగరంలో నేను ఏమైపోయి ఉండేదాన్ని? దేవుడు నాన్నను దూరం చేసి ఆ నష్టాన్ని, ఆ బాధను ఉపశమింపజేయడానికి మీ దగ్గరకు చేర్చాడు" మనస్ఫూర్తిగా అంది అనిమిష.

భీష్మాచార్యకు ఇప్పుడు ఊరడింపుగా ఉంది.

"వదిలేయ్ తల్లీ నీకు నేనున్నాను నాకు నువ్వున్నావ్. అనుక్షణం అప్రమత్తంగా ఉండు. నిన్ను కూడా దూరం చేసుకోవడానికి నేను సిద్ధంగా లేను" గొంతు గాద్గదికమవుతుండగా అన్నాడు భీష్మాచార్య.

అనిమిష కళ్ళు తుడుచుకుంది. ఆమె మనసు ఇప్పుడు తేలికపడింది. తన తండ్రే తిరిగి భీష్మాచార్య రూపంలో బ్రతికివచ్చినట్టు అనిపించింది

సరిగ్గా అప్పుడే

ఆ ఇంటి ప్రహరీ మీది నుంచి ఓ ఆకారం లోపలికి ప్రవేశించింది.

భీష్మాచార్య తన గదిలోకి వెళ్ళి పడుకున్నాడు.

అనిమిష ఫైల్‌ని మరోసారి స్టడీ చేస్తోంది. దాదామియా ఆయువుపట్టు డెత్ జోన్ అని అర్థమైంది. అదే ఫైల్‌లో షంషేర్ వివరాలు కూడా ఉన్నాయి. షంషేర్ గుర్తుకురాగానే అప్రయత్నంగా ఆమె పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

తల్లిదండ్రులను, తమ్ముడిని నిర్దాక్షిణ్యంగా చంపిన వాడిని వదలకూడదనే పట్టుదల ఆమె అణువణువునా నిండిపోయింది.

విండో గ్లాసెస్ నుంచి బయటకు చూస్తూ ఉలిక్కిపడింది. ఓ ఆకారం ప్రహరీ గోడ నుంచి దూకడం స్పష్టంగా కనిపించింది. ఆమె మనసు కీడుని శంకించింది. వెంటనే టేబుల్ సొరుగు లాగింది. అందులో భీష్మాచార్య రివాల్వర్ వుంది. దాన్ని చేతిలోకి తీసుకుంది. స్లిప్పర్స్ వేసుకుంది.

భీష్మాచార్య గదిలో పడుకున్నాడు. అతడిని డిస్టర్బ్ చేయడం యిష్టం లేకపోయింది. మెల్లగా మెయిన్ డోర్ తెరిచింది. ఆమె చేతిలో రివాల్వర్ ఏ క్షణమైనా పేలడానికి సిద్ధంగా వుంది.

ఓ చేతిలో టార్చిలైట్ వుంది.

★ ★ ★

షంషేర్ మెల్లగా ప్రహరీ గోడ దూకి యింటి వెనక వైపు వచ్చాడు. ఆ సమయంలో అనిమిష పడుకొని వుంటుందని అతనూహించాడు. అనిమిష కావాలనే అన్ని గదుల్లోని లైట్లు ఆఫ్ చేసింది.

షంషేర్ మెల్లగా జేబులో నుంచి ఆ



యింటి మ్యాప్ బయటకు తీశాడు.

ఆ మ్యాప్‌లో అన్నీ క్లియర్‌గా వున్నాయి. భీష్మాచార్య బెడ్‌రూమ్. అనిమిష గది. అతని టార్గెట్ అనిమిష. అతనికి అనిమిష మీద గొంతు వరకు కోపంగా వుంది. తనను ఒక విధంగా హైద్రాబాద్ వదిలి ఢిల్లీ వచ్చేలా చేసింది కూడా అనిమిషే అన్నది అతని ఫీలింగ్.

ఇంటి ముందుకు వచ్చి ఓ వైపు ఒదిగి నిలబడింది అనిమిష.

తననెవరూ గమనించడం లేదన్న భ్రమలో వున్నాడు షంషేర్. ఒక్కో అడుగు వేస్తూ అనిమిష గది వైపు వచ్చాడు. ఒక్క క్షణం ఊపిరి బిగపట్టాడు. మెల్లగా అనిమిష గది కిటికీ తలుపులు తెరిచే ప్రయత్నం చేశాడు.

అప్పుడు తగిలింది అతనికి రివాల్వర్ మొన.

'షంషేర్ కదలకు. ఏ మాత్రం వెధవ ట్రిక్స్ ప్లే చేసినా నువ్వుండవ్ ఫినిష్. రివాల్వర్ చూశావుగా పాయింట్ బ్లాక్ రేంజ్‌లో వుంది. షూట్ చేయమంటావా? నా మీద కేసు కూడా వుండదు. ఆత్మరక్షణ కోసం షూట్ చేశానని చెబుతాను. మరో విషయం నువ్వు నా యింటికి వచ్చావు".

షంషేర్ మెదడు తీవ్రంగా యోచిస్తోంది.

అతనికేం చేయాలో పాలుపోవడం లేదు. తను ట్రాప్‌లో యిరుక్కున్నాడు. అనిమిష యింత ప్లాన్డ్‌గా వుంటుందని ఊహించ లేదు. శత్రువును తక్కువ అంచనా వేస్తే ఫలితం ఎలా వుంటుందో అతనికి తెలిసొచ్చింది. కానీ అప్పటికే ఆలస్యం అయింది.

"ఇప్పుడు ఏం ఆలోచించినా లాభం లేదు. మర్యాదగా ముందుకు నడువు" అంది రివాల్వర్ మొన అతని కణతకు గురి పెట్టి.

షంషేర్ అడుగు ముందుకు వేశాడు.

అనిమిష అతడిని హాలులోకి తీసుకుపో యింది. అన్ని లైట్లూ వేసింది. భీష్మాచార్య లేచి హాలులోకి వచ్చి షంషేర్‌ని చూశాడు. అతనికి విషయం అర్థమైంది.

సరిగ్గా పది నిమిషాల్లో జాన్‌డేవిడ్ వచ్చాడు. షంషేర్‌ని స్టోర్ రూమ్‌లో ఓ కుర్చీకి కట్టిపడేశారు.

★ ★ ★

"ఇప్పుడు చెప్పు షంషేర్ ఏమిటి సంగ తులు హైద్రాబాద్‌లో మీ వాళ్ళంతా కులా సాయేనా?" అడిగాడు భీష్మాచార్య అతనికి ఎదురుగా ఓ కుర్చీ వేసుకొని కూచుంటూ.

షంషేర్ మొహం పక్కకు తిప్పుకున్నాడు. ఈ పరాభవం అతను భరించలేకపోతు న్నాడు. ఎంత ఫూలిష్‌గా ప్రవర్తించాడు. చివరికి ఓ ఆడదాని చేతిలో తను బందీ అయ్యాడు. ఇంతకన్నా అవమానం తనకు మరొకటి వుంటుందా? ఈ విషయం తెలిస్తే దాదామియా తనని బ్రతకనిస్తాడా?

'షంషేర్ నిన్ను దాదామియా చంపడం గ్యారంటీ. నో డౌట్. ఎలాగూ చావక తప్పదు. ఇప్పుడు చెప్పు దాదామియా సంగ తులేంటి?"

షంషేర్ తన ఎదురుగా వున్న జాన్‌డేవిడ్, అనిమిష, భీష్మాచార్యల వైపు చూశాడు. ముగ్గురు కాలాంతకుల్లా వున్నారు.

"షంషేర్! నీకు మా జాన్‌డేవిడ్ గురించి తెలియదు. చాలా మొరటు మనిషి. నీ చేయి విరిచేయ్ అని చెప్పాననుకో. అతను చెప్పిన పని వెంటనే చేయడు మెల్లమెల్లగా చేస్తాడు. అని జాన్‌డేవిడ్ వైపు తిరిగి ఏమంటావ్ జాన్‌డేవిడ్ ఏదీ ఓసారి షంషేర్ చేతులు విరిచేయ్" అన్నాడు.

జాన్‌డేవిడ్ షంషేర్ ముందుకు వచ్చాడు.

షంషేర్ మొహంలో కలవరం. జాన్‌డే విడ్ షంషేర్ చేతివ్రేళ్ళను పట్టుకున్నాడు. అతనేం చేయబోతున్నాడో షంషేర్‌కు అర్థ మవ్వలేదు. అర్థమయ్యేలోపు ఓ డామేజ్ జరిగింది. షంషేర్ చేతివ్రేళ్ళను వెనక్కి విరి చాడు.

అతని నోట్లో నుండి పెద్దకేక వచ్చింది. ప్రాణాలు పోతున్న ఫీలింగ్.

"జాన్‌డేవిడ్ నేను చెప్పిందేమిటి? నువ్వు చేసిందేమిటి?" కంగారు నటిస్తూ అడిగాడు భీష్మాచార్య.

"మీరు చెప్పిందే చేస్తున్నాను. సార్ చేతి వేళ్ళు కూడా చేయిలో ఓ భాగమే కదా అందుకే ముందు చేతివేళ్ళ నుంచి వచ్చాను."

"అంటే యిప్పుడు చేయి విరిచేస్తావా?" భీష్మాచార్య అడిగాడు.

"అదేమిటంకుల్ జాన్‌డేవిడ్‌కు ఆ మాత్రం పద్ధతి పాడు తెలియదా? చేతివ్రే ళ్ళలో గోళ్ళు కూడా భాగమే కదా ఆ గోళ్ళ సందుల్లో సూదితో గుచ్చకపోతే ఎలా?" అంది అనిమిష.

షంషేర్ కళ్ళలో భయం స్పష్టంగా కదలా డింది. జాన్‌డేవిడ్ టేబుల్ మీద ఉన్న పెద్ద నీడిల్ బయటకు తీశాడు.

"తుప్పుపట్టిపోయింది. కానీ చాలా షార్ప్ అన్నాడు." ఆ నీడిల్‌ని షంషేర్ కళ్ళ ముందు ఆడిస్తూ

భీష్మాచార్య వీజువల్ చూస్తున్నాడు. అర్ధ రాత్రి ఒంటిగంట సమయం.

అనిమిష ఒక్కక్షణం అంటూ గదిలో ఓ మూలకు వెళ్ళింది. ఓ పాత గుడ్డముక్క తీసుకువచ్చి, వాసన చూసి ముక్కు మూసు కుంది.

"ఏమిటి బేబీ అంత కంపు కొడుతుందా ఆ గుడ్డముక్క"అడిగాడు భీష్మాచార్య.

"అవునంకుల్ ఏం చేస్తాం తప్పదుగా దానిని ఇప్పుడు షంషేర్ నోట్లో కుక్కాలి" అంది.

వామ్టింగ్ సెన్సేషన్ కలిగింది ఆ మాటలు విన్న షంషేర్‌కు.

"నోట్లో గుడ్డెందుకు బేబీ! స్వేచ్ఛగా అరవ నీయ్. మనం అంత శాడిజమ్‌గా ఉండకూ

డదు. వాక్ స్వాతంత్ర్యం కూడా ఉండాలిగా" అన్నాడు భీష్మాచార్య.

"అయ్యో నాకా మాత్రం తెలియదా అంకుల్. కానీ అరిస్తే షంషేర్ కంఠనరాలు తెగిపోవూ. పైగా అరిస్తే బోల్డు కాలరీలు వేస్టు. అందుకే ఈ ప్రయత్నం" అంటూ ఆ గుడ్డముక్కను షంషేర్ నోట్లో కుక్కిపోయింది.

"వద్దు నన్ను ఏమీ చేయొద్దు" అన్నాడు షంషేర్.

అతనికి ప్రాణభయం కన్నా ఈ చిత్రహింసల భయమే ఎక్కువగా ఉంది. అతను ఎంతో మందిని చిత్రహింసలు పెట్టాడు. అయితే ఇలా కొత్తదనం చిత్రహింసలు ఎప్పుడూ ప్రయోగించలేదు. ఆ చిత్రహింసలు తనవరకు వచ్చేసరికి హడలిపోయాడు.

అనిమిష జాన్‌డేవిడ్ చేతిలోని నీడిల్ తీసుకొని షంషేర్ కుడిచేతి చూపుడువేలి గోళ్లలోకి కసుక్కున దించింది బలమంతా ప్రయోగించి.

ఆ హఠాత్ పరిణామానికి షంషేర్ హడలిపోయాడు. పెద్దగా కేక వేశాడు. జాన్‌డేవిడ్ షంషేర్ నోరు బలంగా మూశాడు. షంషేర్ కళ్లలో నీళ్లు సుడులు తిరిగాయి. నీడిల్ ఇంకా గోళ్ల సందులోంచి దిగబడిపోయి ఉంది.

బలంగా బయటకు లాగింది ఫౌంటెన్‌లా రక్తం చిమ్మింది.

"నొప్పిగా ఉందా షంషేర్ నా కుటుంబాన్ని నువ్వు ఇలానే టార్చర్ చేశావు. నా వాళ్లందర్నీ దూరం చేసి నన్ను అనాథను చేశావు. అప్పుడు నీకు నొప్పి తెలియలేదా? "

"వద్దు నన్నేం చేయొద్దు" అరిచాడు షంషేర్.

"నిన్నేమీ చేయము. దాదామియా సంగతులన్నీ రేడియో వార్తల్లో చదివి వినిపించేయ్"

"నాకు దాదామియా గురించి ఏమీ తెలియదు నన్ను నమ్మండి"

అనిమిష నీడిల్‌ని మళ్లీ గాలిలోకి లేపింది.

"ఆగమ్మా అనిమిషా! నిజం చెప్పిన అతడిని ఇంకా మనం చిత్రహింసలు పెట్టడం ఎందుకో? " అన్నాడు భీష్మాచార్య.

"వీడు నిజం చెప్పాడా? ఏం చెప్పాడు? " ఆశ్చర్యంగా అడిగింది అనిమిష.

షంషేర్ కూడా ఆశ్చర్యపోయాడు. తను ఏం చెప్పాడు? దాదామియా సంగతులు తెలియవని చెప్పాడు. అంటే తనని నమ్మాడా!

"నిజం చెప్పాడు కదమ్మా పద ఈ రోజు అంతా రెస్ట్ తీసుకుంటాడు" అంటూ ఓసారి అతనికి కట్టిన కట్లు మొత్తం విడదీసి అతని జేబులోని సెల్‌ఫోన్ తీసుకొని అతని నోటికి టేప్ అతికించేసి బయటకు నడిచాడు భీష్మాచార్య.

★ ★ ★

"అతడిని ఎందుకు వదిలేశారు అంకుల్ అతడిని మనం మరింత టార్చర్ చేస్తే నిజం కక్కేవాడే" అంది అనిమిష.

"చెప్పడు. మనం షంషేర్‌ని తక్కువ అంచనా వేయకూడదు. అతను ప్రొఫెషనల్. మనం పెట్టే టార్చర్‌కు మహా అయితే ఏ కొన్ని విషయాలో చెబుతాడు కానీ అలాకాదు. అతని ఒక్కొక్కటిగా అన్నీ చెప్పాలి"

"అలా ఎలా చెబుతాడు? " అనిమిష అడిగింది అర్థం కానట్టు.

"చెబుతాడు చచ్చినట్టు చెబుతాడు ఎలా అంటే" అని చెప్పడం ప్రారంభించేడు భీష్మాచార్య.

మరుసటి రోజు డైలీన్యూస్‌లో వచ్చిన వార్త మరోసారి సంచలనాన్ని సృష్టించింది.

విప్లవాలు, ద్రోహాలు రెండు దారిద్ర్యసంతతే.

**– అరిస్టాటిల్**

ప్రొఫెషనల్ కిల్లర్, దాదామియా ముఖ్య అనుచరుడు షంషేర్ డైలీన్యూస్ రిపోర్టర్ అనిమిషను చంపే ప్రయత్నంలో పోలీసులకు దొరికిపోయాడని పోలీసుల ఇంటరాగేషన్‌లో అతను కొన్ని విషయాలు బయట పెట్టాడని మరిన్ని వివరాల కోసం ఓ రహస్య ప్రదేశంలో పోలీసులు ఇంటరాగేట్ చేస్తున్నారన్నది ఆ వార్త సారాంశం.

ఆ వార్త ప్రజల్లోనే కాదు. మాఫియా ప్రపంచంలోను ప్రకంపనాలను సృష్టించింది. కొన్ని మాఫియా గ్రూపులు సంతోష పడ్డాయి. తలనొప్పిగా ఉన్న మాఫియా కింగ్ దాదామియా నేర సామ్రాజ్య పునాదులు కదిలిపోవడంవల్ల తమ ఆధిపత్యం పెరిగిపోతుందని వాళ్ల విశ్వాసం.



దాదామియా పిచ్చి పట్టినట్టు ఊగిపోయాడు. షంషేర్ అంత తెలివితక్కువగా పోలీసులకు పట్టుబడతాడని ఊహించలేదు.

తన ఇన్‌ఫ్లూయన్స్‌తో షంషేర్‌ను ట్రేస్ చేయడానికి ప్రయత్నించాడు. కానీ షంషేర్‌ని ఎక్కడ అరెస్ట్ చేశారో ఏ పోలీస్ స్టేషన్‌లో ఉంచారో తెలుసుకోలేకపోయాడు. ఏ పోలీస్‌స్టేషన్‌లోనూ షంషేర్ మీద ఎఫ్ఐఆర్ ఫైల్ కాలేదు. ఇదంతా హయ్యర్ అఫిషియల్స్ ఆధ్వర్యంలో నడుస్తోందని అర్థమైంది.

షంషేర్ తనకు సంబంధించిన ఏ రహస్యం చెప్పి వుంటాడు అన్నది దాదామియాని తొలిచివేస్తోంది కేంద్రప్రభుత్వం కూడా మాఫియా పట్ల కఠినంగా వ్యవహరిస్తుంది. ఈ పరిస్థితుల్లో తన ప్రాబల్యం కోల్పోతుందా? ఒకవేళ అదే జరిగితే నిలదొక్కుకోవడం ఎంత కష్టం.!



అనిమిష స్టోర్ రూమ్‌లోకి వచ్చింది. అప్పటికే షంషేర్‌ని బంధించి పన్నెండు గంటలు దాటింది. షంషేర్ మొహం వాడిపోయి వుంది. నీళ్ళు చల్లి అతడిని లేపింది.

"హలో షంషేర్ గుడ్మార్నింగ్ సారీ వెరీ బ్యాడ్ మార్నింగ్ బ్రేక్‌ఫాస్ట్ చేస్తావా"

షంషేర్ తల పక్కకు తిప్పుకున్నాడు.

"ఒకె! ఒకె! నీకు రోజూ పేపరు చదివే అలవాటు వుందా? ఇదిగో చదువు అంటూ అతని చేతికట్లు మాత్రమే విప్పింది. నోటికి వున్న టేప్ తీయమన్నట్టు సైగ చేశాడు.

"పేపర్ కళ్ళతో చదువు నోటితో పనేమిటి? అది బ్రేక్‌ఫాస్ట్ చేసేప్పుడు కదా" పోనీలే అని నోటికి వున్న ప్లాస్టర్ విప్పింది.

పేపర్ హెడ్‌లైన్ చూసి షాకయ్యాడు షంషేర్. తనను పోలీసులు అరెస్టు చేసినట్టు వుంది. పైగా తను కొన్ని రహస్యాలు చెప్పినట్టు రాశారు.

"ఇదన్యాయం. నన్ను పోలీసులు అరెస్ట్ చేయలేదు. నేనే నిజమూ చెప్పలేదు" అరిచాడు షంషేర్"

"అఫ్‌కోర్స్ ఆ విషయం నాకు తెలుసు నీకు తెలుసు. దాదామియాగాడికి తెలియదుగా"

"ఇలాంటి గాలి వార్తలు అతను నమ్మడు. నా కోసం ట్రయ్ చేస్తూనే వుంటాడు".

"అవునవును నీ కోసం అదే నిన్ను వెతకడం కోసం ట్రయ్ చేస్తూనే వున్నాడు. నువ్వు దొరికిన మరుక్షణం చంపడానికి".

"అబద్ధం. అతను నన్నెందుకు చంపుతాడు? "

"ఎందుకా? నువ్వు అతనికి సంబంధించిన రహస్యాలు చెప్పావు కాబట్టి"

"నేనా నేనేం చెప్పాను? నేనేమీ చెప్పలేదు". కీచుగొంతుతో అరిచాడు.

"అఫ్‌కోర్స్ చెప్పలేదు కానీ చెప్పావని దాదామియాని నమ్మిస్తాను"

"అంత గుడ్డిగా దాదామియా నమ్మడు"

ఇతరులకు మంచి చేయడం అన్నది కర్తవ్యం కాదు. మంచి చేయడం అన్నది మీ ఆరోగ్యాన్ని ఆనందాన్ని పెంపొందించి సుఖాన్ని ఇస్తుంది. – జొరాస్టర్

"హైద్రాబాద్‌లో నువ్వు కోటి రూపాయల నకిలీ నోట్లు మార్చావుగా. వాటి నంబర్లు నువ్వే పోలీసుల ఇంటరాగేషన్‌లో వెల్లడించావని దీనికి సూత్రధారి దాదామియా అనీ నేను నిమిత్త పాత్రధారినే అని నువ్వు పోలీసులకు నిజం కక్కేశావు ఆ విషయం నేను పేపర్‌లో అచ్చేశాను అనుకో! అప్పుడు కూడా నమ్మడా దాదామియా."

"నువ్వు ఎలా అచ్చేస్తావ్?"

"తెల్లకాగితం మీద బాల్ పెన్‌తో రాసి పత్రికలో అచ్చేస్తాను బై" అంటూ వెళ్ళిపోయింది అనిమిష. వెళ్ళేముందు టేప్ అతని నోటికి అతికించేసి.

భీష్మాచార్య మెల్లమెల్లగా విషాదంలో నుంచి బయటపడుతున్నాడు. అనిమిష చూపించే అవాజ్యమైన ప్రేమతో తన గుండెకు తగిలిన గాయాన్ని మాన్పుకుంటున్నాడు. అతని చేతిలో ఇప్పుడు జిన్‌టిన్ వుండడం లేదు. అతను హుషారుగా డైలీ న్యూస్ ఆఫీసులో తిరుగుతూ వుండడంతో ఉద్యోగుల్లో కూడా కొత్త ఉత్సాహం పుట్టుకు వచ్చింది.

ఆ రోజు రాత్రి పదిగంటల సమయంలో మెడలో కెమెరాతో డెత్‌జోన్ వైపు వెళ్ళింది అనిమిష. ఆమెను జాన్‌డేవిడ్ అనుసరిస్తూనే వున్నాడు.



దూరం నుంచి డెత్‌జోన్ కనిపిస్తూనే వుంది నోరు తెరిచిన మృత్యువులా.

అతిశక్తిమంతమైన కెమెరా ఆమె మెడలో వేలాడుతోంది. డెత్‌జోన్‌ని ఫొటో తీసింది. డెత్ జోన్‌లో ఏ మూలో ఎక్కడో దాదామియా అనుచరులు ఆయుధాలు చేతపట్టి కాపలా కాస్తారని ఆమెకు తెలుసు. అందుకే ఆమె ఎలర్ట్‌గానే వుంది.

దూరంగా పొదలున్నాయి. వాటిచాటున నక్కి వుంది అనిమిష. అక్కడ్నుంచి చూస్తే డెత్‌జోన్‌కు వచ్చిపోయే వాహనాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. అదో ప్రైవేటు సామ్రాజ్యంలా వుంది. అక్కడికి వెళ్లాలంటే కంపల్సరీగా అందరికీ గుర్తింపు కార్డులు వుండాలి. కోడ్ నంబర్లు వుంటాయి. అనుమానం వచ్చినప్పుడు కోడ్ నెంబర్ అడుగుతారు. వెంటనే చెప్పగలిగి వుండాలి.

తను డెత్‌జోన్‌లోకి వెళ్ళి అక్కడి రహస్యాలు ఛేదించి, వాటిని పత్రికలో ప్రచురించి దాదామియా చీకటి సామ్రాజ్యాన్ని కూకటి వేళ్ళతో పెకిలించి వేయడం ఒక పద్ధతి.

అలా కాకుండా పాముల పుట్టలో మంట పెట్టి అందులోని పాములను బయటకు రప్పించి చంపటం మరో పద్ధతి. ఆ రెండింటిలోనూ రెండవ పద్ధతి ఆమెకు శ్రేయస్కరం అనిపించింది.

డెత్‌జోన్‌లోకి ఓ టెంపో వెళ్తోంది. మొసలి గుర్తు టెంపో మీద వుంది. అది దాదామియా గ్రూపులో వుండే గుర్తు. తన మెడలోని కెమెరాతో క్లిక్‌మనిపించింది.

ఆ నిశ్శబ్దంలో ఆయుధాలు ధరించిన సాయుధుల బూట్ల శబ్దం స్పష్టంగా వినిపిస్తోంది. పొదలచాటున వున్న కైనెటిక్ బయటకు తీసింది. కైనెటిక్ శబ్దం వాళ్ళు వింటే అంతే సంగతులని ఆమెకు తెలుసు.

కైనెటిక్ స్టార్ట్ చేసింది. వెనక్కి తిరిగి చూడకుండా డైలీ న్యూస్ వైపు వెళ్ళింది. దూరం నుంచి ఈ దృశ్యం చూసి జాన్‌డేవిడ్ తృప్తిగా నిట్టూర్చాడు.



అనిమిష తను తీసిన ఫొటోలు కడిగించి, ప్రింట్లు వేయించింది.

"వాటిని ఏం చేయబోతున్నావు?" అడిగాడు భీష్మాచార్య.

"వాటిని అడ్డం పెట్టుకొని మనం డబుల్ గేమ్ మొదలుపెట్టాలి" అంది అనిమిష

"అంటే ఎలా?"

"డెత్ జోన్ పుట్టలో వున్న దాదామియా పామును బయటకు రప్పించాలంటే మనకు ఇదే మంచి అవకాశం" అంది అనిమిష.

భీష్మాచార్య ఆమె చెప్పబోయేది వినడానికి సిద్ధంగా వున్నాడు.

కొద్దికాలంలోనే అనిమిష తెలివితేటల మీద విపరీతమైన నమ్మకం ఏర్పడింది. ఆమె పట్టుదల ఐక్యు షార్ప్‌నెస్ అతనికి ముచ్చటేశాయి.

జర్నలిస్ట్‌గా రాణించాలంటే శారీరకంగా కూడా దృఢంగా వుండాలన్న ఒక్క మాటకు వెంటనే జాన్‌డేవిడ్ దగ్గర శిక్షణ మొదలు పెట్టింది. తెల్లవారు ఝామున నాలుగు గంటలకే లేచి, కఠినమైన సాధన మొదలు పెట్టింది. ఇసుక మూటలను పిడికెళ్ళతో గుద్దడం, కరాటే సాధన చేయడం, ఆసనాలు నేర్చుకోవడం స్విమ్మింగ్, షూటింగ్.

ఆమె ఓ కదిలే మిషన్ అయింది. నేర్చుకునే ప్రతిపనిలో తపన, తపస్సులా చేసే ఆమె పనివిధానం అతడిని అబ్బురపరిచింది.

ఎంతో తపన మరెంతో దీక్ష వుంటే తప్ప కుదరని పని. అనిమిషలో దీక్ష, తపన వున్నాయి. ఆమె తను చేసే ప్రతీ పనిని తపస్సులా భావిస్తుంది.

ఈ ప్రపంచంలో ఎవరైనా అత్యున్నత స్థానాన్ని అధిరోహించాలంటే చేసే పనిపట్ల నిబద్ధత అవసరం. అంకిత భావం వుండాలి. తపస్సులా చేయాలి. అదే అనిమిష విజయ రహస్యం.

అనిమిష చెప్పడం మొదలుపెట్టింది.

"నేను తీసిన ఈ ఫొటోలను పేపర్లో పబ్లిష్ చేద్దాం. అయితే ఈ ఫోటోలు పోలీసులకు షంషేర్ అందజేసినట్టు వార్త రాస్తాం. పోలీసుల థర్డ్ డిగ్రీకి షంషేర్ లొంగిపోయి ఒక్కొక్కటిగా రహస్యాలు చెబుతున్నాడని పోలీసులు మనకు తెలియజేస్తున్నట్టు వార్త ప్రజెంట్ చేస్తాం. దాదామియా కుడిభుజం సలీం అని మనకు తెలుసు. ఎంతో వ్యయప్రయాసలకోర్చి మీరు తయారు చేసిన ఫైల్‌లోని విషయాలు" అని ఒక్క క్షణం ఆగింది.

"ఆర ఫైల్‌లోని విషయాలు?" ఆసక్తిగా అడిగాడు భీష్మాచార్య.

'షంషేర్ ప్రాణభయంతో పోలీసులకు చెప్పాడని వాటిని డైలీ న్యూస్ సేకరించిందని రాస్తాం".

"అందువల్ల ప్రయోజనం ఏమిటి?"

"ఉంది. ఫైల్‌లో మీరు తయారుచేసిన నిజాలు అక్షర సత్యాలు. దాదామియాకు, సలీం, షంషేర్‌లాంటి వాళ్ళకు తప్ప మరొకరికి తెలియవు. ఇప్పుడీ విషయాలు బయటకు తెలిశాయంటే ఖచ్చితంగా ఆ విషయాలు షంషేర్ చెప్పాడని దాదామియా నమ్ముతాడు".

"నమ్మి ఏంచేస్తాడు".

"షంషేర్‌ని శత్రువుగా భావిస్తాడు. షంషేర్‌కు ఆ విషయం తెలుసు. తనకు సంబంధించిన రహస్యాలు బయటకు చెప్పిన ఏ వ్యక్తినీ దాదామియా ప్రాణాలతో వదలడు. అందుకే షంషేర్‌ని ఎమోషనల్ బ్లాక్‌మెయిల్ చేస్తాం. విధిలేని పరిస్థితిల్లో షంషేర్ మనతో చేతులు కలిపి దాదామియా రహస్యాలు చెప్పేస్తాడు."

"ఇదంతా జరుగుతుందంటావా?" అనుమానంగా అడిగాడు భీష్మాచార్య.

"జరుగుతుంది. ఒకవేళ జరగలేదు అనుకోండి మనకేమిటి నష్టం. మన దగ్గర ఎలానూ సాక్ష్యాధారాలతో ఫైల్ వుందిగా. ప్రయత్నం చేసి చూద్దమే"

భీష్మాచార్యకు అనిమిష ఆలోచన నచ్చింది. అలాగే చేయమన్నాడు.

కొన్ని సమయాల్లో కండబలం కన్నా, కత్తి బలంకన్నా, కలంబలం - వివేచన బలం ఎక్కువ పనిచేస్తుంది. ఇప్పుడు అనిమిష చేస్తోన్న పని అదే.

ఆమె చేసే ప్రయత్నం మాఫియా సామ్రాజ్యంలో ప్రకంపనలు సృష్టించడానికి ఆయత్తమవుతోంది.

★ ★ ★

అరగంట నుంచీ అతను ఆ ఇరానీ హోట

ల్‌లో కూచొని వున్నాడు. అప్పటికే అతను నాలుగు టీలు తాగాడు. అతని దృష్టి అంతా కాస్త దూరంలో వున్న డైలీ న్యూస్ పత్రికాఫీసు మీదే వుంది.

అతని నిరీక్షణ ఓ పదినిమిషాల తర్వాత ఫలించింది. ఓఅమ్మాయి పత్రికా కార్యాలయం నుంచి బయటకు వచ్చింది. కైనెటిక్ హోండా స్టాండు బయటకు తీసి స్టార్ట్ చేసింది. చూడీదారిలో ఆ అమ్మాయి సమ్మోహనంగా వుంది. డ్రైవింగ్‌లో అతితక్కువ సమయంలోనే పరిణితి సాధించింది.

ఆ అమ్మాయి అనిమిష. ఆ అమ్మాయిని ముప్పయేళ్ళ యువకుడు ఫాలో చేస్తున్నాడు. అతను కారులో ఆమెను ఫాలో చేస్తున్నాడు. కైనెటిక్ డ్రైవ్ చేస్తోన్న అనిమిషకు చిన్న అనుమానం. తన బండిని ఎవరో ఫాలో అవుతున్నారు. ఆ కారులో వున్న వ్యక్తి ఎవరు?

ఆలోచిస్తూనే తన కైనెటిక్‌ని జాయింట్ కమిషనర్ ఆఫీసు వైపు పోనిచ్చింది. కారు కూడా అటే వచ్చింది. కైనెటిక్‌ని జాయింట్ కమిషనర్ ఆఫీసు ముందు పార్క్ చేసి లోపలికి వెళ్ళింది.

కారులోని వ్యక్తి దూరంగా కారును పార్కు చేసి, సెల్‌ఫోన్‌లో ఎవర్నో కాంటాక్ట్ చేశాడు. సరిగ్గా అయిదు నిమిషాల తర్వాత అనిమిష జాయింట్ కమిషనర్‌తో క్యాబిన్‌లో ఉంది.

'థ్యాంక్యూ సార్ మీరు చేసిన కోపరేషన్ వల్ల చాలా సాధ్యమైంది. ఆ దాదామియాను మీ సహకారంతోనే బయటకు లాగగలను' మనస్ఫూర్తిగా అంది అనిమిష.

'నేనే మీకు థ్యాంక్స్ చెప్పాలి. మీరు చాలా ఇంటిలిజెంట్‌గా ప్రవర్తించారు. నవల్లో, సినిమాల్లో మాత్రమే ఇలాంటివి సాధ్యమని అనుకునేవాడిని. కానీ నిజజీవితంలో ఇలాంటివి సాధ్యమేనని నిరూపించారు. ప్రతి డిపార్ట్‌మెంట్‌లోనూ అవినీతిపరులు ఉన్నట్టు మా డిపార్ట్‌మెంట్‌లోనూ ఉన్నారు. వాళ్ళ నుంచి ఎలా జాగ్రత్తగా నడుచుకోవాలో మీరు తెలియజెప్పారు.

షంషేర్‌ని నేను ఎక్కడ దాచి ఇంటరాగేట్ చేస్తున్నానో తెలుసుకోవాలని మా డిపార్ట్‌మెంట్‌లోని కొందరు అధికారులు ప్రయత్నించారు. మీరు చెప్పినట్టుగా ఆ అధికారులమీద నిఘా వేస్తే వాళ్ళ ఫోన్లను ట్యాప్ చేశాక అసలు విషయం తెలిసింది. వెంటనే వాళ్లను సస్పెండ్ చేశాం."

'అవినీతి మహావృక్షమైంది సార్ ఆ తప్పు ఒక్కోసారి అధికారుల బలహీనతలది అవ్వొచ్చు వాళ్ల భయాలవి అవ్వొచ్చు'.

'మీరు చెప్పేది నిజమే అనిమిషగారూ! ఆ దాదామియా మా అధికారులను రకరకాలుగా లోబర్చుకున్నాడు. చాలా మందిని చాలా రకాలుగా బ్లాక్‌మెయిల్ చేశాడు. అమ్మాయిల బలహీనత ఉన్న ఓ అధికారిని ఫొటోలు తీసి బ్లాక్‌మెయిల్ చేశాడు.

కేవలం చిన్న చిన్న బలహీనతలు భయాలవల్లే సిన్సియర్ అధికారులు కూడా అవినీతిపరులతో సంఘ విద్రోహులతో చేతులు కలపవలసి వస్తుంది. దీర్ఘంగా నిశ్వసించి చెప్పాడు జాయింట్ కమిషనర్.

"ఒకసారి బలహీనత అనే ఊబిలోకి దిగబడితే బయటకు రావడం చాలా కష్టం. డ్రగ్ ఎడిక్ట్ అయిన వాళ్లకు ఎలా అయితే వాటి నుంచి బయటపడేసే సెంటర్లు వున్నాయో! అలా ఈ బలహీనతల్నుంచి బయటపడేసేది ఏమీలేదు. కేవలం మనసులో బలంగా తాను మారాలి అని వుంటే తప్ప"

"ఎగ్జాక్ట్‌లీ కరక్ట్. దీనికి ప్రత్యామ్నాయం ఆలోచిస్తున్నాం" చెప్పాడు జాయింట్ కమిషనర్.

"ఒకవిధంగా ఉన్నతాధికారులు కూడా ఒక కారణమే సార్" అంది అనిమిష.

"అదెలా? " అడిగాడు జాయింట్‌కమిషనర్.

"రాజకీయ ఒత్తిళ్లకు తలవొగ్గి, ప్రమోష



**నిజంగా చనిపోయాడా?**

చర్చిల్ ప్రధానిగా ఉండేటప్పుడు అనేరిన్ బేవాన్ అనే ఓ రాజకీయ ప్రత్యర్థి ఉండేవాడు. ఘాటైన విమర్శలతో నిత్యం చర్చిల్ విధానాలపై దండెత్తేవాడాయన. అంత రాజకీయచతురుడైన చర్చిల్ కూడా వీడిపీడ ఎప్పుడు విరగడ అవుతుందా అనుకునేవాడు. ఇలా ఉండగా ఓరోజున బేవాన్ చనిపోయాడు. పత్రికలవాళ్లు చర్చిల్‌ను కలిసి బేవాన్ మృతిపై మీ కామెంట్ ఏమిటని అడిగారు. వెంటనే చర్చిల్ 'బేవాన్ చనిపోయాడా.. ఇది నిజమేనా?' అని కొద్దిగా సందేహంగా అడిగాడు. కానీ పత్రికలవాళ్లు అవే మాటల్ని అలాగే అచ్చేసి బేవాన్ మృతిపై చర్చిల్ విస్మయం ప్రకటించారని రాసేసుకున్నారు.

ల్లకు ఆశించి మీరు మీకింది అధికారులను ఒత్తిళ్లకు లోనుచేస్తారు. తప్పని పరిస్థితుల్లో వాళ్లు మీ ఆర్డర్స్ పాటించవలసి వస్తుంది. సిన్సియార్టీ మీద వాళ్లకు గౌరవం తగ్గుతుంది. సిన్సియర్ అధికారులు కూడా తమ సిన్సియార్టీని నిర్లిప్తత, నిరాసక్తతల మధ్య కప్పిపెడతారు".

'యు ఆర్ కరెక్ట్ అనిమిషా! రాజకీయ నాయకుల ఒత్తిడి మా మీద తగ్గితే తప్ప ఏంచేయలేము" అన్నాడు జాయింట్ కమిషనర్.

దీర్ఘంగా నిశ్వసించి అంది అనిమిష.

"నిజమే చెట్టుముందా, విత్తుముందా అని సమస్యలాంటిది. దీనికి శస్త్ర చికిత్స జరగాలి అస్త్రాలతో కాదు అక్షరాలతో"

టైం చూసుకొని లేచింది అనిమిష.

"వస్తాను సార్! నేను మీ దగ్గరికి ఎందుకు వచ్చానో తెలుసా ఓ రిపోర్టర్‌గా షంషీర్ గురించి వచ్చినట్టు మన శత్రువులు భావించాలి. బహుశ ఈ ప్రయత్నం శత్రువుల నుంచి మొదలైంది అనుకుంటా నా శత్రువు ఒకరు బయట వెయిట్ చేస్తున్నారు" అంది చిరునవ్వుతో అనిమిష.

"వాట్ నిజమా మా వాళ్లను పంపించేదా? "

"వద్దొద్దు నేను గమనిస్తున్నట్టు వుంటే వాళ్లు జాగ్రత్త పడతారు. మనం గమనించనట్టు ఉన్నప్పుడే ఎక్కడో ఓ దగ్గర తప్పటడుగు వేసి బయటపడతారు. వస్తాను సార్ బై" అంది లేచి.

జాయింట్ కమిషనర్ దగ్గర వీడ్కోలు తీసుకొని బయటకు వచ్చింది.

తనను ఫాలో చేసిన కారు కాస్త దూరంలో ఉండటం గమనించి నవ్వుకుంది. కైనెటిక్‌ని ఆఫీసువైపు పోనిచ్చింది.

అయితే ఈసారి ఆ కారు ఆమెను ఫాలో అవ్వలేదు. ఆ కారులోని యువకుడు జాయింట్ కమిషనర్ ఆఫీసువైపు వెళ్లాడు.

అనిమిష ఊహించినట్టు అతను ఆమె శత్రువు కాదు.



★ ★ ★

అనిమిష స్టోర్ రూంలోకి వచ్చేసరికి మొహం వాల్చేసి ఉండిపోయాడు షంషీర్ మొదటిరోజు కోపంతో ఏమీ తిన్లేదు.

రెండవరోజూ ఆకలిబాధ తట్టుకోలేక కొద్దిగా తిన్నాడు. మూడవరోజు అతనికి పిచ్చెక్కిపోయింది. ఎలా బయటపడాలో అర్థంకావడంలేదు. అతనికి అంతా అయో



మయంగా వుంది. తనను వాళ్లు ఏం చేయ బోతున్నారు. చంపేస్తారా? వాళ్ళకు ఆ ఉద్దేశం ఉన్నట్టు కనిపించడంలేదు. అలా అని తనను వదిలివేయడంలేదు.

అతనికి భీష్మాచార్యకన్నా, భయంకరంగా కనిపించే, రాక్షసంగా ప్రవర్తించే జాన్ డేవిడ్‌కన్నా అనిమిషే భయంకరంగా కనిపిస్తోంది.

ఎప్పుడు ఎలాంటి ట్రిక్ ప్లేచేస్తుందో అర్థంకావడంలేదు. తనను మానసికంగా చిత్రహింసలకు గురిచేస్తోంది. మొదటిసారిగా తన నేరమయ జీవితం మీద అసహ్యం వేసింది. ఇలా దిన దిన గండంగా బ్రతకాలా? అతనికి మొదటిసారిగా భయమేసింది.

తను శర్మ కుటుంబాన్ని చంపేసి పార పాటు చేశాడు.

అతనలా ఆలోచిస్తోన్న సమయంలోనే తలుపు తెరుచుకుంది. ట్రేలో బిస్కెట్స్, ఆ వేళ డైలీ న్యూస్‌పేపర్ ఉంది.

ఆమె లోపలికి వచ్చి అతని ఎదురుగా ఉన్న కుర్చీలో కూచొని అతని చేతికట్టు మాత్రమే విప్పి "బిస్కట్స్ తీసుకో బాగా నీరసించిపోయావు కదా పాపం" అంది.

ఇదివరకటిలా కోపంగా చూడలేకపోతున్నాడు షంషేర్.

"అలా చూస్తావేమిటి బిస్కెట్స్ తీసుకో. లేదంటే బయటకు విసిరేస్తా" అంది.

అనిమిష అన్నంతపని చేస్తుందని అతనికి భయమేసింది. ఓ రోజు అన్నం తినకుంటే తను కళ్లముందే బయట పారేసింది. ఆకలితో చచ్చిపోయాడు. వెంటనే గబగబ బిస్కెట్స్ తిన్నాడు ఆబగా.

"వెరీగుడ్ కుక్కబిస్కెట్స్ కూడా ఎంత బాగా తిన్నావు. అయినా కుక్కకు వుండే విశ్వాసం నీకు లేదు" అంది అనిమిష.

ఒక్క క్షణం వామ్టింగ్ సెన్సెషన్

వచ్చింది. తను తిన్నది కుక్క బిస్కెట్సా?

"ఊర్కే అన్నానులే అసలు సిసలైన మనుష్యులు తినే బిస్కట్స్ కాకపోతే" అని ఆగింది.

ఏమిటన్నట్టు ఊపిరి బిగపట్టి చూశాడు షంషేర్.

ఒక్కో అక్షరాన్ని ఒత్తి పలుకుతూ చెప్పింది అనిమిష.

"ఆ బిస్కట్స్‌లో విషం కలిపాను. అతిశక్తిమంతమైన విషం. కోబ్రా జాతి పాము విషం. అవి తిన్నాక, నురగలు కక్కుకొని చచ్చిపోతారు. పాము కాటుకు గురై చచ్చావనుకుంటారు. లాకప్‌లోకి పాము వచ్చి నిన్ను కాటేసిందని అనుకుంటారు. ఫినిష్ అంతే"

బిస్కట్స్‌ని వాంతి చేసుకోబోయాడు. కుదరలేదు. భయంతో అతని శరీరం చెమటలు పట్టింది. కళ్లు తిరుగుతున్న ఫీలింగ్.

"భయంగా వుందా? పాము విషానికి విరుగుడు కావాలా షంషేర్."

అతని గొంతు ఎండిపోయింది. భయం అతని నరనరములోకి పాము విషం కన్నా భయంకరంగా ఇంజెక్ట్ అయింది.

అవునన్నట్టు తలూపాడు షంషేర్.

"గ్యాస్‌కనక్షన్ పీకి, గ్యాస్ లీక్‌చేసి చంపడం కన్నా ఈ శిక్ష భయంకరంగా ఉందా షంషేర్" - ఆ మాటలు అంటున్నప్పుడు ఆమె కళ్లు ఎర్రగా చింతనిప్పుల్లా మారాయి.

షంషేర్‌కు భయంతో కళ్లు తిరుగుతున్నట్టు అనిపించాయి.

"ఒక్కసారిగా కళ్లు మూసుకో! నువ్వెంత మందిని అతికిరాతకంగా చంపావో గుర్తుచేసుకో"

షంషేర్ తల విదిల్చాడు. తనిప్పుడు బ్రతకాలి. బ్రతుకు మీద తీపి అతనికి తెలుస్తోంది. ఎప్పుడూ పదుల సంఖ్యలో అనుచరులు, చేతిలో ఆయుధాలు విచ్చలవిడిగా తిరిగే స్వేచ్ఛ. లక్షల్లో డబ్బులు. ఇవ్వన్నీ వుండి తాను ఘోరంగా చనిపోతున్నానని అతని మానసిక పరిస్థితి ఘోరంగా మారింది. ఏక్షణమైనా భయంతో గుండె ఆగి చచ్చిపోయేలా ఉన్నాడు.

'భయపడకు షంషేర్ నిన్ను అంత తేలిగ్గా చంపను"

"అంటే" అతనిలో అనుమానం.

"విషం కలిపిన బిస్కట్స్ తిని హాయిగా చచ్చిపోతే ఎలా షంషేర్. నీకు యిచ్చిన బిస్కట్స్‌లో విషం లేదు. అయినా ఆకలి బాధ తీర్చే నెపంతో ఆయుష్షని హరించనులే."

అప్పుడు కొద్దిగా రిలాక్స్ ఫీలయ్యాడు. అయినా అతనిలో భయం ఎప్పుడే ఉపద్రవం ముంచుకొస్తుందోనని.

"నిజంగా ఆ బిస్కట్లలో విషం కలపలేదా? " అడిగాడు. అనుమానంగా షంషేర్ ప్రాణభయం ఎలా వుంటుందో అతనికి యిప్పుడిప్పుడే తెలుస్తోంది.

"చెప్పానుగా ఆకలి విషయంలో నేను అతి కౄరంగా వుండను."

షంషేర్ ఆమెవైపే చూస్తుండిపోయాడు. మృత్యు దేవత ప్రతినిధిలా కనిపిస్తోంది.

"ఆ షంషేర్ ఒక విషయం మరచిపోయాను. నువ్వు యివ్వాళ పేపరు చదవలేదుకదూ ఇదిగో నీకోసమే తెచ్చాను. కాంప్లిమెంటరీ కాపీ చదువు. అన్నట్టు నువ్వు తీసిన ఫొటోలు ఎంత బాగా వచ్చాయో" అంది పేపరు అతని చేతికి యిస్తూ

"ఫొటోలు నేను తీయడమేమిటి? " కంగారుగా అడిగాడు షంషేర్. అనిమిష మళ్లీ ఏదో తన ప్రాణంమీదికి తెచ్చిందన్న విషయం అతనికి అర్థమవుతోంది.

"డెత్ జోన్ ఫొటోలు, హైదరాబాద్‌లో నువ్వు చలామణి చేసిన కోటి రూపాయల

సుఖదుఃఖాల పైన ఆధిపత్యం సంపాదించిన వ్యక్తే జీవితంలో విజయానికి చేరువవుతాడు. – విశ్వేశ్వరయ్య

నెంబర్లు ఇంటరాగేషన్‌లో అన్నీ కక్కేశావుగా"

"ఇంటరాగేషన్‌లోనా? అసలు నన్ను పోలీసులు అరెస్టు చేయందే" అన్నాడు షంషేర్.

"అలా అమాయకంగా మాట్లాడితే ఎలా? అర్థం చేసుకోవాలి షంషేర్. మా నాన్న నిన్ను అర్థంచేసుకోలేదనేగా నువ్వు క్రూరంగా చంపింది" అలా అంటున్నప్పుడు ఆమె కళ్లు కోపంతో ఎర్రబడడం గమనించాడు షంషేర్.

గబగబ పేపర్ తిరగేశాడు. అది చదివాక అతని గుండెల్లో ఏకంగా మిస్సయిల్స్ పరుగెత్తాయి. ఈ వార్త దాదామియా చదివితే ఖచ్చితంగా తనని చంపేస్తాడు. అంత పకడ్బందీగా తనే పోలీసులకు ఈ రహస్యాలు వెల్లడిచేసినట్టుగా వుంది ఆ వార్త.

"చూడు అనిమిషా నన్ను వదిలేయ్. ఇప్పటికే దాదామియా నా గురించి వేట మొదలుపెట్టి ఉంటాడు. ఏదో ఒక క్షణం నేను ఎక్కడున్నానో కనిపెడతాడు. ఆ తర్వాత నిన్ను భీష్మాచార్యని జాన్‌డేవిడ్‌ని ఎవర్నీ వదిలి పెట్టడు"

పగలబడి నవ్వింది అనిమిష. అలా నవ్వుతూనే ఉంది. అయోమయంగా అనిమిషవైపు చూశాడు. ఇంకా నవ్వుతూనే ఉంది.

"ఎందుకలా నవ్వుతున్నావు? "

"నీ అమాయకత్వాన్ని చూసి జాలేసి"

"ఎందుకు"

"ఎందుకా? దాదామియా నీ గురించి వేట మొదలుపెట్టాడు. కరక్టే కానీ నిన్ను కాపాడ్డానికి కాదు ఖతం చేయడానికి" చెప్పి ఆగింది అతని మొహంలోకి చూసింది.

పక్కలో బాంబు పడ్డట్టు అదిరి పడ్డాడు.

"ఏమిటి నువ్వు చెప్పేది? దాదామియా నన్నెందుకు చంపుతాడు" చిరాకుగా అన్నాడు షంషీర్.

"మళ్లీ మొదటికొచ్చావు. దాదామియా రహస్యాలు అన్నీ మాకు చెప్పావుగా. ఆ ఒక్క కారణం చాలు. నిన్ను దాదామియా చంపడానికి".

"దాదామియా అంత మూర్ఖంగా ప్రవర్తించడు. అలా చేస్తే దాదామియా రహస్యాలు అన్నీ నేను బయట పెట్టేద్దును" స్వగతంలా అన్నాడు.

"ఏమిటి ఏమన్నావు? అలా చేస్తే దాదామియా రహస్యాలు బయట పెడతావా? వెరీగుడ్ పోనీ ఇప్పుడు బయట పెట్టు" అంది ఉత్సాహంగా ముందుకు వంగి.

"ఏదో మాట వరుసకు అన్నాను" అన్నాడు తన తప్పును సరిదిద్దుకునే ప్రయత్నం చేస్తూ.

తను అనవసరంగా నోరు జారాడు. దాని పర్యవసానం ఎలా ఉంటుందో అతనికి లోలోపల భయంగానే ఉంది.

అనిమిషకు బ్రహ్మాండమైన ఐడియా ఫ్లాష యింది. వెంటనే బయటకు నడిచింది.

బయటకు వెళ్లే ముందు అతని చేతులు కట్టేయడం నోటికి ప్లాస్టర్ వేయడం మరిచి పోలేదు.

★ ★ ★

"ఏమిటి అనిమిషా నువ్వనేది."

"అవును అంకుల్ బ్రహ్మాండమైన క్లూ ఇచ్చాడు షంషీర్ తన కన్ను తానే పొడుచుకునే ఐడియా చెప్పాడు."

"అంటే నువ్విప్పుడు ఏం చేయబోతున్నావు? "

"నాకు దాదామియా నుంచి ప్రాణభయం ఉంది. నాకు రక్షణ కల్పించండి. అప్రువర్‌గా కోర్టు ముందు లొంగి పోతానని షంషీర్ పోలీసులతో చెప్పినట్టు మనం వార్త రాస్తాం"

'వ్వాట్' అదిరి పడ్డట్టు అడిగాడు- భీష్మాచార్య.

'అవున్సార్. దాంతో దాదామియా శివమెత్తిపోతాడు. దాదాపు పిచ్చివాడై రెచ్చిపోతాడు. ఇప్పటికే అతను సలీంను షంషీర్‌ని ట్రేస్ చేయమని పంపించాడు. ఈ దెబ్బతో

మరింత రెచ్చిపోతాడు. ముఖ్యంగా తన ఉనికి బయట పెట్టే ఏ వ్యక్తినీ దాదామియా క్షమించిన దాఖలాలు లేవు.

భీష్మాచార్యకు అనిమిష చెప్పిన ఐడియా బాగానే అనిపించింది.

'అంకుల్ నిజానికి షంషీర్‌ని నా చేతులతో స్వయంగా నేనే చంపాలనుకున్నాను. కానీ మీరు ఎప్పుడైతే చేతులకు రక్తం అంటుకో కూడదని చెప్పారో కనీసం అతని ద్వారా రహస్యాలు రాబట్టి నేరం అతను ఒప్పుకునేలా చేసి, కోర్టుకు అప్పగిద్దామని అనుకున్నాను. కానీ షంషీర్ అందుకు కూడా సహకరించడం లేదు. అతను చేసిన తప్పుకు అతనే శిక్ష అనుభవించాలి అందుకు ఇదొక్కటే మార్గం' అంది అనిమిష.

"వెల్ ప్రొసీడ్" అన్నాడు భీష్మాచార్య.

నేరం చేసిన వాడిని కొత్త శిక్షాస్మృతితో శిక్ష విధించడానికి అక్షరాలని సెక్షన్లుగా మార్చి అక్షర స్మృతితో శిక్ష వేయడానికి అనిమిష ఆయత్తమవుతోంది.

అక్షరాలు అస్త్రాలయ్యేందుకు ఉవ్విళ్ళూరుతున్నాయి.

★ ★ ★

దాదాపు కోపంతో పిచ్చివాడై పోయాడు దాదామియా. ఆవేశంతో ఊగి పోతున్నాడు. పోలీసులు షంషీర్‌ని ఎక్కడ దాచిందీ ఇంకా ట్రేస్ చేయలేకపోయాడు. సలీం. కానీ ఈలోగా షంషీర్ అప్రూవల్‌గా మారతాననడం, ఆ వార్త డ్రెలా న్యూస్‌లో చూసినప్పట్నించీ అతను ఆవేశంతో ఊగిపోతున్నాడు.

తనకు సంబంధించిన పూర్తి రహస్యాలు షంషీర్‌కు తెలియకపోయినా చాలా రహస్యాలు తెలుసు . అవి చాలు తన ఉనికి బహిర్గత పర్చడానికి.

ఇప్పటి వరకు షంషీర్‌ని బయటకు తీసుకు రావాలని ప్రయత్నించాడు. కానీ ఇప్పుడు షంషీర్‌ని కాపాడి ప్రయోజనం లేదు. తనకు తెలిసిన రహస్యాలు అన్నీ చెప్పేసి ఉంటాడు.

అందుకు ప్రత్యక్ష సాక్ష్యం పోలీసులు ముందు అప్రూవర్‌గా మారిపోతానని షంషీర్ చెప్పడమే ఆ వార్త పేపర్‌లో రావడమే. ఇక షంషీర్‌ని ఉపేక్షించి లాభం లేదు. అతను బ్రతికి ఉన్నా తనకు ప్రయోజనం లేదు. పైగా అతను కోర్టులో సరెండర్ అయిపోతే ఆ మార్గంలో చాలా మంది వెళ్తారు. తనంటే తన అనుచరుల్లో భయం తగ్గుతుంది. ఆ అవకాశం తను షంషీర్‌కు ఇవ్వకూడదు.

వెంటనే సలీంను పిలిచి చెప్పాడు దాదామియా.

"ఈ క్షణం నుంచి వేట తీవ్రతరం చేయి. షంషీర్‌ని చంపడమే నా లక్ష్యం. నా లక్ష్యానికి అడ్డు వచ్చే అందర్నీ లేపేయ్ ఈ పని నువ్వు సమర్థవంతంగా చేస్తే కోటి రూపాయలు ఇస్తాను"

డబ్బు కోసం ఎలాంటి నేరమైనా ఘోరమైనా చేయడానికి సిద్ధపడే సలీమ్ ఆ ఆఫర్‌ని ఆనందంగా ఒప్పుకున్నాడు.

ఆ విధంగా షంషీర్‌కు మరణ ముహూర్తం నిర్ణయించబడింది.

★ ★ ★

అనిమిష స్టోర్ రూమ్ తలుపులు తెరిచింది. షంషీర్ భయం భయంగా చూస్తున్నాడు. అనిమిష అంటేనే అతనికి భయం వేస్తోంది.

"గుడ్‌నైట్ షంషీర్ ఆల్ ద బెస్ట్" అంది అనిమిష.

షంషీర్ అయోమయంగా చూశాడు. ఆమె వెనుకే జాన్‌డేవిడ్ భీష్మాచార్య వచ్చారు.

అనిమిష అతని కట్లు విప్పదీసింది.

'టుడే ఆన్‌వర్డ్స్. ఈ క్షణం నుంచీ నువ్వు ఫ్రీ బర్డ్‌వి. వెళ్ళిపో ఆల్ ద బెస్ట్" అంది అనిమిష.

ఒక్క క్షణం అనిమిష చెబుతుంది నిజమా కాదా? అన్న డైలమాలో ఉండిపో యాడు.

"అదేమిటి పారిపో అంటే అలా శిలలా నిలబడిపోతావ్. త్వరగా వెళ్లు"

తనని పారిపొమ్మని చెప్పి. పారిపో తుంటే షూట్ చేయదుకదా. అన్న అను మానం వచ్చింది. అతని అనుమానం అర్థ మైనట్టు నవ్వి అంది అనిమిష.

"నేను నిన్ను చంపను. నేనే కాదు. మా ముగ్గురిలో ఎవరూ చంపరు. వెళ్లిపో. అన్నట్టు ఈ పేపరు మీ దాదామియాకు ఇచ్చేయ్. కాంప్లిమెంటరీ కాపీ అని. అన్నట్టు ఈవాల్టి వార్తకు కాపీరైటు నీది"

షంషేర్ గబగబా పేపర్ చదివాడు. అతని మొహం తెల్లగా పాలిపోయింది.

"వాటీజ్ దిస్. ఇదేమిటి? నేను అప్రూవ ర్‌గా మారిపోవడమేమిటి? " కంగారుగా అడిగాడు.

'రాత్రి నాకో మంచి కల వచ్చిందిలే. ఆ కలలో నువ్వు పోలీసుల ముందు సరెండరై అప్రూవర్‌గా మారతానని అన్నట్టు. పోనీలే ఇదేదో బావుందని వార్త రాసేశాను అంతా ఉత్తుత్తిది".

షంషేర్‌కు పిచ్చెక్కినట్టుగా ఉంది. ఇప్పుడు తనేం చేయాలి? దాదామియా ఇదంతా నమ్ముతాడా? తను నిజంగానే అప్రూవర్‌గా మారానని అనుకుంటాడా?

"త్వరగా పారిపో షంషేర్! మా జాన్‌డే విడ్ రాక్షసుడు. నువ్వు ఆలస్యం చేస్తే అత నికి నిన్ను చంపాలన్న కోరిక పుట్టొచ్చు. అంతెందుకు నా మనసే మారిపోవచ్చు. నా కుటుంబాన్ని చంపారన్నది మనసులో తొలచి నిన్ను నేనే చంపేయవచ్చు"

షంషేర్ కళ్లలో మొదటిసారిగా స్పష్టంగా భయం కనిపించింది.

వెంటనే అక్కడినుంచి పరుగుపెట్టాడు. అతను ఇంటి ఆవరణలో నుంచి బయటకు వింటి నుంచి సంధించిన బాణంలా పరుగె త్తాడు.

ఈ సంఘటన జరగడానికి అరగంట ముందు...

★ ★ ★

అనిమిష తన చేతిలో ఉన్న షంషేర్ తాలూకు సెల్‌ఫోన్‌ని జాన్‌డేవిడ్‌కు ఇచ్చింది.

"జాన్‌డేవిడ్ మీరు మిమిక్రీ బాగా చేస్తా రట కదా. ఓ పోలీసు ఆఫీసర్‌లా మాట్లాడ గలరా? " అడిగింది అనిమిష.

"ఎందుకు? " అడిగాడు జాన్‌డేవిడ్

"తరువాత చెబుతాను. మీరిలా మాట్లా డాలి. నేను పోలీసు కంట్రోల్ రూమ్ నుంచి మాట్లాడుతున్నాను. దాదామియాకు బాగా కావాల్సిన వాడిని. షంషేర్ పూర్తిగా అప్రూవర్‌గా మారాడు. ఇందాకే భీష్మాచార్య ఇంటికి వెళ్లి ఆ జర్నలిస్టు అనిమిషతో ఒక ఒప్పందానికి వచ్చాడు. నీకు, దాదామియాకు సంబంధించిన రహస్యాలు పత్రికకు ఇచ్చే ఒప్పందం కుదిరింది. కాసేపట్లో భీష్మాచార్య ఇంట్లోనుంచి బయటకు వస్తాడు. ఈ విషయం దాదామియా సాబ్‌కు చెప్పండి. నన్ను కొద్దిగా గుర్తు ఉంచుకోమని కూడా చెప్పడం మరిచిపోకండి. అని చెప్పాలి"

"దీనివలన లాభం ఏమిటి? "

"చెప్పి చూడండి. లాభం నష్టం రెండూ తెలుస్తాయి. మొదటి లాభం మనకు రెండో నష్టం దాదామియాకు"

భీష్మాచార్య జాన్‌డేవిడ్‌కు సైగ చేశాడు అనిమిష చెప్పినట్టు చేయమని.

జాన్‌డేవిడ్ మిమిక్రీలో నిష్ణాతుడు. వెంటనే గొంతు మార్చి సలీంకు ఫోన్ చేసి అనిమిష చెప్పిన విషయాన్ని అక్షరం పొల్లు

మనం గతాన్ని మార్చలేము - కానీ భవిష్యత్తుకు సంబంధించిన దిగులు బంగారం లాంటి మన వర్తమానాన్ని పాడుచేస్తుంది. - పార్కర్

పోకుండా చెప్పాడు.

★ ★ ★

సలీం మొహంలో వికృత ఆనందం. కంట్రోల్ రూం నుంచి ఫోన్ రాగానే అతని మొహం వెయ్యి క్యాండిల్స్ బల్బ్‌లా వెలిగింది. అంత ఆనందంలోనూ అతనో విషయాన్ని మరచిపోలేదు. కంట్రోల్ రూమ్ నుంచి ఫోన్ వచ్చిన విషయం ఎటువంటి పరిస్థితుల్లోనూ దాదామియాకు తెలియజేయకూడదు.

అలా చెబితే తను దాదామియాకు అనుకూలంగా ఉండే ఓ పోలీసు ఇన్ఫార్మర్ సాయంతో షంషేర్‌ని చంపినట్టు అవుతుంది. అలాంటప్పుడు కోటి రూపాయలు తనకు దాదామియా ఇవ్వకపోవచ్చు. పైగా ఆ క్రెడిట్ అంతా తన ఇన్‌ఫార్మర్‌దేనని అనుకుంటాడు.

గుట్టుచప్పుడు కాకుండా తను షంషేర్‌ని ఫినిష్ చేయాలి. ఈ క్రెడిట్ అంతా తనదేనని దాదామియా ముందు నిరూపించుకోవాలి.

వెంటనే ప్యాంటు జేబులో ఉన్న రివాల్వార్‌ని తడిమి చూసుకున్నాడు. భీష్మాచార్య ఇంటి దగ్గరికి వచ్చాడు. సరిగ్గా పది నిమిషాల తర్వాత షంషేర్ దిక్కులు చూస్తూ పరిగెత్తుకొస్తున్నాడు భీష్మాచార్య ఇంట్లో నుంచి.

ప్యాంటు జేబులో నుంచి రివాల్వర్ తీశాడు. షంషేర్ వైపు ఎయిమ్ చేశాడు.

సరిగ్గా అదే సమయంలో అక్కడే చుట్టుపక్కల మొత్తం కవర్ చేస్తూ ఉంది పోలీసు టీమ్. జాయింట్ కమిషనర్ పర్యవేక్షణలో, నమ్మకస్థులైన పోలీసు అధికారులతో ఆ ప్రాంతాన్ని చుట్టుముట్టారు. సలీం నేరాలను రుజువు చేసే ఆధారాలు లేవు. ఒకవేళ సలీంను అరెస్టు చేసినా, బెయిల్‌పై బయటకు రావచ్చు. అందుకే సలీంను ఫినిష్ చేయాలి.

ఈ ఐడియా అనిమిషదే. జాయింట్ కమిషనర్‌కు నచ్చింది. చట్టంకన్నా న్యాయం, ధర్మం ముఖ్యం అని నమ్మే నిజాయతీపరుడతడు.

★ ★ ★

షంషేర్ పరుగెత్తుకొస్తూ ఒక్క క్షణం ఆగాడు. వెనకనుంచి జాన్‌డేవిడ్ కానీ, అనిమిషకానీ తనను షూట్ చేయడానికి ప్రయత్నించడం లేదు కదా అన్న డౌట్‌తో.

అప్పుడు గుర్తొచ్చింది సెల్ ఫోన్. అదెక్కడుంది. వెంటనే దాదామియాకు ఫోన్ చేసి మొత్తం వివరంగా చెప్పాలి. తప్పకుండా తనను దాదామియా నమ్ముతాడు. ఆలస్యమైతే తన ప్రాణానికి ముప్పు రావచ్చు.

అలా ఆలోచిస్తూ వడివడిగా నడిచి ఒక్క క్షణం కంగుతిన్నాడు. ఎదురుగా రివాల్వర్‌ని తనవైపు గురిపెట్టి మృత్యువులా నిలబడి వున్నాడు సలీం.

"సలీం భాయి నువ్వు... అసలేం జరిగిందంటే" ఏదో చెప్పబోయాడు షంషేర్

"నాకంతా తెలుసు. ముందు చావు" అంటూ ట్రిగ్గర్ మీద వేలు బిగించాడు.

షంషేర్ భయంతో హడలిపోయాడు. తనిప్పుడు ఏం చెప్పినా వినడు. వెంటనే వెనుతిరిగి పారిపోయే ప్రయత్నం చేశాడు.

సలీం అప్పటికే ఎలర్ట్‌గా వున్నాడు. అతను షూటింగ్‌లో ఎక్స్‌పర్ట్. ఆ విషయం షంషేర్‌కు తెలుసు.

ట్రిగ్గర్ నొక్కాడు సలీం. ఒకటి రెండు మూడు వరుసగా బుల్లెట్లు వచ్చి షంషేర్ శరీరంలో దిగబడ్డాయి. రక్తం చివ్వున చిమ్మింది. సలీం షంషేర్ దగ్గరకు వచ్చి అతని కణతకు రివాల్వర్ ఆన్చి ట్రిగ్గర్ నొక్కాడు. ఆరు బుల్లెట్లు షంషేర్ శరీరాన్ని ఛిద్రం చేశాయి. అతని ప్రాణాలు గాలిలో కలిసిపోవడానికి క్షణాలు సరిపోయాయి.

దూరం నుంచి ఈ దృశ్యం చూసిన అని

మిష సంతృప్తి.

ఆమె కళ్ళముందు తల్లి, తండ్రి, తమ్ముడు కదలాడారు.

భీష్మాచార్య అనిమిష భుజంమీద చేయి వేసి ఊరడించాడు.

సలీం పేల్చిన బుల్లెట్లు షంషేర్ ప్రాణాలు తీశాయి.

రివాల్వర్ పేలిన శబ్దానికి చుట్టుప్రక్కల వాళ్ళు నిద్రలేచారు. అనిమిష చకచక ఫోటోలు తీస్తోంది. ఈలోగా పోలీస్ విజిల్స్ వినిపించాయి.

సలీం ఒక్క క్షణం కంగుతిన్నాడు. ఈ సమయంలో ప్లాన్డ్‌గా పోలీసులు రావడమేమిటి? అతనికి అంతా అయోమయంగా వుంది. ఇదంతా పథకం ప్రకారం జరిగిందా?



సరిగ్గా అప్పుడే మోగింది సలీం జేబులో వున్న సెల్ ఫోన్.

సలీం యు ఆర్ ఫినిష్డ్. నీకు చట్టం వేసే శిక్ష కన్నా శక్తిమంతమైనది. సాక్ష్యాలు, ఆధారాలు అక్కర్లేదు. పారిపో అని వినిపించాయి అటువైపు నుంచి

ఆ గొంతు అనిమిషది. అప్పటికే సలీంను పోలీసులు చుట్టుముట్టారు. తప్పించుకునే అవకాశం లేదు. ఒక్కసారిగా తుపాకుల మోత. సలీం చేతిలో వున్న రివాల్వర్‌లో బుల్లెట్స్ లేవని తెలుసు. అయినా కాల్పులకు ఆదేశాలు ఇచ్చాడు జాయింట్ కమిషనర్.

పోలీసుల చేతుల్లోని తుపాకుల నుంచి దూసుకువచ్చిన బుల్లెట్లు సలీం శరీరాన్ని తూట్లుగా పొడిచాయి.

ఎందరి ప్రాణాలనో హరించి అతికిరాతకంగా అమ్మాయిలపై అత్యాచారాలు చేసిన సలీం దుష్ట నేరచరిత్ర ఆ విధంగా సమాప్తం అయింది.

ఆ ప్రాంతమంతా తుపాకీ మోతలతో దద్దరిల్లింది.

★ ★ ★

ఉదయమే నగరమంతా సంచలనం. షంషేర్ అనే నేరస్థుడు అప్రూవర్‌గా మారడం, సలీం అతడ్ని చంపే ప్రయత్నం చేయడం పోలీసుల ఎన్‌కౌంటర్‌లో సలీం చనిపోవడం అన్ని పేపర్ల నిండా అవే వార్తలు.

డైలా డైలీ న్యూస్ ప్రత్యేక వార్తాకథనాన్ని అందించింది. ఆ వార్త నగరవాసులకు మండు వేసవిలో వర్షం జల్లులా తెరిపినిచ్చాయి. సలీం అకృత్యాలకు ఆ విధంగా తెరపడ్డందుకు అంతా ఆనందించారు.

★ ★ ★

"థ్యాంక్యూ మిస్ అనిమిషా! మీ వల్ల దేశానికి ఎంతో ఉపయోగం జరిగింది. సలీం మరణం మా పోలీసు డిపార్ట్‌మెంట్‌కు సగం తలనొప్పిని తగ్గించింది" మనస్ఫూర్తిగా అన్నాడు జాయింట్ కమిషనర్.

"ఇదంతా నా గొప్పతనం ఏమీకాదు. భీష్మాచార్యగారు కన్నతండ్రిలా నా వెనుకే వున్నారు. జాన్ డేవిడ్ నన్ను కంటికి రెప్పలా కాపాడారు. మీరు నాకు మోరల్ సపోర్ట్ యిచ్చారు. సహకరించారు. అన్నింటి కన్నా ముఖ్యంగా అక్షరాలు. జర్నలిజం. సానపట్టిన అక్షరాలు చురకత్తుల్లా మారాయి. జీవంలేని అక్షరాలు సజీవమయ్యాయి. శబ్దంలేని అక్షరాలు మహా విధ్వం

సాన్ని సృష్టించి ఆ శబ్దానికి సంఘవిద్రో హుల కర్ణభేరీ పగిలేలా చేశాయి. ఇక మిగి లివుంది. దాదామియా" అంది అనిమిష.

సరిగ్గా అప్పుడే ఎక్స్‌క్యూజ్‌మీ అన్న పిలుపు వినిపించింది. అందరూ ఆ పిలుపు వినిపించిన వైపు చూశారు.

ఎదురుగా ఓ ముప్పయేళ్ళ యువకుడు. అనిమిషకు అతడిని ఎక్కడో చూసిన గుర్తు! కానీ ఎక్కడ? అప్పుడు గుర్తొచ్చింది. తనని జాయింట్ కమిషనర్ ఆఫీసు దగ్గర ఫాలో చేసింది ఇతడే!

జాయింట్ కమిషనర్ అనిమిష వైపు చూసి చెప్పాడు.

"హీ ఈజ్ సిద్ధార్థ. సిబిఐ ఏజెంట్. హైద్రా బాద్‌లో బ్యాంకులో జరిగిన నకిలీ నోట్ల గురించి ఎంక్వయిరీ కోసం నియమించబడ్డ ఆఫీసర్. మొదట్నుంచీ మిమ్మల్ని ఫాలో అవుతూ వచ్చారు. మీ నాన్నగారు నిర్దోషి అని అన్ని సాక్ష్యాలు సేకరించారు. మీకు పరో క్షంగా అండగా వుంటూ వచ్చారు".

"ఓహ్ అయామ్ సారీ! మిమ్మల్ని శత్రు వులా ఊహించుకున్నాను".

సిద్ధార్థ నవ్వి అన్నాడు "పర్లేదు నేను ప్రియమైన శత్రువును ఎనీహౌ మిమ్మల్ని అభినందించాలి ఎందుకంటే మేము చేయ వలసిన పనిని ఓ జర్నలిస్ట్‌గా చేశారు. అక్ష రాలకు కూడా ఇంత శక్తి ఉంటుందని నిరూ పించారు. మీకు ఓ ముఖ్య విషయం చెప్ప డానికే ఇక్కడికి వచ్చాను".

"ఏమిటది? " భీష్మాచార్య అడిగాడు.

"ఈవేళ్టి పేపర్లో వార్తలతో దాదామియా కంగు తిన్నాడు. డెత్‌జోన్‌లో మాఫియా లీడర్ల సమావేశం ఏర్పాటు చేశాడు. దేశంలో ఉన్న డాన్‌లంతా ఈ సమావేశా నికి హాజరవుతారు. ఇదివరకూ ఎవరికి వారు ప్రత్యర్థులు. ఇప్పుడు మాత్రం అందరూ ఏకమవుతున్నారు".

"ఇప్పుడేం చేద్దాం" జాయింట్ కమిషనర్ అడిగాడు.

అనిమిష కొద్ది క్షణాలు మౌనంగా వుండి సిద్ధార్థను అడిగింది. "మాఫియా డాన్‌ల సమావేశం ఎన్ని గంటలకు? "

"సాయింత్రం అయిదు గంటలకు".

"సరే! అయితే మీరు ఆరు గంటలకు మీ బలగాలతో రండి. అప్పుడు మాఫియా నేత లందర్నీ అరెస్టు చేయవచ్చు" చెప్పింది అని మిష జాయింట్ కమిషనర్‌తో.

"దానికి ముందు ఓ చిక్కు వుంది. హోమ్ మంత్రి దాదామియాకు సన్నిహి తుడు. ఇప్పటికే నా మీద అతనికి అను మానం. నా ఊహ నిజమైతే హోమ్ మంత్రి కూడా ఈ సమావేశానికి హాజరు కావచ్చు. ఎన్నికల్లో రాజకీయ నాయకులకు ఇలాంటి స్మగ్లర్లు, మాఫియా మనుష్యుల సాయం కావాలిగా"

అనిమిష ఆలోచనలో పడింది. నిజమే చెడును అణచివేయడానికి ఒకే ఒక మార్గం ఉంటుంది. అది క్లిష్టంగా ఉంటుంది. చెడు చేయడానికి వేనవేల మార్గాలు వుంటాయి. అది ఆకర్షణీయంగా వుంటుంది.

అనిమిష జాయింట్ కమిషనర్‌కు చెప్పింది తన ఆలోచనను.

ఆ ఆలోచన అందరికీ నచ్చింది. తిరుగు లేని ఆలోచన.

★ ★ ★

మినిష్టర్స్ ఛాంబర్.

హోమ్ మినిష్టర్ ముందు. నిలబడి వున్నారు. హోమ్ మినిష్టర్ ఆవేశంతో ఊగి పోతున్నాడు.

"అసలు మీరేం అనుకుంటున్నారు- నెత్తి మీద టోపి పెట్టుకొన్నట్టు జేబులో చట్టాన్ని పెట్టుకున్నామని అనుకుంటున్నారా? సలీంను ఎందుకు షూట్ చేయవలసి వచ్చింది? " ప్రశ్నల వర్షం కురిపిస్తున్నాడు.

అతనికి దాదామియా నుంచి ఒత్తిడి

ఎక్కువైంది. రేపు ఎలక్షన్స్‌లో రిగ్గింగ్ చేయించాలన్నా, కోట్ల కొద్దీ డబ్బును గుమ్మరించాలన్నా దాదామియాలాంటి వాళ్ళ సాయం కావాలి మరి!

జాయింట్ కమిషనర్ కామ్‌గా వుండిపోయాడు.

"ఇంకెప్పుడు నన్ను సంప్రదించకుండా ఏ పనీ చేయకండి" చెప్పాడు హోమ్ మంత్రి.

'అలాగే సర్' సెల్యూట్ చేసి చెప్పాడు జాయింట్ కమిషనర్.

హోమ్ మినిష్టర్ వెళ్ళిపోయాడు. సరాసరి డెత్‌జోన్‌కు వెళ్లి మాఫియా నేతల సమావేశానికి అతను హాజరవుతున్నాడు.

★ ★ ★

సాయంత్రం అయిదు గంటల ముప్పయి నిమిషాలకు జాయింట్ కమిషనర్ ముఖ్యమంత్రి ఛాంబర్‌కు వచ్చాడు.

ముఖ్యమంత్రి నిజాయితీపరుడు.

"సర్. డెత్‌జోన్ దగ్గర ఎవరో ఉగ్రవాదులు బాంబులు పెట్టారని ఇన్ఫర్మేషన్ వచ్చింది. బాంబింగ్ స్క్వాడ్‌ని తీసుకొని వెళ్ళాలి. ఉగ్రవాదులు అక్కడ ఉండవచ్చని సమాచారం. హోమ్ మినిష్టర్‌గారు అందుబాటులో లేరు" చెప్పాడు జాయింట్ కమిషనర్.

వెంటనే వెళ్ళమని చెప్పాడు ముఖ్యమంత్రి.

★ ★ ★

డెత్‌జోన్...

మాఫియా నేతలంతా కలిసి రౌండ్ టేబుల్ సమావేశం ఏర్పాటు చేశారు. దాదామియా మిగతా మాఫియా నేతలందర్నీ కలసికట్టుగా పోరాడాలని పిలుపు ఇచ్చాడు.

హోమ్ మినిష్టర్ సహకారంతో మాఫియా సామ్రాజ్యాన్ని విస్తరించాలనీ, ఇప్పటికే మాఫియా అంటే భయం తగ్గిందని, అందుకే విధ్వంసం సృష్టించి భయాన్ని కలిగించాలని చెప్పాడు దాదామియా.

సరిగ్గా అదే సమయంలో పోలీసులు డెత్‌జోన్‌ని ముట్టడించారు.

తమని అరెస్ట్ చేయడానికి కాల్చి చంపడానికే పోలీసులు ప్లాన్ చేశారని అర్థమైంది. ఇదంతా హోమ్ మినిస్టర్ కుట్రే అని అనుమానం కలిగిన దాదామియా పిచ్చికోపంతో విచక్షణా రహితంగా హోమ్ మినిష్టర్ మీద కాల్పులు జరిపాడు.

ఎప్పుడైతే హోమ్ మినిష్టర్‌ని దాదామియా కాల్చివేశాడో పోలీసులు కాల్పులు మొదలుపెట్టారు. అనిమిష, జాన్‌డేవిడ్‌లు కొన్ని చోట్ల బాంబులు పాతిపెట్టి రిమోట్‌తో పేల్చేశారు.

సరిగ్గా మూడు గంటల్లో డెత్‌జోన్ విధ్వంసమైంది. మాఫియా నేతల తలలు తెగి రాలిపడ్డాయి. డెత్‌జోన్ భూస్థాపితమైంది. నేర సామ్రాజ్యం పతనమైంది.

భారతదేశ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖితమైంది. డైలీ న్యూస్‌లో అనిమిష రాసిన ఆ వార్త.

మళ్ళీ కొన్నాళ్ళ వరకు మాఫియా తలెత్తదు. ఒకవేళ తలెత్తితే అనిమిష అక్షరాలు అస్త్రాలై సిద్ధంగా వుంటాయి.

ఓ వేకువ వేళ!

పచ్చగడ్డి మీద మంచు బిందువులు మెరుస్తోన్న వేళ!!

అనిమిష జాగింగ్ చేస్తోంది.

వెనకే ఆమెను ఫాలో అవుతున్నాడు ఎప్పుడూ ఆమెను అంటిపెట్టుకొని వుండే జాన్‌డేవిడ్.

భీష్మాచార్య వాకింగ్ చేస్తున్నాడు. అక్షరాలు మంచుబిందువులై ఆమెపై వర్షించి, ఆశీర్వదిస్తున్నట్టున్నాయి.

ఆ దృశ్యం అద్భుతంగా వుంది.

*

## ఆల్ఫాబెటాభ్యాసమ్

అది నగరంలో ఫైవ్‌స్టార్ హోటల్ నాలుగవ ఫ్లోర్‌లో ఫంక్షన్ హాల్. 'బంటి' అనబడే చంటి వాడికి అక్షరాభ్యాసమ్ అనబడే అల్ఫాబెటాభ్యాసమ్.

ఆడంబరంగా, కలర్‌ఫుల్‌గా ఉంది అట్‌మోస్ఫియర్. జెంట్స్ ఫుల్‌సూట్లు, షూస్, లేడీస్ జీన్సు, బెల్‌బాటమ్స్. ఆడమగ మధ్య తేడా పరిశీలనగా చూస్తేనే తెలుస్తుంది.

క్యాటరింగ్ వాళ్లు వెల్‌కం చెబుతూ అందరికి కాఫీ, టీ, బిస్కెట్స్ ఇస్తున్నారు. అంతలో ప్రీస్ట్ వచ్చాడు.

బెల్‌బాటమ్ ప్యాంట్, చేతిలో సెల్, చెవులకు రాగిపోగులు, చిన్నమంత్రాల క్యాసెట్, టేప్‌రికార్డులతో వచ్చాడు. రాగానే డ్రెస్ మార్చుకుంటాను అని రూమ్‌లోకి వెళ్లి పంచె కట్టుతో వచ్చాడు. ఇది ఇంకా మారలే, ముందుముందు చెప్పలేం. వాళ్లబ్బాయి దుబాయ్‌లో ఉన్నాడు. అమ్మాయి బొంబాయిలో ఉంది. వేదికపైన, అదేనండీ! డయాస్‌పైన ప్రీస్ట్ అనగా పురోహితుల వారు చైర్‌లో కూర్చున్నాడు. పక్కన సింహాసనంలాంటి ఆసనంపైన బంటిని కూర్చోబెట్టారు.



ప్రీస్ట్ అనౌన్స్ చేశాడు. నౌ అల్ఫాబెటాభ్యాస కార్యక్రమం జరుగుతుంది. ఐమీన్ అల్ఫాబెట్ లర్నింగ్ సెర్‌మనీ స్టార్టవుతోంది. "నౌ మేడమ్ సమ్ రైస్, సమ్ పసుపు, కుంకుమ తీసుకురండి'' అన్నాడు.

"సర్! మీరు డయాస్ మీదికి రావాలి" అని పిలిచాడు బంటివాళ్ల డాడీని.

"ఎస్, కమింగ్" అంటూ వచ్చాడు పి.పి. రావు అంటే పతంగీల పాపారావు.

కమాన్, సుమూహర్తానికి టైం, దగ్గరయింది. తొందరపెట్టాడు ప్రీస్ట్. "గెస్ట్స్ అందరూ సైలెన్స్ అండ్ సిటవున్" అన్నాడు అతనే మైక్‌లో.

మంత్రాల క్యాసెట్ ఆన్ చేశాడు. తాను పెదవులు కదుపుతూ డబ్బింగ్ చెప్పినట్టుగా.

తండ్రి సంప్రదాయ విద్య నేర్చుకోరా అంటే క్లబ్‌లు, పబ్‌లు అంటూ కాలేజి, గ్యారేజి అంటూ తిరిగింది గుర్తొచ్చింది. అయినా ఈ రోజుల్లో ఈ సంప్రదాయ విద్య బంగారు గుడ్లు పెట్టేబాతు అని అర్థమయ్యాక ఇప్పుడిప్పుడే టేపురికార్డు ద్వారా సాధన చేస్తున్నాడు.

"సర్! మేడమ్! ఈ ఎల్లో రైస్ తీసుకొని ఇలా

చెప్పండి.

ఓం కేశవాయ నమః

ఓం నారాయణాయ నమః

ఓం మాధవాయ నమః

త్రీటైంస్ వాటర్ ఆ స్పూన్‌తో తీసుకోండి" అన్నాడు. మేడమ్! మీరు కూడా సేమ్‌టు సేమ్. "సర్, మీరు మేడమ్, స్టాండప్ అయ్యి, ఇదిగో ఈ సిల్వర్ ఫ్రేం స్లేట్‌ను బాయ్‌కు ఇవ్వండి" అన్నాడు పలక అందిస్తూ. సార్, మేడమ్ ఆలాగే చేశారు.

"సార్, సీమి, మీ బాయ్ చేత ఇలా రైటింగ్ చేయించండి. సర్‌వస్ తీ నమస్తు భ్యమ్ అబ్బాయితో అనిపించండి" అన్నాడు.

అందరూ అదిరిపడ్డారు, ఇదేదో ఆఫ్రికా అడవుల్లో ముగాబే జాతివాళ్ల భాషలా, భయంకరంగా వినిపించింది. అబ్బాయే కాదు అక్కడ ఎవరూ అనలేరని పురోహితు డు మమ అనుకొమ్మన్నాడు.

"ఎస్ ఎస్" అన్నాడు అబ్బాయి అనబడే ఆ బాయ్. సర్ అని ఏదో అనబోగా పురో హితుని సెల్ మోగింది.

"ఎస్ ఆల్‌రైట్! ఓకే వండర్‌ఫుల్! వెల్ గుడ్! వెరీగుడ్" అంటూ సంభాషణ ముగిం చాడు.

"ఆ ఎందాక కమింగ్ మేడమ్ మీ బాయ్ హేండ్ పట్టుకొని ఇలా రాయించండి. సర్, ఇంగ్లిషులో రాయిద్దామా! తెలుగు రైటింగా!" అడిగాడు అబ్బాయి డాడీని.

"నో తెలుగు ఓన్లీ ఇంగ్లిషు" అన్నారంతా యూనానిమస్‌గా. అబ్బాయి ఎల్.కె.జి చదవటానికి వచ్చే యేడే అమెరికా వెళ్తా డాయే మరి!

"సర్ ఓంఓంఓం అని త్రీటైంస్ రైటింగ్ చేయించండి." అని ఆంగ్లంలో అక్షరాభ్యాసం చేయించాడు.

"సర్! సో అల్ఫాబెట్ సెరమనీ ముగిసింది. మీ కపుల్స్ ఇలా రండి, మీ బాయ్‌కి న్యూడ్రెస్ పెట్టండి. నాకు మనీ ఇప్పించండి" అన్నాడు పురోహితుడు.

"సర్ మీరు, మేడమ్ వచ్చిన గెస్ట్స్ అన బోయి ఘోస్ట్స్ అన్నాడు మళ్లీ దిద్దుకొని సారీ సారీ గెస్ట్స్ అన్నాడు ఈ అక్షింతలు, మీ బాయ్ మీద పోయండి" అన్నాడు 'ఎస్ ఎస్' అన్నారంతా.

– డా॥ బి.దామోదరరావు

## లాస్ట్ పెగ్

**బార్**లో ప్రతీ బల్లపైనా లైటు వెలుగు తోంది. ప్రతి బల్ల దగ్గర ఇద్దరు ముగ్గురు కూర్చుని మందు తాగుతూ చిప్స్ తింటు న్నారు. సప్లై చేసే అటెండర్లు హడావిడిగా అటూ ఇటూ తిరుగుతున్నారు.

సాయంత్రం ఆఫీసులో అందరూ వెళ్ళిపో యాక చలపతి రాత్రి ఏడు గంటలకు బయ లుదేరి బార్‌కి వెళ్లి రెండు పెగ్గులు లాగిం చేసి తరువాత ఇంటికి వెళ్ళడం అతని దిన చర్య. ఇంటిదగ్గర భార్యామణి ఎంత పోరు పెట్టినా "దున్నపోతు మీద వాన కురిసి నట్లు". చలపతి తన బాణీ మార్చుకో లేదు. ఆరోజు మార్కెట్‌లోకి క్రొత్త బ్రాండ్ వచ్చిందంటేను, ఒక నిబ్ తెప్పించుకుని, సగం తాగాడు. మిగతాది గ్లాసులో మిన రల్ వాటర్ కలిపి పెట్టుకుని ఎటో చూస్తూ ఆలోచనలో ఉండగా మాంచి స్పీడులో ఒక యువకుడు వచ్చాడు. జీన్స్ ప్యాంట్ మీద పెద్ద గళ్ళ చొక్కా వేసుకున్నాడు. చాలా పొగరుబోతుతనంగా ఉన్నాడు. వస్తూనే చలపతి టేబుల్ దగ్గరకు వచ్చి అతని ఎదు రుగా ఉన్న గ్లాసు తీసుకోబోయాడు.

"మిస్టర్ ఏమిటిది?" అన్నాడు చలపతి సీరియస్‌గా

"వెరీ సింపుల్. ఈ గ్లాసులోని డ్రింకు తాగుదామని"

"తప్పు బాబూ. సప్లయర్‌ని పిలిచి తెప్పిం చుకొని తాగు. ఇది మంచి పద్ధతి కాదు"









అన్నాడు చలపతి.

"మీరెవరు నాకు చెప్పడానికి" అంటూ గ్లాసు ఎత్తుకుని ఒకేసారి తాగేశాడు.

వెంటనే చలపతి "ఓకే. తాగేశావు కదా. అయితే నేను ఈ మందు తాగడానికి వెనుక ఉన్న విషాద గాథ రెండు ముక్కల్లో చెప్తాను నువ్వు వినేసి వెళ్ళిపో" అన్నాడు

"ఓకే" అన్నాడా యువకుడు

"బాబూ! నాది ఒక దీనాతిదీనమైన గాథ. రెండు వారాల క్రితం నా తల్లీతండ్రీ కొద్దిరోజుల తేడాతో అకస్మాత్తుగా చనిపోయారు. ఆ బాధల్లో నేను ఉద్యోగ విధులు సరిగా నిర్వర్తించకపోవడంతో నా ఉద్యోగం పోయింది. దానితో నా భార్య నాకు ఎదురు తిరిగింది. ఆమె కూడా ఉద్యోగం చేస్తుందిలే. నన్ను వట్టి చేతకాని వెధవలా చూడసాగింది. ఇంట్లో నానాటికీ నా పరిస్థితి తీసికట్టు అయిపోతుంటే నేను ఇంక చనిపోదామని నిర్ణయించుకున్నాను. కొంచెంసేపటిక్రితం వచ్చి రెండు పెగ్గులు మందు తెప్పించుకుని అందులో విషం పౌడర్ కలిపి తాగేద్దామనుకుంటున్న సమయంలో నువ్వు వచ్చావు. తాగేశావు. చూశావా నాకు చనిపోవడానికి కూడా దేముడు అనుమతి ఇవ్వలేదు. కాని ఆ పర్మిషన్ నీకు అనుకోకుండా లభించింది" తాపీగా చెప్తున్న చలపతి మాటలు పూర్తికాలేదు.

"అయితే ఈ గ్లాసు మందులో విషం కలుపుకున్నారా? అప్పుడే గ్లాసులో కొంచెం వుంటే లాస్ట్ సిప్ చేశాడు. గ్లాసు చేతిలోనే ఉంది.

"అవును బాబూ! విధి బలీయం" అన్నాడు చలపతి.

"ఓక్. కొంప మునిగింది. మైగాడ్ రక్షించండి" అంటూ బయటకు పరుగులెత్తాడు.

ఇంతలో బార్ వోనర్ వచ్చి చలపతిని "ఏమైంది సర్" అన్నాడు.

"నేను డ్రింక్ చేస్తుంటే దాదాగిరీ చేసి నా డ్రింక్ తాగేశాడు. వీడి రోగం ఇలా ఉందా అని కథ చెప్పాను. చచ్చాడు వెధవ. ఇంకెప్పుడూ ఎవరి మందూ తాగడు" అంటూ నవ్వసాగేడు చలపతి. బార్ వోనర్ చలపతి నవ్వుతో శ్రుతి కలిపాడు.

– కె.బి. కృష్ణ

# ఎన్నిక

ఇంటర్వ్యూ సరిగ్గా పదకొండున్నరకి. నేను బెంగుళూరు తొమ్మిదిన్నరకి చేరుకున్నాను. నాకోసం నన్ను ఇంటర్వ్యూకి పిలిపించిన కంపెనీ వాళ్ళే ఒక పెద్ద హోటల్‌లో గది బుక్ చేశారు.

ఆటోలో సరాసరి ఆ హోటల్‌కి చేరుకున్నాను. నాపేరు చెప్పగానే గది నెంబరు చెప్పి, గది తాళం చేతులు అందించారు నాకు. హోటల్ బాయ్ నా సూట్‌కేస్ తీసుకువస్తే టిప్ దొరకవచ్చని ఆశపడ్డాడు. కాని చిన్న బ్రీఫ్‌కేస్ మాత్రమే ఉంది నాదగ్గర. నేను బెంగుళూరులో ఉండేది ఒక్కరోజే. చెన్నై నుంచి బెంగుళూరుకి అది అవసరం లేదు. కాని తెచ్చాను.

గదిలో బ్రీఫ్‌కేస్ తెరచి, టవల్ తీసి మొహం కడుక్కొన్నాను. ఆ గదిలో డ్రస్సింగ్ టేబిల్‌కున్న డ్రాయర్ తెరిచాను నా కాగితాలు పెడ్దామని.

ఎదురుగా ఆ డ్రాయర్‌లో నా గుండె ఝల్లుమనేలా యాభై రూపాయల కట్ట ఉంది. ఆ కట్టతీసి చూశాను. అందులో పాతవి, కొత్తవి, నలిగినవి నలగనివి, అన్ని రకాల యాభై కాగితాలున్నాయి. లెక్కపెట్టాను. సరిగ్గా ఐదు వేలున్నాయి.

బహుశా ఆ గది ఖాళీచేసిన వాళ్ళు దాన్ని అక్కడ దాచి, ఖాళీచేసేప్పుడు తీసుకోవడం మర్చిపోయి ఉంటారు. జేబులో వేసుకుని వెంటనే ఇంటర్వ్యూకి హాజరవడానికి బయలుదేరాను. దారిలో ఆ కట్ట ఓ షాపులో ఇచ్చి ఐదు వందలనోట్లు పది తీసుకున్నాను. ఆ హోటల్ వాళ్ళకి డబ్బు మర్చిపోయిన సంగతి వాళ్ళు వచ్చికానీ, ఫోన్‌చేసి కానీ చెప్పినా, నన్ను వెదికితే అది దొరకదిక.

ఇంటర్వ్యూలో అన్ని ప్రశ్నలకీ సమాధానాలు చెప్పాను. చెన్నైలో నేను పనిచేసే కంపెనీలో నేను నిర్వహించే బాధ్యతలకన్నా ఇక్కడ ఇంకా ఎక్కువ నిర్వహించాలి. అందుకే జీతం ఎనిమిది వేలు కాక పన్నెండు వేలు ఇవ్వడానికి వాళ్లు సిద్ధమయ్యారు. ఎపాయింట్‌మెంట్ ఆర్డర్ నాలుగైదు రోజుల్లో పంపుతామని చెప్పారు.

హోటల్ గదికి తిరిగి వచ్చాను. ఎవరూ ఆ డబ్బు గురించి అడగలేదు. వెంటనే ఖాళీ చేసేశాను, అనవసరంగా కష్టం కోసం ఎదురుచూస్తూ కూర్చోవడం ఇష్టంలేక. వెంటనే చెన్నైకి వెళ్లే బస్సు ఎక్కాను.

నాలుగో రోజు నన్ను ఇంటర్వ్యూ చేసిన కంపెనీ నుంచి ఉత్తరం వచ్చింది. ఆత్రంగా కవరు విప్పాను. అపాయింట్‌మెంట్ ఆర్డర్ కాదది. ఉద్యోగం ఇవ్వటం లేదని రాసిన రిగ్రెట్ లెటర్. ఇంకా ఇలా రాశారు.

'మీకు ఇద్దామనుకున్న పోస్టులో పనిచేసే వ్యక్తి మంచివాడు, లంచాలు పుచ్చుకోనివాడు, దొంగతనం చేయనివాడు- ముఖ్యంగా అవినీతి



పరుషై వుండకూడదు. మీ మంచితనం నిర్ణయించడానికోసం, మీరు బసచేసిన హోటల్ గదిలో ముందుగా ఐదు వేలు ఉంచాం. మీరు వాటిని హోటల్ యాజమాన్యం వాళ్లకి తిరిగి ఇచ్చేసి ఉండాల్సింది. అది న్యాయం. మీరు దాన్ని సంగ్రహించటం మీ స్వభావాన్ని ప్రదర్శిస్తోంది. దయచేసి ఆ ఐదువేలు పంపవలసిందిగా కోరుతున్నాం. లేదా మీరు ప్రస్తుతం పనిచేస్తున్న కంపెనీకి ఈ సంగతి తెలియచేయాల్సి ఉంటుంది"

"...?"

**– బద్దిగం పాండురంగారెడ్డి**

# కుడి ఎడమైతే

"ఏమోయ్! సూట్ కేసు సర్దేశావా?" ఆఫీసు నుండి ఫోనులోనే గట్టిగా అరుస్తున్నాడు మోహన్.

"ఆ... ఆ... అన్నీ సిద్ధం! మీరేం గాభరా పడకండి. ఇంతకీ మీ టికెట్టు ఎక్కడుంది?" సిన్సియర్‌గా రెస్పాన్స్ చూపింది సుందరి.



"టికెట్టు బీరువాలో పెట్టాన్లే కానీ టిఫిన్ తయారే కదూ?"

సుందరి నవ్వుతూ, "ఆ... పూరీ, పొటాటో రెడీ, నీళ్లూ రెడీ! చాలా ఇంకేమైనా రెడీ చేయాలా?" అంది.

"థ్యాంక్యూ డియర్, వచ్చేస్తున్నాలే" అవతల నుండి క్లిక్‌మని ఫోను పెట్టేసిన చప్పుడు విని తానూ ఫోను క్రెడిల్ చేసేసింది. గడియారం వంక ఆతృతగా చూసింది. టైం అరగంటకన్నా ఎక్కువ లేదు రైలుకు. 'పరుగులు తప్పవు' అనుకుంటూ భర్త కోసం ఎదురుచూస్తూ కూర్చుంది.

ఆటో ఆగిన శబ్దం విని తలుపు దగ్గరకు గబగబా వెళ్లింది సుందరి. గేటు దగ్గర ఆటో దిగిన మోహన్, కాసేపాగితే ఐదు నిమిషాలలో వచ్చేస్తానని సర్దిచెప్పి హడావిడిగా లోపలికొచ్చాడు.

సుందరి కాఫీకప్పుతో ఎదురొచ్చింది, 'టిఫిను తింటారా కొద్దిగా' అంటూ. "ఇప్పుడేమీ వద్దు మేడమ్, ఇప్పటికే లేటయింది. ఇక్కడే బేగంపేటలో ఎక్కేస్తాను" షూ లేసు బిగించుకుంటూ చెప్పాడు మోహన్.

"సరే, ఇదిగో మీ

సూట్ కేస్. క్యారీబ్యాగ్‌లో పూరీ ప్యాకెట్టు, నీళ్లసీసా ఉన్నాయి. ఇంతకీ తిరుపతి నుండి ఎప్పుడు వచ్చేస్తారు? "

"ఓ గాడ్! అల్మైరా తియ్యి. టికెట్ తీసుకోవాలి".

సుందరికిక నడక కాదు పరుగే!

గబుక్కున టికెట్ తీసుకుని జేబులోకి కుక్కి, "వెంటనే వచ్చేస్తాలే, పెళ్లయిపోగానే" ఆటోవైపు కదిలాడు సరంజామా పట్టుకుని.

ఆటో కదిలింది వేగంగా!

పిల్లల చదువులు పాడయిపోతాయని సుందరి పెళ్ళిళ్లకు వెళ్లడం తక్కువే. ఉద్యోగంలో హడావిడి వున్నా ఎలాగో వీలు చూసుకుని బంధువుల మనసులకు బాధ కలగకుండా వాళ్లనుండి పెండ్లిపిలుపు రాగానే వెళ్లి వస్తుంటాడు మోహన్. స్నేహితులు పిలిచినా వెళ్తాడు స్నేహానికి భంగం వాటిల్లకుండా. అయితే ఎప్పుడూ హడావిడే! రైలునా, బస్సయినా ఏదో ఒకటి టికెట్ దొరికితే చాలు అనుకుంటాడు. లీవులు పెట్టకుండా సెలవులు కలిసొస్తే మరీ సంబరంగా వెళ్తాడు. అలా ముహూర్తం కుదిరిందే ఈ ప్రయాణం.

★ ★ ★

మోహన్ అటు వెళ్లగానే లోపలికి వచ్చి టి.వి. పెట్టుకుని వార్తలు వస్తుంటే చూస్తూ కూర్చుంది సుందరి. అంతలో ట్యూషన్ నుండి పిల్లలిద్దరు అలసటగా వచ్చారు. 'వాళ్లు నిద్రకాగలేరు. భోజనం పెట్టెయ్యాలి' అనుకుని టి.వి. ఆఫ్ చేసి వంటగదిలో కూర, చారు వెచ్చబెట్టి డైనింగ్ టేబిల్ మీద అన్ని సర్ది పెడుతోంది.

డోర్ బెల్ మ్రోగింది. పిల్లలిద్దరూ తలుపు తీయాలని పరిగెత్తారు.

"చూసి తియ్యండి బాబూ, పాపా" వెనక నుండి అరచింది సుందరి.

"అలాగే మమ్మీ" అంటూ తలుపు పక్కనే వున్న కిటికీ ఊచల నుండి బయటకు తొంగి చూశారిద్దరూ.

మరుక్షణం...

"అమ్మా! నాన్న వచ్చారు" అరిచారిద్దరూ సంబరంగా.

"నాన్న రావడమేమిటి? " టవల్‌తో చేతులు తుడుచుకుంటూ బయటకు వచ్చి ఆశ్చర్యంగా చూసింది సుందరి.

నవ్వు, ఏడుపు కలగలసిన ముఖంతో సోఫాలో కూలబడ్డాడు మోహన్.

"ఏమిటి, వెళ్లలేదా? " కారణం అర్థం కాక తెల్లబోతూ అడిగింది సుందరి.

"వెంటనే వచ్చేస్తానన్నానుగా, వెళ్లొచ్చేశాను" టికెట్ అందించాడు చూడమని.

"ఇదేమిటిలా? !" 'తిరుపతి నుండి హైదరాబాద్‌కు రిటర్న్ టికెట్!' "ఇలా ఎందుకు చేయించారు? " అయోమయంగా ఉంది సుందరికి.

"అది మన రాముడి పనిలే. వాడి 'హాఫ్ నాలెడ్జి' నాకు శ్రమపెట్టింది. ఫారంలో 'ఫ్రం, టు' నింపే చోట ఊళ్ళ పేర్లు అటుదిటు, ఇటుదటుగా రాసేశాడు. ఇంకేం? తిరుగు టికెట్ వచ్చేసింది, వెయిటింగ్ లిస్ట్ లేకుండా. పని తొందరలో ఉన్నప్పుడు చేతికిచ్చాడు. నా హడావిడిలో నేను చూసుకోలేదు. సరే కానియ్. రాత్రికిక పది గంటల బస్సుకు వెళ్తాలే" ఉస్సురంటూ నిట్టూర్చాడు మోహన్.

'కుడి ఎడమైతే పొరపాటు లేదోయ్' మనసులో పాట మెదలి నవ్వుకుంటూ పాట హమ్ చేయసాగింది సుందరి.

'మళ్లీ పెండ్లి పిలుపు వస్తే టికెట్టు స్వయంగా తెచ్చుకోవాలి. లేదా ఎవరైనా తీస్తే వెంటనే అల్మైరాలో పెట్టెయ్యకుండా కాస్త కళ్లప్పగించి చూడాలి'. అనుకుని మోహన్ అప్రయత్నంగా చెంపలేసుకుంటున్నాడు.

క్యారీ బ్యాగ్ నుండి పూరీ, కూర తీసి ప్లేట్లో పెట్టి తెస్తున్న సుందరి పకపకా నవ్వసాగింది.

— సి.ఉమాదేవి

✦

# 'సత్తికొండ' పై సమీక్షలు

మార్చి 2005 'చతుర'లో ప్రచురించిన ఐతా చంద్రయ్య నవల 'సత్తికొండ' పై మాకు అందిన ఉత్తమ సమీక్షలు

## నూటికో కోటికో ఒక్కరు

*(మొదటి బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

ఈ రోజుల్లో రక్త సంబంధీకులైన వారి మధ్య కూడా విభేదాలు, గొడవలు, హత్యలు జరుగుతున్న నేపథ్యంలో మానవ సంబంధాల మధ్య గల ధృఢత్వాన్ని, దాని ఆవశ్యకతను చక్కగా వివరించినదీ నవల. ప్రస్తుత సమాజంలో మనిషికి మనిషికి మధ్య ఉండాల్సిన సంబంధం, ఒకరికొకరు సహకరించుకుని, ఒకరి ఉన్నతిని మరొకరు కోరుకుని సమాజాభివృద్ధికి తద్వారా దేశాభివృద్ధికి కృషి చేయాల్సిన విధానాన్ని ఈ నవల చక్కగా తెలియజేసింది. ముఖ్యంగా సత్తికొండ ఊరి కాని ఊరిలో ఆదుకున్న తీరు అనన్యసాధ్యం. నిజంగా సత్తికొండ లాంటి వాళ్ళు నూటికో కోటికో ఒక్కరు మాత్రమే ఉంటారు.

మానవ జన్మ పరమార్థమైన "పరోపకారం" మనిషి మనసు యొక్క ఉన్నతిని సూచిస్తుంది. దీనికి సాక్ష్యాలుగా ఈ నవలలో సత్తికొండ మరియు కృష్ణమూర్తి బృందంను పరిపూర్ణత గల పాత్రలుగా రచయిత తీర్చిదిద్దారు. "నీకున్న రెండు చేతులలో ఒకటి నీకోసం మరొకటి నీ ప్రక్కవాడి కోసం" అని ఎంతో చాకచక్యంగా రచయిత చెప్పిన తీరు ప్రశంసనీయం. కృష్ణమూర్తి బృందం గిరిజ భర్త పైడితల్లిని మంచి మార్గంలోకి నడిపించడం, అతడి ప్రమోషన్ కోసం ప్రయత్నించడం, చివరిగా అతనికి ఏక్సిడెంట్ అయినపుడు కూడా అయిన వాళ్లలా చూసుకోవడమే కాకుండా గిరిజ సీమంతం కూడా వారి చేతుల మీదుగా జరపడం చేశారు. సత్తికొండ ఊరు కాని ఊరిలో కృష్ణమూర్తి బృందానికి అన్నివిధాల సాయపడడం, భార్య అనారోగ్యం గూర్చి తెలిసి ఊరెళ్ళడానికీ, జ్వరం వస్తే తల్లిలా సేవలు చేయడం ఇవన్నీ వారి మధ్య ఇచ్చిపుచ్చుకునే ధోరణికి మార్గదర్శకంగా నిలిచాయి. మంచి మనసుకు కులం, మతం, లింగవివక్షలు ఉండవన్న సంగతిని చాలా హృద్యంగా చిత్రీకరించారు.

కల్మషం లేని మనుషులకు ఎదుటివారిలో మంచి మనిషే కన్పిస్తాడు అనడానికి సత్తికొండ, సిద్దయ్యల హుషారు సరదా సంభాషణలే ప్రతీక. అదే విధంగా ఆనాటి రాజకీయాల గూర్చి విపులీకరిస్తూనే టెలీగ్రాఫ్ ట్రైనింగ్ విశేషాలు, దాక్షారామం, అన్నవరం పుణ్యక్షేత్రాల సందర్శనం, యానాం ప్రాముఖ్యతను, ప్రకృతి దృశ్యాలను కళ్ళకు కట్టినట్లుగా వర్ణించడంలో రచయిత తన ప్రత్యేకతను చాటుకున్నారు.

క్లైమాక్స్‌లో కృష్ణమూర్తి బృందం ట్రైనింగ్ పూర్తి చేసుకుని వెళ్ళేటపుడు రైల్వే స్టేషన్‌లో వారి మధ్య జరిగిన సంభాషణ నవలకు వన్నె తెచ్చింది. పరిస్థితిని బట్టి సామెతలు ఉపయోగించడంలో, నవలను ఆద్యంతం రసవత్తరంగా మలచడంలోనూ రచయిత ఐతా చంద్రయ్య గారు కృతకృత్యులయ్యారు. గిరిజ కొడుకు కృష్ణమూర్తి, కృష్ణమూర్తి రెండో కూతురు శైలజతో వివాహం నిశ్చయించడం కొసమెరుపు.

*– ఎం.ఏడుకొండలు, మహాదేవపురం, మధిర -507203.*



# మానవీయతలోని మహనీయత

(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

మానవునిలోని మానవీయత అందులోని విలువలు ఈనాటి సమాజానికి ఎంత అవసరమో సత్తికొండ పాత్ర ద్వారా రచయిత ఆ సన్నివేశాలను చాలా చక్కగా, హృదయాన్ని కదిలించేలా చిత్రీకరించారు.

ప్రస్తుతం మన రాష్ట్రంలో ఒక ప్రాంతానికి చెందిన ప్రజానాయకులనిపించుకున్న వారు ఊదరగొడుతున్న ప్రాంతీయ వేర్పాటు భావన ప్రజలలో లేదని ఈ నవల నిరూపించింది. ఎందుకంటే రచయిత రాయలసీమలోని అనంతపురవాసి అయిన ఒక వేణుగోపాల్‌ను, సర్కారులోని అనకాపల్లెవాసి సత్యనారాయణనూ, తెలంగాణ నుండి నవలలో హీరో క్రిష్ణమూర్తి, సిద్ధయ్య, రాజయ్యలను కాకినాడ బుడంపేటలో ఒకలోగిలిలో ఉంచారు. ఆరునెలలలో వారి మధ్య ఏర్పడిన ప్రేమ, ఆప్యాయతలు, మన రాష్ట్రం మూడు ప్రాంతాల్లో వాడుకలో ఉన్న మాండలికములోని కొన్ని పదాల అర్థాలు తెలుసుకోవాలనే ఆదుర్దా గమనిస్తే విడిపోవాలనే భావన పదవుల కొర్కై వెంపర్లాడే ఆ ప్రజానాయకులకు తప్ప మన మూడు ప్రాంతాల జనాలకు ఏమాత్రం లేదని నిరూపించిందీ నవల.

స్త్రీ మనస్తత్వం గూర్చి హీరో క్రిష్ణమూర్తి ద్వారా రచయిత ఇల్లాలిలో కొంత తల్లితత్వముంటుందని అదే తల్లిలో ఇసుమంత ఇల్లాలి తత్వం కూడా ఉంటుందని చెప్పించడమొక నగ్నసత్యం.

నవల ఆఖరున గిరిజ కొడుకు, క్రిష్ణమూర్తి కూతురి మధ్య జరిగిన ప్రేమాయణం పెండ్లి దాకా తేవడం క్యాసెట్టు ఫాస్ట్ ఫార్వడ్ చేసినట్లుంది.

నవలకు హైలైట్ శ్రీశ్రీగారి చతురోక్తులు.

– చింతల మాధవి, వాల్మీకిపురం.

# సామాజిక ధర్మం

(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

'సత్తికొండ' నవలలో రచయిత తన టెలిగ్రాఫ్ ట్రైనింగ్ అనుభవాలను పొందుపరిచారు. కానీ దీనిని ఒక 'డాక్యుమెంటరీ'గా కాకుండా 'సత్తికొండ' కథను జోడించి ఎక్కడా విసుగు అనిపించకుండా నవలను నడిపించి ఒక మంచి సినిమాను చూస్తున్న ఫీలింగ్ కలిగించారు. ఈ నవలలో ఉపకార, ప్రత్యుపకారాలు, సెంటిమెంట్లు, సరస సంభాషణలూ, ఒక ఫైటూ, ప్రేమ వివాహం వగైరా ఉన్నాయి.

ఈ నవలలో 'సత్తికొండ' ఒక ఆదర్శ మహిళ. తన ఇంట్లో అద్దెకుండే కుర్రాళ్లను కన్నకొడుకుల్లా ఆదరిస్తుంది. వాళ్ల కష్టసుఖాల్లో పాలుపంచుకుంటుంది. వాళ్లకు సుస్తీ చేస్తే సేవలు చేస్తుంది. ఒంటరిగా కాలం గడిపే వారిని అడ్డదారులు తొక్కకుండా సరియైన మార్గాన నడిపిస్తుంది. సరససంభాషణల్తో వారిని సంతోషపరుస్తుంది. ఈ పాత్ర చుట్టూ కృష్ణమూర్తి, సిద్దయ్య, కాశీనాథ్, సత్యనారాయణ, రాజయ్య పాత్రలు పరిభ్రమిస్తూ ఉంటాయి.

ఈ నవలలో మనకు ఒక ముఖ్యమైన సామాజిక ధర్మం కనిపిస్తుంది. అదే 'రెసిప్రోకసీ'. ఇచ్చిపుచ్చుకునే ధోరణి. సత్తికొండ వారికి సహాయపడితే వారు సత్తికొండకు సహాయపడతారు. ఆమె కూతురు కాపురాన్ని చక్కదిద్దుతారు. నవలలో రచయిత వాడిన ఉపమానాలు కూడా చాలా సహజంగా, నవ్వుత ఉట్టిపడుతున్నాయి. ఉదాహరణకు: "మనిషి మనసనేది ఒక స్క్రాచ్ కార్డు లాంటిది. ఎంతసేపు చూసినా ఎదుటి వారికి అర్థంకాదు. రాపిడికి గురైనప్పుడే అసలు విషయం బయటపడుతుంది" ఇటువంటి ఉపమానాలు ఈ నవలలో కోకొల్లలు.

– జి. సత్యనారాయణమూర్తి
జగ్గన్నపేట.

## స్నేహానికి ప్రతిరూపం

*నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష*

ప్రారంభం నుండి తుది దాకా ఏకబిగిన చదివించగల 'సత్తా' ఉన్న నవల 'సత్తి కొండ'. నవల పేరు వినగానే అదేం పేరు అని అనిపించినా, నవల సాంతం చదివాక ఆ పేరే తగిన పేరని ఖచ్చితంగా ఎవరైనా ఒప్పుకుంటారు. స్నేహానికి ప్రతిరూపం సత్తి పండు, ఆత్మీయతకు ఆనవాలు సత్తిపండు, అభిమానానికి ఆలవాలం సత్తిపండు.

కాలేజీ అనుభవాలను మనం అప్పుడ ప్పుడూ ఎన్నింటినో గుర్తుకు తెచ్చుకుంటాం. జ్ఞాపకాల పొరల్లో మధురంగా దాచు కుంటాం. ఈ నవలలో కూడా ట్రైనింగ్ పీరి యడ్‌లోని మధుర జ్ఞాపకాలన్నీ గుత్తులు, గుత్తులుగా దాచుకొన్న వైనం, వాటినన్నిటినీ వెలికితీస్తూ కథను నడిపిన తీరూ ఎంతో బాగుంది. కానీ నాకర్థం కానిది ఒక్కటే - మామూలుగా గవర్నమెంట్ డిపార్ట్‌మెం ట్స్‌లో ట్రైనింగ్ ఇస్తున్నప్పుడు వసతిసదుపా యాలు కూడా ట్రైనింగ్ కాలేజీలోనే ఉంటాయి కదా!

'నవ్వు మనిషికి మాత్రమే దేవుడిచ్చిన వరం. అది ఎన్నో రుగ్మతలకు మందు' లాంటి వాక్యాలూ, సత్తికొండ అంటే ఏమిటో చెప్పిన తీరూ, అక్కడక్కడా వివిధ మాండ లికాలు వివరించిన పద్ధతీ, దాక్షారామం, అన్నవరం, యానాంల గురించి పరిచయ వాక్యాలూ, తప్పుదారిపట్టిన పైడితల్లి, మెట్ట య్యలను సరిఅయిన దారికి తెచ్చిన వైనమూ - ఇవన్నీ కలిసి నవల చదవడానికి ఎంతో దోహదం చేశాయి.

*- బి.నరహరి, అనంతపురం*

## పొగడపూదండ

*(ఐదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

పలు మాండలిక పదాల మాధుర్యాన్ని జాలువార్చుతూ తెలుగు భాషా సొబగుల్ని అడుగడుగునా వెదజల్లుతూ మన తెలుగు తల్లి మెడలో పొగడ పూదండలా... అందంగా, అద్భుతంగా అపురూప కథనా విధానంతో, హృదయాలను సేదతీర్చే చల్లని మలయానిల తాకిడిలా సాగిన ఐతా చంద్ర య్యగారి 'సత్తికొండ' బహుధా ప్రశంస నీయం!

చెట్టు మీది కాయలను, సముద్రంలోని ఉప్పును కలబోసి కలిపినట్టుగా అటు రాయలసీమను ఇటు తెలంగాణను తీసుకు వచ్చి మధ్యలో కోస్తా తీరాన సావాసం చేయించిన తీరు మెచ్చతగినది. ప్రేమాభి మానాలకు ప్రాంతీయతాభావనలు అడ్డుగో డలు కావన్న నగ్న సత్యాన్ని కళ్ళకు కట్టిం చారు. ప్రాంతాలు వేరైనా అంతరంగాలలో అందరం ఒకే జాతి గువ్వలం ఒకే తీగ పువ్వులం అన్న వాస్తవికతను స్పష్టం చేశారు. రాజకీయ స్వలాభాల కోసం కొం దరు ప్రాంతీయ తత్వాన్ని రెచ్చగొడుతున్న తరుణంలో ఈ నవల రావడం హర్ష ణీయం.

నవలలోని పాత్రలన్నీ తమతమ పరి ధుల్లో చక్కగా ఇమిడిపోయాయి. ఒకరు తక్కువ, మరొకరు ఎక్కువ అన్న తేడా లేకుండా ఎవరికి వారు తమ కర్తవ్యాన్ని చక్కగా నిర్వర్తించారు. ఒకరికొకరు ఆప్యా యతల్ని పంచుకున్నారు. అనుభూతుల్ని కలబోసుకున్నారు. అమ్మ ప్రేమ, చెల్లెలి మమకారం, అన్నల ఆదరణ ఒకటేమిటి! ఎన్ని రకాల అనుబంధాలో! అడుగడుగునా అలవోకగా మనసులకు హత్తుకుపోయి మెత్తగా సాగిపోయింది అజ్ఞాతవాసంగా సాగవలసిన ట్రైనింగ్ కాలమంతా!

చివర్లో సత్తికొండ, పైడితల్లి లేకపోవడం ఎంతో వెలితిగా అన్పించింది. వాళ్ళుంటే ముగింపు ముచ్చటగా వుండేది.

*- యస్.యన్.మూర్తి, తణుకు-534211*

★

సచిత్ర విచిత్రం

# సర్కస్! సర్కస్!



ఆబాలగోపాలాన్నీ అల రించే వినోద సాధనాల్లో సర్కస్ ప్రముఖస్థానాన్ని ఆక్రమిస్తోంది! అయితే అనేక వ్యయప్రయాసల కారణాలవలన, నిర్వాహకులు సర్కస్ కళను ప్రదర్శించడం కష్టతరంగా ఉంది. ఈ పరిస్థితిలో ప్రపంచ ప్రఖ్యాతి చెందిన రష్యన్ సర్కస్‌వారు ఆ వినోద ప్రదర్శన మెరుగు పరచాలని నడుం కట్టారు. మోనాకోలో జరిగిన సర్కస్ వేడుకల్లో రష్యాలోని మార్క్స్ బృందం వారు అద్భుతమైన విన్యాసాలతో తమ సర్కస్ ప్రదర్శించారు. నయనానందకరమైన ఈ దృశ్యంలో ఉన్న వారందరూ విద్యార్థులే!!

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.



కేరళ "తిరువనంతపురం" భూలోక వైకుంఠం!
అనంత పద్మనాభస్వామి వేంచేసిన ఆనంద నిలయం!!

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2003-2005 RN1/32186/78